

భారతి, మే '50. పెండ్లి చూపులు మాధవపెద్ది గోపాలకృష్ణ గోఖలే.




వికృతి సం.
వైశాఖము

# భారతి

సంపుటము 27
సంచిక 5


# కవితాజిజ్ఞాస


శ్రీ కొండూరి నరసింహం


కల మాడించి, కవిత్వరాజ్యమున స్వర్గా లెన్నొ సృష్టించు నే
ర్పులు-మాయామయమోహవీచికల పొల్పుం బొందు కాలంబుగా
తలలో రాక్షసలోకముల్ తిరుగు వింతల్ పుట్టు పైశాచిక
ప్రళయోన్మాదమరుత్తరంగముల నెవ్వా డిట్లు మేల్కొల్పెనో....

అల రామాయణకావ్యకర్త మొద లీవ్యాపారపారంగతో
జ్జ్వలవాఙ్నైపుణి ధీవిలాసుల కవిత్వం బెన్నగా-మిన్నగా
విలిఖింపందగు వృత్త మిప్పు డిక ప్రాప్తించేది లే దయ్యయో!
కలమా యెట్టులు సాగిపోవు కళయే గన్పట్ట దీభూములన్...

ఆకట దూలిపోయి, ప్రళయాంతసమస్యలు సోలిపోయి, వి
శ్వాకులశోకసంకులితసంకటముల్ జనియించు బాంబు లే
వో కలవంచు బెగ్గడిలి, ఒక్కదినమ్ము యుగంబుగాగ దో
షాకృతి దాల్చు భీషణశతాబ్దుల కావ్యము లేమి వ్రాయుటో?

మతవైషమ్యము,మారణాయుధసృజనామ్లిన్యసంక్లేశ ము
ద్ధతవైదేశికవిప్లవక్రమసుసంధానమ్ము,నైరాశ్యశో
షితజీవన్మృతకాందిశీకనిచయక్లేశమ్ము, బీభత్స మీ
స్థితకాలమ్మున వాణి మూగయగు భారతిక్ దోచు టబ్రం బౌకో....

తాజమహాలులో గలుగు తళ్తళ లెల్ల నశించునట్లుగా
రాజచరిత్రలో గలుగు రాజస మెల్లను వమ్ముగాగ నే
రోజ కలంబు సాగు నిక-ఒల్లను చర్వితచర్వణంబు లీ
సాజముగాని పద్దెముల సాగగదీయుట లేల భారతీ!

వ్రాసిన వ్రాతయే మఱల వచ్చిన భావమె వచ్చుచుండ-ఏ
కాసరకూనలైన శతకమ్ములనో మతిలేని గీతికా
న్యాసమునో సృజించి,కవి నంచు,తిరుంగగ సిగ్గువుట్టు నా
యాసము ద్రుంచు శాంతి యిక అబ్బదు నాకు యుగాలకేనియున్..

శృంగంబుల్ మొలిపించుకొన్న కవిరాజశ్రేణి యీ తెల్గులో
బెంగాల్ గేయమొ,ఇంగిలీషుకవితాబీభత్సమో,తర్జమా
కంగాళిక్ బడిపోయి తెచ్చుకొనుటే ఖాయంబుగాగా-ఇకే
బంగారంబును పాతుడీయుదు మదంబా!నన్ను మన్నింపుమీ!

వ్యాకరణంబు వద్దు-పయిబడ్డ సమాసపు తుక్కు- మోయగా
నా కవమాన మౌను-పరిణామనిబద్ధకువర్ణనాతతిక్
లేకితనంబు జాస్తి-ఎటులేని శతాధికపత్రపత్రికా
నీకము నన్ను మెచ్చుటయె నిత్యము వాంఛ-ఇదేమి చోద్యమో...

---

# వాద ప్రతివాదములు : యాస్కుని సిద్ధాంతము

శ్రీ శివశంకరస్వామి

ఉపసర్గలక్షణమును గూర్చి శాకటాయనునకును గార్గ్యునకును మతభేదము కలదు. కావుననే యాస్కుడు నిరుక్తమున నిట్లు చెప్పెను: "న నిర్బద్ధా ఉపసర్గా అర్థా న్నిరాహు రితి శాకటాయనః. నామాఖ్యాతయోస్తు కర్మోపసంయోగద్యోతకా భవన్తి. ఉచ్చావచాః పదార్థా భవన్తీతి గార్గ్యః. తద్య ఏషు పదార్థః ప్రాహు రిమే తం నామాఖ్యాతయో రర్థవికరణమ్. ఆ ఇత్యర్వా గర్థే. ప్రపరే త్యేతస్య ప్రాతిలోమ్యమ్. అభీత్యాభిముఖ్యమ్. ప్రతీ త్యేతస్య ప్రతిలోమ్యమ్. న్యవేతి వినిగ్రహార్థీయౌ. ఉది త్యేతయోః ప్రాతిలోమ్యమ్. సమి త్యేకీభావమ్. వ్యపే త్యేతస్య ప్రాతిలోమ్యమ్. అన్వితి సాదృశ్యాపరభావమ్. అపీతి సంసర్గమ్. ఉపే త్యుపజనమ్. పరీతి సర్వతోభావమ్. అధీ త్యుపరిభావ మైశ్వర్యం వా. ఏవ ముచ్చావచా నర్థాన్ ప్రాహు స్త ఉపేక్షితవ్యాః." (౧-౩=౩-౨౨) ఉపేక్షితవ్యాః అనగా, "తే చ కస్మి న్నర్థ ఇతి, తద్వ్యక్త్య ముపగమ్య ఈక్షితవ్యాః" (స్కన్దస్వామి) అని యభిప్రాయము. దుర్గాచార్యుడుకూడ "కః కస్మిన్నర్థే వర్తత ఇత్యేవం ద్రష్టవ్యాః పరీక్ష్య ఇత్యర్థః" అన్నాడు. శాకటాయనుని హృద్గతార్థమును తెలుపుటకై వృత్తికారు డగు దుర్గాచార్యుడు ఇట్లు లిఖించినాడు: "నామాఖ్యాతయో రేవార్థవిశేష ఉపసర్గసంయోగే సతి వ్యజ్యతే. యథా ప్రదీపసంయోగే ద్రవ్యస్య గుణవిశేషోఽభివ్యజ్యమానో ద్రవ్యక్రియయైవ భవతి, న ప్రదీపక్రియయా... 'ప్రదీపవ ద్వర్తకా ఉపసర్గా' ఇతి." యాస్కు డిచ్చట గార్గ్యపక్ష మవలంబించినాడు. గార్గ్యుని యభిప్రాయ ముద్ఘాటన చేయుటకై వృత్తికారు డిట్లు వ్రాసినాడు: "ప్రదీపోఽపి స్వేనార్థేన ప్రకాశాఖ్యే నార్థవానేవ, సత్యపి చార్థవత్త్వే ప్రకాశ్య మర్థ మాధారభూతం ప్రత్యాయయన్ స్వం ప్రకాశనశక్తి మభివ్యనక్తి. ఏవ ముపసర్గా అర్థవన్తోఽపి సన్తః స్వార్థ మభిధానశక్తి మనేకప్రకారాం విద్యమానామపి స్వార్థాభిధానశక్త్యాధారభూతే నామాఖ్యాతే ప్రత్యాయ్య అభివ్యంజయేయుః". (నిరుక్తవృత్తి ౩౬, ౩౭ పృ. దధిమన సం) ఈవిషయమున హరప్రసాదశాస్త్రి మహోదయు లిట్లు వ్రాసినారు: Sākatāyana says that upasargas when detached from nouns or verbs do not distinctly express a sense. Gārgya who is in advance of Sakatayana says that they express a variety of senses. yāska agrees with Gārgya but Pānini says: They are Nipātās or particles, they are upasargas or prefixes when joined to verbal actions, Gatis if the verbal roots to which they are attached become nouns, and Karma pravachania (post-positions) when they are detached and govern nouns."

పాచకాదిశబ్దములు ప్రకృతిప్రత్యయయోగమున సాధకము లయినవి. ప్రత్యయములు నానావిధములు. ప్రకృతిమాత్రము నామమని, ధాతువని ద్వివిధము. కావుననే శబ్దశక్తిప్రకాశికలో జగదీశు డిట్లన్నాడు:

"నిరుక్తా ప్రకృతి ర్ద్వేధా
నామధాతుప్రభేదతః

"నామః ప్రకృతిక శ్చైవ
ధాతుప్రకృతిక స్తథా."

నామ మనునదే కలాపమున లింగ మయినది. "లింగ్యతే చిహ్న్యతేఽనేనేతి లింగమ్" అన్నారు శాబ్దికులు. "ధాతువిభక్తివర్జ మర్థవ ల్లింగమ్" (చ ౧) అని కాతంత్రమున సూత్రితము. నామముకాని, లింగముకాని ప్రాతిపదికమని పాణినీయమున ఎక్కువగా ప్రసిద్ధము. శాబ్దికులు "పదం పదం ప్రతీతి వీప్సార్థే ప్రతిపదమ్, ప్రతిపదం గృహ్ణాతీతి ప్రాతిపదికం, పదస్యైకాంశ ఇత్యర్థః" అన్నారు. "అర్థవదధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్" అని పాణిని (౧-౨-౪౫). అందుచే, దేనికి అర్థ మున్నను విభక్తి లేదో, ఏది ధాతువుకాదో, దానికి లింగమని కాని, ప్రాతిపదికమని కాని పేరు.

క్రియ యనియే ధాతువున కర్థము. కావుననే "ధాత్వర్థః క్రియా" అన్నారు. క్రియావచన మని, భావవచనమని ధాతువు ద్వివిధము. క్రియావచన ధాతువునుగూర్చి, "కథం పునః జ్ఞాయతే క్రియావచనాః పచాదయ ఇతి ? యదేతేషాం కరోతినా సామానాధికరణ్యమ్. కిం కరోతి ? పచతి. కిం కరిష్యతి ? పక్ష్యతి" (౧-౩-౧) అని పతంజలి పలికినాడు. ఇదియే క్రియాసాధ్యతావస్థ యని ప్రసిద్ధము. ధాతువు భావవచనముకూడ కాగలదు. భావసంబంధమున, "ప్రకృతిజన్యబోధే ప్రకారో భావః" (౫-౧-౧౧౯) అని భట్టోజి చెప్పినాడు. ఇది క్రియాసిద్ధతావస్థ. ఈరెండవస్థలను గూర్చి దీపికలో భర్తృహరి యిట్లు వ్రాసినాడు:

"క్రియాయా స్సాధ్యతావస్థా
సిద్ధతా చ ప్రకీర్తితా,
సిద్ధతా ద్రవ్య మిచ్ఛన్తి
తత్రైవేచ్ఛన్తి ఘఞ్ విధిమ్."

ధాతువు తప్పక భావవచనము కాగలదు. కాని భావము ఎన్నడును సుస్థిరము కానేరదు. ఏది భావమో దానికి జాగతికసత్త కలదు. దేనికి జాగతికసత్త కలదో దానికి వికారముకాని, పరిణామముకాని అవశ్యంభావి యని భగవాన్ వార్ష్యాయణిమతము. మహాభాష్యమున నిట్లు చెప్పినారు: "న హీహ కశ్చిత్ స్వస్మి న్నాత్మని ముహూర్త మవతిష్ఠతే. వర్ధతే వా యావ దనేన వర్ధితవ్య మపాయేన వా యుజ్యతే." (*Neilhorn edition* : ఖండ ౨, పృష్ఠ ౧౯౧) అందులకే భర్తృహరి యిట్లు చెప్పినాడు:

"సైవ భావవికారేషు
షడవస్థాః ప్రపద్యతే
క్రమేణ శక్తిభి స్సాభి
రేవం ప్రత్యవభాసతే." (వాక్య : ౩-౩౬)

కావున భావవచనధాతుక్రియ సిద్ధమని — అనగా ఉదారము కాదని, తన్నిష్పన్నశబ్దసమూహమునకు ప్రాతిపదికత్వము స్వీకృతమయియుండనోపును. ఉదాహరణము: పచ్ ధాతువు, పచనము (పాకము) ప్రాతిపదిక.

ప్రాతిపదికముగాని, నామముగాని ధాతువు కాకున్నను, ధాతుజము కావచ్చును. పాకశబ్దము ధాతువుకాని మాట నిజమే, కాని యిది ధాతుజ మనవచ్చును. సకలనామములు ధాతుజములా అను ఆకాంక్ష యిచ్చట కలుగును. దీనిని గూర్చి శాకటాయనునకు, గార్గ్యునకు మతభేదము కలదు. వీరి గ్రంథములు లభ్యము కాలేదు. అయినను, యాస్కుని నిరుక్తమున ఉభయుల మతసారాంశములు నిబద్ధములయినవి. శాకటాయనుని మతమున పదార్థము ద్రవ్యప్రధానమయినను గుణప్రధానమయినను అయ్యది జాగతికభావమున (సత్త) కధీన మయినపుడు ధాత్వర్థక్రియయు అందు అంతర్లీనవృత్తి యయియుండును. కావున నామమాత్ర మెల్ల ధాతుజమని చెప్పవలసియుండును. ఇట్టి యోచనతో శాకటాయనుడు సమస్తనామములకు ధాతుజత్వము జూప ప్రతిజ్ఞ చేసి, నిజవ్యాకరణమున కృత్ సూత్ర, ఉణాదిసూత్రములలోను, అవసరమగు తావులను ఊహనద్వారమునగూడ ప్రయత్నము చేసినాడు. నైరుక్తులు (*Etymologists*) శాకటాయనుని సమర్థించినను, గార్గ్యమహర్షియు, ఇతర వైయాకరణులు కొందరును తీవ్రముగా ప్రతిఘటించినారు. అందులకే యాస్కమహర్షి "తత్ర నామాన్యాఖ్యాతజానీతి శాకటాయనో నైరుక్తసమయశ్చ. న సర్వాణీతి గార్గ్యో వైయాకరణానాం చైకే" (౧-౧౨-౨,౩ నిరుక్త) అన్నాడు.

"సర్వాణి నామా న్యాఖ్యాతజాని" అన్నాడు శాకటాయనుడు. అనగా ప్రాతిపదికమాత్రమంతయు ధాతుజ మని తాత్పర్యము. కేవలపాచకకారకాది ప్రత్యక్షక్రియా శబ్దము కాదు. అశ్వగో ప్రభృతి

ప్రకల్పితక్రియ శబ్దము, డిత్థ* డవిత్థాది అవిజ్ఞాతక్రియ శబ్దము, వ్యుత్పన్న ప్రాతిపదికము నని దీనివలన గ్రహింప వలెను. కావున అవయవార్థముతో గూడ—అనగా ప్రకృతిప్రత్యయకల్పితభావార్థముతో గూడ — సముదాయార్థము అన్నియెడల అన్వితము కాకున్నను ఆ శబ్దము ధాతుజ మనదగినదియై యుండును. ఏసకలశబ్దములు అవిజ్ఞాతక్రియలో వానికి ధాతుజత్వము ఏరీతిని కల్పింప నగును ? శాకటాయనుని మతప్రకారము అట్టియెడల ఊహన మావశ్యకము. కానిచో మనము ప్రయుక్తశబ్ద సమూహము పశుపక్షుల చీత్కారరవములవలె నుండును.

ఊహనసంబంధమున వ్యాఘ్రభూతి శ్లోకవార్తికములో "యన్న విశేషపదార్థసముత్థం ప్రత్యయతః ప్రకృతేశ్చ తదూహ్యమ్" అని స్మరించినాడు. కైయటు డిట్లు పలికినాడు: "పద మర్థః ప్రయోజనం యస్యవ్యుత్పాద్యత్వేన స పదార్థః ప్రకృత్యాదివిశేష. శ్చాసౌ పదార్థః తస్మాత్ యన్న సముత్థితం విశిష్ట ప్రకృతిప్రత్యయోత్పాదనేన వ్యుత్పాదిత మిత్యర్థః."

పైశ్లోకమునకు కాశికలో "పదార్థవిశేష సముత్థమ్" అను పాఠాంతరము కలదు. జినేంద్రబుద్ధి యిట్లన్నాడు: "ప్రకృతిః ప్రత్యయశ్చ పదార్థ స్తస్య విశేషః. సముత్థః సముత్థానం ప్రాదుర్భావః. పదార్థ విశేషాత్ సముత్థః ప్రాదుర్భావో యస్య తత్ పదార్థ విశేషసముత్థమ్" ప్రథమపాఠమే హృద్యతర మనిపించును. మహాభాష్యమున దీని వ్యాఖ్యానావకాశమున, "అథ యస్య విశేషపదార్థో న సముత్థితః కథం తత్ర భవితవ్యమ్ ? ప్రకృతిం దృష్ట్వా ప్రత్యయ ఊహితవ్యః, ప్రత్యయం చ దృష్ట్వా ప్రకృతి రూహితవ్యా" అని స్మరించినాడు. ఉణాదిశాస్త్రానుసారముగా దీని తాత్పర్యము, ఉదాహరణము నిట్లుండును: "యద్యపి ప్రకృతిప్రత్యయవిశేష ముపాదాయ న వ్యుత్పాదితం శబ్దరూపం తస్యాపి ధాతుజత్వ మూహన ద్వారేణ వేదితవ్యమ్. న హ్యనిరూపిత ప్రకృతిప్రత్యయతః శక్యం ధాతుజత్వం కస్యచి న్నిశ్చేతు మితి కిమత్రాయుక్తమ్ ? యత్ర ప్రసిద్ధప్రత్యయావయవేన శబ్దాన్తరేణ కస్యచి ద్భాగస్య సారూప్య మనుభూయతే తత్ర ప్రత్యయ మవలోక్య పరిశిష్టో భాగః ప్రేక్షితవ్యః ప్రకృతిత్వేన ఊహ్నితవ్యః. 'యథోషి కుషిగా ర్తిభ్య స్థన్' (ఉణాది ౨—౧౮౧) ఇతి థన్ప్రత్యయాన్త మాష్ఠాదికం ప్రసిద్ధప్రత్యయావయవమ్. తేన చ డిత్థడవిత్థ శబ్దయోః కించిత్ సారూప్య మస్తి. తథైషా మివ హి తేషాం థశబ్దోఽవయవో విశిష్టదేశవర్తీ విద్యతే. తత్ర థన్ప్రత్యయాన్తే శబ్దరూపే యోదృష్ట 'థ' శబ్దః ప్రత్యయసజ్ఞకః తత్ సాదృశ్యాత్ డిత్థడవిత్థ శబ్దసంస్థశబ్దం ప్రత్యయ మవధార్య తతః పరిశిష్ట స్తయో ర్భాగో డిఙ్ డవిత్థి చ ధాతుత్వే నోహ్యః. తత స్త్వేవం సూత్రం కర్తవ్యమ్—డీఙ్పక డబ్బవిచ్ఛేతి. డీఙ్ గతౌ, ధాతూనా మనేకార్థత్వా దిత్యస్మాత్ థక్ ప్రత్యయః. డీఙశ్చ డిడ్ డవి దిత్యేతా వాదేశౌ భవతః. యత్ర తు శబ్దరూపే నిర్జ్ఞాతధాత్వవయవేన శబ్దాన్తరేణ కించిత్ భాగగతం సారూప్యమస్తి తత్ర ప్రకృతిం దృష్ట్వా పరిశిష్టో భాగః ప్రత్యయత్వే నోహితవ్యః. యథా—ఋతమితి దృష్టం శబ్దరూపం ప్రసిద్ధప్రకృత్యవయవమ్. తేన ఋషిశశబ్దస్య ఋషిడ్ శబ్దస్య చ కించిత్ భాగగతం సారూప్య మస్తి. ఉభయేషాం తేషామృకారాదిత్వాత్. తత్ర నిష్ఠాప్రత్యయాన్త ఋత శబ్దేయ ఋకారావయవో. ధాతుసంజ్ఞకః తత్సాదృశ్యాత్ ఋషిశఋషిడ్శబ్దయోశ్చ ఋవర్ణం ధాతు మవధార్య తతః పరిశిష్ట స్తయో ర్భాగః షిశ ఇతి షిడ్ ఇతి చ ప్రత్యయత్వే నోహ్యః. తత స్త్వేవం సూత్రం కర్తవ్యమ్— అర్తేః షిశషిడావితి—ఋగతావిత్యస్మాత్ షిశషిడౌ ప్రత్యయౌ భవతః. ఋషిశః ఋషిడః. గుణః పూర్వోక్తాత్ కారణాత్ న భవతి. అథవా కితౌ వేదితౌ ప్రత్యయౌ విధాతవ్యౌ. ఏవం హి ప్రకృతిప్రత్యయా వూహిత్వా తస్య శబ్దరూపస్య ధాతుజత్వ మూహితవ్యమ్. యత్ ప్రకృతిప్రత్యయవిశేషావయవానుగతం న తద్ధాతుజత్వం వ్యభిచరతి యథా కర్తవ్యం కరణీయ మిత్యేవమాదయః శబ్దాః. ఊహ్యభిత్యనుజ్ఞాతవ్యమ్."

"ఊహః ఖలు కర్తవ్యః, కర్తవ్యోఽపి యత్ర క్వచిత్తు న. కిం తర్హి ?" ఇట్టి ప్రశ్న నాశంకించి వ్యాఘ్రభూతిది 'నామచ ధాతుజ మాహ'...... ఇత్యాదిశ్లోకము నుల్లేఖించినతరువాత, పతంజలి స్వయముగా నిట్లన్నాడు:

"సంజ్ఞాసు ధాతురూపాణి
ప్రత్యయాశ్చ తతః పరే
కార్యా ద్విద్యా దనూబన్ధ
మేతచ్ఛాస్త్ర ముణాదిషు." (౩-౩-౧)

అభిప్రాయ మిది : "యే శబ్దాః సాధుత్వేన ప్రసిద్ధాః తేషు సంజ్ఞాశబ్దేషు ప్రకృతిప్రత్యయకల్పనయా ఊహః కర్తవ్యో నాన్యత్ర. తత్ర ధాతురూపాణి కల్పయితవ్యాని ప్రత్యయాశ్చ తతః పరే

---

* డిత్థః కాష్ఠమయో హస్తీ,
డవిత్థః తన్మయో మృగః.

కల్పితవ్యా ఇతి చేత్. కార్యాత్ గుణాభావాది కాత్ విద్యాత్ జానీయా దనూబన్ధం కకారాదికమ్. ఏత దనంతరోక్తం శాస్త్ర ముణాదిషు. శాస్త్రానిబంధనత్వా చ్ఛాస్త్రవిషయత్వాత్ వా శాస్త్ర మిత్యుక్తమ్."

"అవ్యయా దాప్ సుపః" (౨-౪-౮౨) అను పాణినిసూత్రప్రకారము అవ్యయమునకుగూడ ప్రాతిపదికత్వము సిద్ధమగును. శాకటాయనమతమున ప్రాతిపదిక మన్నంతయే ధాతుజ మగును; అప్పుడు అవ్యయముకూడ ధాతుజమే యగును. కావుననే సంక్షిప్తసారములోని 'కృచ్ఛేసోఽవ్యయపాదః' ప్రకరణమున ఊహవాదిద్వారమున, చ, వా, తు, హి, ప్రభృత్యవ్యయములకుగూడ ధాతుజత్వము ప్రదర్శితమయ్యెను.

గార్గ్యున కిది సహ్యము కాదు. 'న సర్వాణి' అన్నా డాయన. పాచకకారకాదిప్రత్యక్షక్రియా *యౌగికశబ్దములు ధాతుజము లయినను, డిత్థడవిత్థాదులు గాని, మండపాది అవిద్యమానక్రియా †రూఢములు గాని—‡యౌగికరూఢశబ్దములును—అనగా సాంకేతికశబ్దములును, అశ్వగో ప్రభృతి ప్రకల్ప్యక్రియా §యోగరూఢశబ్దములును అవ్యుత్పన్నప్రాతిపదికములు.

ప్రకృతిప్రత్యయహీనము లయిన డిత్థడవిత్థాది శబ్దములకు శాస్త్రానుసారముగా నెట్టి యవయవార్థము లభ్యము కాదు. అశ్వగో ప్రభృతి—ఉణాదిప్రత్యయాంతశబ్దముల—అవయవార్థము సముదాయార్థముతో నెల్లయెడలను అన్వితము కాదు. ఔణాదికసంబంధమున గార్గ్యమతమును ప్రపంచించి, సుపద్మమకరందమున విష్ణుమిశ్రు డిట్లు వ్రాసినాడు:

"ఉణాదిప్రత్యయాన్తాః శబ్దాః అవ్యుత్పన్నాని, అప్రాతిపదికాని, రూఢా ఇత్యర్థః. ఔణాదికా హి సంజ్ఞాశబ్దాః, తేచ వ్యుత్పత్తి మన్తరేణ లోకే విశిష్టవిషయతయా ప్రసిద్ధాః. నచ తేషాం వ్యుత్పత్తిః కర్తుం శక్యతే. అనన్తత్వాత్. కృతాంతు ప్రకృతిప్రత్యయవిభాగో దర్శిత ఏవ; అత్ర తేషాం శక్తిః. నను సూత్రమేవ ప్రణీయతా మితి చేత్? యుక్త ముక్తమ్, బాలవ్యుత్పత్తయే సూత్రక్రమణయుక్తమ్ యేపున ర్వ్యుత్పత్తి మాత్రియన్తే యదృచ్ఛాశబ్దానాం తేఽపి కార్త్స్న్యేన ప్రకృతిప్రత్యయాదీన్ దర్శయితుం న శక్తాః, రూఢిమేవ ప్రతిపద్యన్తే యత్ర క్వచన." (౮౦౨ పు. త్రైలోక్య సం.)

ఇచ్చట వాక్యపదీయసంగతి ధ్వనించుచున్నది. ఆయన శ్లోకవార్తికమున నిట్లు చెప్పినాడు: "బాహులకం ప్రకృతే స్తనుదృష్టేః ప్రాయసముచ్చయనాదపి తేషామ్, కార్యసశేషవిధేశ్చ తదుక్తమ్........" (౩-౩-౧ భాష్య.)

ఏ నామములు ధాతుజములో, ఏవి కావో వానిని పరిస్ఫుటము చేయుటకై గార్గ్యుడు, "తద్యత్ర స్వరసంస్కారౌ సమర్థౌ ప్రాదేశికేన గుణే నాన్వితౌ స్యాతాం, సంవిజ్ఞాతాని|| తాని, యథా గౌ రశ్వః

---

*'ప్రకృతిప్రత్యయశక్తి మపేక్ష్య అర్థబోధకత్వం యౌగికత్వమ్' అన్నారు శాబ్దికులు. పాచకకారకాదిశబ్దముల అవయవార్థము, సముదాయార్థము పరస్పరాన్వితములని వీనిని యౌగికములనవలసి వచ్చినది.

† 'ప్రకృతిప్రత్యయశూన్యత్వ మవ్యుత్పన్నత్వం, రూఢత్వం వా' గార్గ్యుడు ఊహనము నంగీకరింపలేదు. కావున తన్మతమున డిత్థడవిత్థాదిశబ్దములు అవిద్యమానక్రియాకములు. ఆయనమతమున యౌగికరూఢశబ్దములుగాని, రూఢయౌగికశబ్దములు కాని అవిద్యమానక్రియాకములు ; కావున రూఢములు.

‡'ప్రకృతిప్రత్యయశక్తి మనపేక్ష్య అర్థబోధకత్వం యౌగికరూఢత్వమ్' సముదాయశక్తితో అవయవశక్తికి ఎట్టి సంబంధము లేనిచో అప్పుడు యౌగికరూఢ మభిహితమగును. గృహవిశేషార్థమున మంటపశబ్ద ముదాహరణము. అవయవశక్తిద్వారా మంటపశబ్దము మంటపానకర్తను బోధించును. సముదాయశక్తిద్వారా అది గృహవిశేషమును బోధించును. కావున నిచ్చట మంటపశబ్ద అవయవార్థము, సముదాయార్థము సంపూర్ణముగా భిన్నములు. మంటపశబ్దము ద్వారా మంటపానకర్త ఉద్దిష్టు డయినపుడు దానిని ప్రత్యక్షక్రియా యౌగికశబ్ద మనవలెను.

§'ప్రకృతిప్రత్యయశక్తి మపేక్ష్య సముదాయశక్త్యైకపదార్థబోధకత్వం యోగరూఢత్వమ్.'

|| 'సంవిజ్ఞాతాని'—ఈ పదము దుర్గాచార్యుని వృత్తియందు ద్విభావముతో యోజితము. ప్రథమభావయోజనలో 'యథా' కు పూర్వము 'నపునః' అను అంశ మధ్యాహృతమగుటచే దానిని గ్రహింపక, ద్వితీయభాగయోజనానుసారముగా మూలానువాదము చేసినాను. దీనికి స్కందభాష్యమున సంపూర్ణానుకూల్యము కలదు.

"పురుషో హస్తీతి" అని చెప్పినాడు. తాత్పర్య మిది: ఏ సకలనామముల ఉదాత్తాదిస్వరములు, ప్రకృతిప్రత్యయ విభాగము వ్యాకరణసూత్రములద్వారా నిష్పన్నములయి యుండునో అవియే ధాతుజములు, యౌగికములు. కాని గో అశ్వపురుషప్రభృతిశబ్దములు సంవిజ్ఞాతములు-అనగా సాంకేతికములు, రూఢములు. కావున గార్గ్యమతమున దుర్గాచార్యుని ప్రకల్ప్యక్రియ, అవిజ్ఞాతక్రియ, అవిదితక్రియ అను నామమునకు ఏమియు సార్థక్యము లేదు. శబ్దసంస్కారముకొరకు యోగరూఢత్వము కాని, యౌగికరూఢత్వము కాని కేవలరూఢత్వపక్షమున నిక్షిప్తమగునది.

స్వాభిమతమును ద్రఢీకరించుటకు గార్గ్యపక్షమున గల సర్వోక్తులును, తత్ఖండనకై యాస్కుని యుక్తులతో శాకటాయనపక్షప్రత్యుక్తులును నిరుక్తాది గ్రంథములనుండి ఉపస్థాపితము లగుచున్నవి :

(౧) "అథ చేత్ సర్వాణ్యాఖ్యాతజాని నామాని స్యుః యః కశ్చ తత్ కర్మ కుర్యాత్ సర్వం తత్ సత్త్వం తథాఽఽచక్షీరన్—యః కశ్చాధ్వాన మశ్నువీతాశ్వః స వచనీయః స్యాత్, యత్ కించిత్ తృన్ద్యాత్ తృణం తత్"—అనగా నామఘటకధాతువాచ్యక్రియ నవలంబించి నామకరణ మయినచో అనేకవస్తువులందు ఏకక్రియాసంబంధహేతువుచే, అనేకవస్తువులకు ఏకనామము ఉండవచ్చును. అశ్ ధాతుసూచితమైన అధ్వవ్యాప్తిహేతువు—అనగా పథముతోడి సంబంధము హేతువు అగు ఘోటకనామము 'అశ్వ'మయినచో, అధ్వవ్యాప్తి కల సకలజీవములకుగూడ అశ్వనామ ముండుట సముచితము. పశువుచే హింసింపబడినదని హింసార్థకతృద ధాతువునుండి తృణశబ్దము వ్యుత్పన్న మగుచో, హింసావిషయకమైన సర్వమును 'తృణ'మనుట ఉచితము. ఇది నామమాత్రధాతుజత్వవిషయమున గార్గ్యుని ప్రథమాపత్తి.

దీనికి ప్రత్యుత్తరముగా శాకటాయనపక్షమున, "యః కశ్చ తత్కర్మ కుర్యాత్ సర్వం తత్ సత్త్వం తథాఽఽచక్షీర న్నితి పశ్యామః సమానకర్మణాం నామధేయప్రతిలమ్భ మేకేషాం నైకేషాం, యథా తక్షా పరివ్రాజకో జీవనో భూమిజ ఇతి" అని చెప్పబడినది. నిరుక్తస్కందభాష్యమున నిట్లున్నది: "ప్రత్యయస్య రూఢశబ్దత్వాత్ పశ్యామః సమాన కర్మణాం నామధేయ ప్రతిలమ్భ మేకేషాం నైకేషామ్. యథా 'తక్షా' ఇతి శిల్ప్యేకోఽచ్యతే, న తక్షణ న్నప్యన్యః, పరివ్రాజక ఇత్యాశ్రమవిశేషస్థ ఏవోచ్యతే, న పరివ్రజ న్నప్యన్యః. జీవన ఇతి సాగ్ని రంగార ఏవోచ్యతే, న జీవ న్నప్యన్యః. భూమిజ ఇతి గ్రహవిశేష ఏవోచ్యతే, న భూమ్యాం జాతో ప్యన్యః" దుర్గాచార్యులు "జీవన ఇత్యురగః శాకజాతి ర్వా. భూమిజోఽఙ్గారకో వృక్షో వా," అన్నాడు. శాకటాయనపక్షాభిప్రాయ మిది: వస్తుగతక్రియాధర్మానుసారముగా నామకరణ మయినచో అనేక వస్తువుల కేకక్రియ యుండుటవలన అనేకమున కేక నామ ముండుట సముచిత మను ఆపత్తి సంగతము కాదు. తుల్యకర్ముల నడుమ ఆయా కర్మద్వారమున మాత్రము కొందరకే నామకరణము ప్రత్యక్షసిద్ధము. అనేకులు తక్షకర్మగాని, పరివ్రజనము కాని చేసినను, కేవలము సూత్రధారునే తక్షుడనియు, మస్కరిచే పరివ్రాజకు డనియు పేర్కొనవలెను. ఏల యిట్లనవలెనని శాకటాయను నడుగుట సముచితము కాదు. ఈ శబ్దము లన్నిటిని ఆయనయే ప్రయోగింపలేదు. ఒక్క క్రియతో అనేకులకు సంబంధమున్నను కొందరకే పేరు వచ్చునుకాని అందరకును రాదు. ఇది లోకప్రసిద్ధము. శబ్దస్వభావమాత్రము. గార్గ్యుడైనను ఏమి చెప్పును? తదుక్త సాంకేతికశబ్దము అర్థాంతరమున సంకేతితము కాక అర్థవిశేషమునందు సంకేతితమయిన దేమి?—అనగా అశ్వశబ్దము హరిణమునందు రూఢము కాక ఘోటకమునందు రూఢమైన దేమి—అని ప్రశ్నించినచో, అది లోకప్రసిద్ధ మనియు, శబ్దస్వభావ మనియు చెప్పవలెనుగదా! శాకటాయనుడును లోకప్రసిద్ధిని, శబ్దస్వభావమును ఆశ్రయించును. క్రియాగతియము కాని, క్రియాప్రాధాన్యము కాని ఎప్పుడో యొకప్పుడు ఇట్టి వ్యవహారప్రసిద్ధికిని, శబ్దస్వభావమునకును అవలంబన మయియుండును అని మీరుమిక్కిలి వక్కాణించును.

ఉభయమతసారసంకలన మసంగతము కాదు. గార్గ్యసంప్రదాయమువా రిట్లు చెప్పుదురు : "గో అశ్వ ప్రభృతి ప్రకల్ప్యక్రియాశబ్దధాతుజత్వమును కాని, తదనుసారముగా అవ్యక్తతను గాని స్వీకరించుట అసంభవము. గమనార్థక గమ్ ధాతువునకు ఉత్తరకర్తృత్వ వాచక డోస్ ప్రత్యయము చేసి గోశబ్దమును సాధించినచో దాని వ్యుత్పత్తిలభ్యార్థము గమనకర్త యగును. దీనిని స్వీకరించినచో, గమనశీల మగు నే జీవియైన గాని, పదార్థమైనగాని దానిని ప్రయోగింపవచ్చును. కాని వస్తుతః, గోవ్యతిరిక్త మగు నితరస్థలమున దాని

ప్రవృత్తి నిమిత్తము ఉపలబ్ధమగుటలేదు. కావున నిట్టి శబ్దవ్యుత్పత్తికల్పనమున అవ్యాప్తిదోషము దుర్వారము కాకుండునా?

"యోగరూఢశబ్దముల అవయవశక్తికేవలస్థల విశేషమున సముదాయశక్తితో అన్వితమయినను, యౌగికరూఢశబ్దమున తదన్వయము కల్పనా యోగ్యము కూడ కాదు. మంటపశబ్దము అవయవశక్తి ద్వారా మంటపానకర్తను, సముదాయశక్తిద్వారా గృహవిశేషమును బోధించును. ఈరెండిటి యన్వయము సంభావ్యమా? కావున ప్రకల్ప్తక్రియాశబ్దరాసులు ధాత్వనుసారముగా ప్రవృత్తము కాకపోవుటచే వానిని ధాతుజము లనుటకు మారుగా రూఢములని కాని, సాంకేతికములని కాని చెప్పుట సంగతము."

ప్రత్యుత్తరముగా శాకటాయనసంప్రదాయమువారిట్లు చెప్పెదరు: "వ్యుత్పత్తినిమిత్తమై సంకోచవిధానపూర్వకప్రయోగనిమిత్తపద్ధతి చిరకాలమునుండి కలదు. వేదమునందును ఇట్టి నామకరణము శ్రుతమగుచున్నది. కృష్ణయజుర్వేదమున 'యన్నవ మైత్ తన్నవనీత మభవత్, యదసర్పత్ తత్సర్పి రభవత్: యద్ధ్రియత తద్ ఘృత మభవత్' (౨-౩-౧౦) అని ఆమ్నాతము. దీనిపై భాష్య మిట్లున్నది: 'యస్మాత్కారణాత్ దధ్నః మథ్యమానం సత్ నవమైన్నవం నూతనం రూప మభవత్ తస్మా న్నవంచ తన్నీతంచేత్యుద్ధృతస్య సారపిండస్య 'నవనీత' నామ సంపన్నమ్. యస్మాత్ కారణా దగ్నిసంపర్కే సతి పిండో విలీయమానో౽సర్పత్ ప్రసృతో౽భూత్ తస్మాత్ సర్పిరితి నామ. యస్మాత్ ప్రసృతస్య శీతలపాత్రస్థాపనేన తత్పున ర్ధ్రియత ఘనీభూత మభవత్ తస్మాత్ ఘృతమితి నామ. ఘృ క్షరణదీప్త్యోరితి ధాతోః నైతద్రూపం, కిన్తు ఘృత మిత్యత్ర ధకారస్య ఘకారాదేశః'

అనేకవస్తువులు ఘృతము లయినను ఘనీభూతసర్పిస్సునే వేదము ఘృత మన్నది. ఘృతశబ్దము ఆజ్యమునందు రూఢము. అయినను వేదమున ధారణార్థక ధృధాతువునుండి ఘృతశబ్దము వ్యుత్పన్న మయినది. 'యద్ధ్రియత తత్ ఘృత మభవత్' అని వేదము స్పష్టముగా జెప్పినది. సాధారణక్రియను జూచి, తదనుసారముగా ఏదో ద్రవ్యవిశేషమునకు నామకరణము ప్రసిద్ధ మయినచో భాషయందు దాని వ్యుత్పత్తిప్రదర్శనము దోషావహ మేల కావలెను? శబ్దస్వభావమును బట్టియు లోకప్రసిద్ధిని బట్టియు ఏ వస్తువునకే నామము ప్రచలిత మగునో దానిని విమర్శించియే పరీక్షకులు కృతార్థు లగుచుందురు. కృత్తద్ధితసమాసముల నియామకము అభిధానమున నయియుండుగాక, అభిధాననియమితశబ్దపరీక్ష దోషమా? 'సర్పిర్విలీనమాజ్యం స్యాత్ ఘనీభూతం ఘృతం విదుః' అని నిఘంటువలన మనము ఘనీభూతమైన ఆజ్యమును ఘృత మనుచున్నాము. అయినను ధారణార్థక ధృధాతువునుండి ఘృతము నిష్పన్నమైన దన్నచో అభిధానమున కేమి వ్యాఘాతము?

పూర్వము సంపన్నగృహస్థులకు 'మంటపగృహ' మను పేర స్వతంత్రగృహ ముండెడిది. సంక్షేపార్థమున దానిని వారు 'మంటప' మనెడివారు. తరువాత మంటపానప్రథ పరిత్యక్తమో, తిరోహితమో యయినను గృహవిశేషమునకు మంటపనామము నిలిచియుండును. శబ్దప్రయోగసంక్షేపకరణప్రవృత్తి కేవల లోకసిద్ధమే కాదు, శాస్త్రసిద్ధముకూడ. 'బలాదతీతః' అను వాక్యములోని బకారమును, తకారమును గ్రహించి, శాస్త్రమున 'బత' శబ్దము దుర్బలార్థమున ప్రయుక్త మయినది. ఆంగ్లేయులభాషలో దీనికి *syncopation* అని ప్రసిద్ధి. 'జయం పుణ్యంచ కురుతే' అని పౌరాణికులందురు. ఈవాక్యములోని 'పుణ్యంచ కురు' అను అంశ లోపించి, తే అనుదానిలోని ఏకారము ఈకారముగా పరిణమించి 'జయన్తీ' నామము నిష్పన్న మయినది. సంక్షేపమున శబ్దప్రయోగము చేయుటకై *వైయాకరణులను ప్రశ్నింపనక్కర లేదు. వారు తత్ప్రయోక్తలు కారు. కావున శబ్దపరీక్షకులయెడ దోషారోపణము చేయక, శబ్దప్రయోక్తల లోపసంశోధనము చేయుటే గార్గ్యసంప్రదాయమువారికి సముచితము. (సశేషము)

---

*అందులకే మహాభాష్యములో పతంజలి యిట్లన్నాడు: "యథా ఘటేన కార్యం కరిష్యన్ కుమ్భకారకులం గత్వా ఆహ—కురు ఘటం, కార్యమనేన కరిష్యామీతి. న తద్వత్ శబ్దాన్ ప్రయోక్ష్యమాణో వైయాకరణకులం గత్వా ఆహ—కురుశబ్దాన్ ప్రయోక్ష్య ఇతి" (౧ ఖండ—౬౦ పృ. నిసా. సం)




# అభినందిత మురారి

●

శ్రీ దిగుమర్తి సీతారామస్వామి

సంస్కృతరూపకవాఙ్మయమున మురారి కొక ప్రత్యేకస్థానము. మురారిది మూడవ మార్గము (మురారేః తృతీయః పంథాః) అని పండితుల మెచ్చు. ఇంతటి గౌరవము నీకవికి ఘటించినది అతని పూర్వరామాయణనాటకము; పేరు అనర్ఘరాఘవము — ఏడు అంకములు — రసము వీరము. (భాస భవభూతి జయదేవుల పూర్వరామాయణనాటకములును అంకసప్తకయుక్తములే) పండితసదస్సులలో హర్షమురారుల కున్న గౌరవము ఇంకొక గీర్వాణకవికి లేదు. పండితుల శాస్త్రవాసనాప్రధానమైన దృష్టికి, వారి శాబ్దికప్రియతను తట్టుకొనగల రచన మురారిది. పాఠము చెప్పుకొనదగిన రూపక మిది యొక్కటే. అందుచేతనే ఉద్దండపండితులు, పీఠాధిపతులు సైతము దీనిని వ్యాఖ్యలచే అలంకరించిరి.

మురారిది మూడవ దారి యనుటకు విద్వాంసులు చెప్పు వ్యాఖ్యానము ఇది: రూపకసాహిత్యములో కాళిదాసు వ్యంగ్యప్రధానుడు; భవభూతి వాచ్యప్రధానుడు; మురారి కల్పనాప్రధానుడు — అని. * మార్గభేదనిరూపణ మెట్లున్నను—బహుగ్రంథరచయితలగు కాళిదాసభవభూతులతో ఒకే గ్రంథమును రచియించిన మురారికిని సమగౌరవము లభించె ననుటకు పై ఆర్యోక్తి చాలును. మురారి క్లిష్టగురుకులవాసము చేసి చదువుకొన్నవాడుగా బుధజనశ్రుతి.

అతని దీర్ఘవిద్యావ్యాసంగితను గ్రంథమున నుదాహరించు శాస్త్రవాసనలే పట్టియిచ్చును; కవికృతికి ప్రతివాక్యము నొక కరపత్రము — పుటముపెట్టి వన్నెలువేసి తీర్చిదిద్దుకొన్న రూపకము; ఆకర్షించని యొక చప్పని మాటయైన మనకు దగులదు.

సంస్కృతవాఙ్మయమునందలి రూపకములను ఆకరప్రాధాన్యముచే ఐదుతరగతులుగా విభజింపవచ్చును. అవి — (౧) రామాయణరూపకములు, (౨) భారతరూపకములు, (౩) బృహత్కథారూపకములు, (౪) భాగవతహరివంశసంబంధులు, (౫) కల్పితములు, చారిత్రికములు (ఇవి సంఖ్యేయములు). ఇందు మొదటి వర్గమునకు చెందిన రచనలే ఎక్కువ. ఈ వాఙ్మయమున ప్రథము డనదగిన భాసుడే రెండు రామాయణనాటకములు వ్రాసెను. తరువాతిది దిఙ్నాగుని కుందమాల. భవభూతి రామనాటకములు తరువాతివి. కీర్తిధరుని ఆశ్చర్యచూడామణి యింకా నాటిదే. యశోవర్మ రామాభ్యుదయము, మాయురాజు ఉదాత్తరాఘవము నీనాటివిగా కొందరి యూహ. కాలక్రమమున తరువాతిది అనర్ఘరాఘవము. పిదప బుట్టినవి రాజశేఖరుని బాలరామాయణము; జయదేవుని ప్రసన్నరాఘవము. వీని యన్నిటి అనుకృతులలో చివరిది జానకీపరిణయము. ఇంకను ఏకదేశములుగా ఉన్మత్తరాఘవమువంటి యేకాంకికలు ఒకటి రెండు దొరకును. దామోదర మిశ్రుని మహానాటకము ఈకోవదే.

ఈ పరంపరలో పూర్వరామాయణనాటకములను మూలముగా చూచినప్పుడు మురారి నాటకమునుండియే రూపకధోరణి పండితాకర్షకముగ మారినట్లు తోచును. ఈ ప్రేక్ష్య ప్రబంధములలో భాసుని నాటకములకున్న ప్రదర్శ

---

* కొందరు పండితులు పై యాభాణకము తార్కికుడైన మురారికి సంబంధించినదిగా సమన్వయింతురు. ఆ మతములో కుమారిలభట్టు దొక మతము—ప్రభాకరభట్టు దొక మతము — మురారిది మూడవ మతము.

నాచితి మిగిలినవానికి లేదు. తరువాతి కుందమాలయు మహావీరచరిత్రాదులు క్రమసాదృశ్యప్రేక్షణకములు. మురారి నుండియు వీరి నాటకములు ప్రదర్శింపబడినట్లు వ్రాసికొన్నను అవి శ్రవ్యములుగా పాఠ్యములైనవేగాని దృశ్యములైన రూపకములు కావు. వారియెడల భక్తి యున్నను యథార్థముగాన చెప్పకతప్పదు.

రామాయణమువంటి దీర్ఘ గాథను ప్రదర్శనయోగ్యము చేయుటలో రచయితకు క్లేశము అపారము. భాసుడు అందుకే ప్రధానరామాయణనాటక మనదగిన ప్రతిమలో రామాభిషేకప్రయత్నముతో నెత్తికొని రావణవధతో ముగించెను. అతి దీర్ఘ్యమున జన్మతః రూపకకర్త. అట్లే పూర్వరామాయణమును ప్రదర్శింప తలపుగొన్న భవభూతి విశ్వామిత్రక్రతురక్షణతో ప్రారంభించెను. ఇక్కడే సీతారాముల ప్రథమసమాగమము. తరువాతి మిథిలాప్రయాణము — రామపరశురామసంవాదము — పరశురామవసిష్ఠాదుల వాదోపవాదములు — శూర్పణఖాపరకాయప్రవేశము — మంథరవరములు — పాదుకాపట్టాభిషేకము (ఈ జరిగినంతయు మిథిలలోనే) సంపాతిజటాయుసంభాషణలో సీతాపహరణకథ — వాలివధ — మాల్యవత్త్రిజటల సంవాదములో లంకాదహనకథ, రావణవధ — అలకాలంకలకబుర్లలో సీతాగ్నిప్రవేశకథ — చివరకు పుష్పకారోహణము, పట్టాభిషేకము. ఇన్ని విషయములు ఏకరాత్రి పెండ్లియందలి కర్మకాండగా సాగిపోయినవి.

మురారి కథనశిల్పములో కొంత భవభూతి ననుకరించెను. ఆ అనుకృతులు ఉత్తరరామచరితమునుండి గ్రహింపబడినవి. విశ్వామిత్రాగమనముతో నాటకప్రారంభము. మారీచనిరాసము హరకోదండఖండనము, పరశురామగర్వభంగము, వాలిప్రమథనము, రావణవధ, పుష్పకవిహారము, పట్టాభిషేకము ఇది మురారివరుస. భాసేతర రచితములగు రామాయణరూపకములలో (తరువాతి వ్రాయబడిన రామాయణగాథలలో) నాయకుడైన రాముని సుకీర్తిస్థలములలో విజయములలో ఒక్కొక్కదాని నొక్కొక్క అంకమునగూర్చి వ్రాయబడినది అనర్ఘరాఘవ మొక్కటే. ఇందు ప్రత్యంకమునను రామ ప్రవేశమున్నది; రామాయణనాటక మనుట దీనికందు సార్థకము. రాజశేఖరుడు భవభూతిమురారుల నతిక్రమింపవలెనని శ్లోకసంఖ్యను, అంకసంఖ్యను పెంచి ఇతివృత్తమునందలి విధానము మార్చి చాల స్వతంత్రించి వ్రాసెను. పేరున కది రామాయణముగాని నిజమునకు రావణాయనము. ఇంచుమించు సగమువరకు గ్రంథము ప్రత్యంకరావణచరిత్రము. మొదటియంకములో ప్రణయి రావణుడు; ద్వితీయమున విరహి రావణుడు; మూడవ అంకములో రావణునియెదుట నాటకప్రదర్శనములో సీతాస్వయంవరము; తిరిగి ౫వ అంకములో రావణకృత్రిమసీతాసల్లాపము; ఉన్మత్తరావణుడు. ఇట్లు కథయంతయు ప్రతినాయకుని వెలగాటముతో నిండియుండును.

ఈకోవలోనే చేరదగినది 'పిల్లమురారి' యనబడు జయదేవుని ప్రసన్నరాఘవము. ఇందు రీత్యాడంబరమేగాని చెప్పదగిన లలితఘట్టములు శూన్యము. ఇందలి శ్లోకములుమాత్రము శ్రవణసుభగములై యితని పీయూషవర్షబిరుదమును అన్వర్థము చేయుచున్నవి. ఈ నాల్గునాటకములలో (మహావీరచరిత్ర, అనర్ఘరాఘవము, బాలరామాయణము, ప్రసన్నరాఘవము) సమానమైన విషయములు యాజ్ఞవల్క్యప్రశంస; రావణునకు సీతాస్వయంవరమున శోకము; భార్గవపరాజయము; పుష్పకయానఘట్టము. ఈ రూపకములందు మాల్యవంతునికి విష్కంభప్రాధాన్యము నందరంగీకరించినదే.

అందరును భార్గవపరాజయమువంటే కథాస్థిభారమును నిల్పిరి. భాసుడు దీనిని స్పృశింపలేదు. ప్రవేశపెట్టినవాడు భవభూతి; మెరుగుదెచ్చి హేతువును చెప్పినవాడు మురారి — ఇద్దరు చెప్పిరికదా అని స్వీకరించినవారు రాజశేఖరజయదేవులు.

భవభూతిని తప్పించి మిగిలిన మువ్వురును రూపకమున కనుచితమగు ద్రాఘీయములైన వర్ణనలతో గ్రంథము నుబ్బించిరి. ఇందు రాజశేఖరుని బొత్తిగా క్షమింపరాదు. రాజశేఖరుడు బాలరామాయణము ఒక్కటియే వ్రాసియున్నచో అతనిని కూచిమంచి

తిమ్మకవితో సమానముగ చూడదగినవి చెప్పెడివి. కర్ణసుందరి, కువలయావళివంటి రచనలకు తల్లి యనదగిన విద్ధసాలభంజిక అతని యశస్సును రక్షించినది. తెనుగున కథానుకృతులను కూర్చి ప్రాబంధికులపై ఎంతేని నిందగలరు. సంస్కృతరామాయణరూపకకర్తలలో భాసుని తప్పించి మిగిలినవారందఱు రీతి కథాప్రవృత్తిలో, విధానకల్పనాదారిద్ర్యములో జీర్ణయుగాంధ్రప్రాబంధికులకు పెద్దన్నయ్యలు.

ఇక సీతోక్తితిరస్కృతంజలమునం దగ్రగణ్యమగు మురారిగ్రంథసత్పత్రము నవలోకింతము. అది పండితస్తుతిపాత్రము కావుటకు హేతువులు స్పృశింపబడినవే: అది పాణ్డిత్యమునకు నిలువగలదగుట—శాస్త్రవాసనాధూయిష్ఠము పవిత్రకథాత్మకమగుట—కల్పనాప్రధానమై అననుకరణీయరీతి సుభగమగుట. అనర్ఘరాఘవమునందలి —మహేశ్వ కృతేఘనం ధినోతి ... దృష్ట స్వాహాత్ ... అథేదే నోపాస్తే... వంటి శ్లోకముల యర్థబాహుళ్యము పండితులకు చాలినంత శాబ్దికవ్యాయామము కల్పించును. శాస్త్రకారికలే శ్లోకములుగా మలచి "యదింకోరశ్శ్రుతి ...జయతి జనికర్తా ప్రకృతితో"వంటి వానిలో పండితవిక్రమథోరణికి తావు గల్పించినవాడు మురారి. ఇదియంతయు వ్యర్థకాలక్షేపము గాదు. శ్రీరామచంద్రులకథ యని వారు కనుమోడ్తురు. ఇక రీతికి 'మురారికేయర్థ చేర్పు' అన్న భట్టుమూర్తిప్రశంస చాలును. పండితాదృతిపాత్రములకు గుణము లిట్లుండగా కేవలరసికులు మెచ్చుకోదగిన గుణము మురారిస్వతంత్రత. ప్రతివిషయమును స్వీయప్రతిభాప్రతిబింబముగ దర్శించి సత్యమని తోచినదానిని మొగమోటక అరవాయిగొనక నిర్భయముగ వక్కాణింపగల కవిసింహము భట్టమురారి.

కథావైశాల్యము గల విషయము ప్రదర్శనక్షమముగ సవరింపవలె నన్న సూచ్యభాగము ఎక్కువగును ఇది తప్పదు. ఇంచుమించు అంకములంతటా విష్కంభములు వ్రాయసాహసించినవాడు మురారి యొక్కడే. అయ్యును అతని విష్కంభాదులు ముఖ్యభాగములవలె నే రీతిలలితములు, శ్లోకప్రచురములు. వీనియం దలవోక పెంచి పఠించక అంకప్రవేశము చేసితిమా, రామరామ! మహోపాయములలో ఎక్కడనో పడి తడుముకొనిన ట్లనిపించును.

రామాయణమువంటి నాటకమున నీలైనంత తక్కువగా పాత్రలను ప్రవేశపెట్టుటకు మురారి వహించిన శ్రద్ధ ప్రశంసాపాత్రము. కథయంతయు రామలక్ష్మణులతో జరిగిపోవును. విష్కంభములలో వచ్చు శూర్పణఖను తప్పించినచో చివరివరకు స్త్రీపాత్ర అవసరము లేకయే నాటకము సాగిపోవును. చివరిదగు సప్తమాంకమున సీత వచ్చును. ఈసీతాపాత్రధారికి కంఠస్థముచేయదగిన విషయము చాల తక్కువ. ఈయంకము కేవల శ్రావ్యకావ్యము—అంతేగాక రామాయణమునం దపరిహార్యము కాదు; దానిని పేర్లు తప్పించి ఏ విశ్వసుధావర్ణమున చేర్చినను ఇమిడిపోవును. పాఠము చెప్పికొనువారు మొదటి ఆరంకములే చెప్పికొందురు; అట్టిచో రావణవధతో కథ ముగిసి సీతాసుగ్రీవవిభీషణుల ప్రసక్తియే గలుగదు. ఈచివరకు వచ్చిన సుగ్రీవవిభీషణాదులతోడి రామప్రసంగము నేటిప్రముఖుల ప్రెస్సురిపోర్టరుల సమావేశమువంటిది. రావణహనుమంతులకు రంగప్రవేశమే లేదు. ప్రతినాయకులలో పరశురాముడు, వాలి రంగమునకు వత్తురు. ఇది యంతయు పరికించినచో మురారి పాత్రస్వీకృతి ప్రశంసార్హము.

మురారినాటకమున గౌరవముతో సామర్థ్యముతో తీర్చబడినవి ఋషులపాత్రలు. విశ్వామిత్రుడు వామదేవుడు వసిష్ఠుడు భార్గవుడు దశరథజనకులు (రాజర్షులు) అందరును తూచి శాస్త్రీయముగ ప్రసంగింతురు.

అన్నిటిలో మురారిరామపాత్రోన్మీలనము రూపకవాఙ్మయమున మనోజ్ఞమైనది. మురారిరాముడు వేత్త—ధీరుడు. జరుగబోవు విషయములకు తాను నిమిత్తమాత్రుడు. సహజమైన అతని విరక్తి రాజసమును వెలిపెట్టదు. లోకసంగ్రహమునకో యన నతడెంతయు గంభీరముగ వ్యవహరించును. మొదటినుండియు లక్ష్మణుడు రామునకు అంతరంగికకార్యదర్శి; రాముని గాంభీర్యము, రాజసము కాపాడుటకే లక్ష్మణపాత్రము మురారి చక్కగా వినియోగించుకొనెను. వాలిపరిచయఘట్టము దీని కొక లక్ష్యము.

వాలి (ప్రవేశించి)—ఎవరయ్యా మీరు?

లక్ష్మ—మహాభాగా, మేము క్షత్రియులము, రాఘవులము.

వాలి—మీ ఆకారవిశేషమే జాతిని దెల్పుచున్నది. విశేషమును జెప్పుము.

లక్ష్మ—చెప్పితిని గదా రాఘవులమని.

వాలి—(అసూయతో, విసుగుతో) నేనడుగునది మీ పేర్లను గూర్చి.

లక్ష్మ—(ధీరతతో) ఆ రామలక్ష్మణులమయ్యా!

వాలి—(తనలో) ఆ రామలక్ష్మణులు! అ యమాట ప్రసిద్ధిని చాటుచున్నది. కాని ఇందు హరధనుర్భంజకు డెవడై యుండనోపు? (ప్రకాశముగా) వేషము పరిగ్రహము పరికరము గంభీరతాదుల పరిగానున్న మీయందు భార్గవవ్రతభంగకారియైన రాముని దర్శింప నుత్కంఠితుడను.

లక్ష్మ—(వినయముతో) ఓయీ యింద్రనందన! ఇందు లక్ష్మణుడను నేను.

వాలి—ఐన నీ రెండవవ్యక్తియే కౌశికాంతేవాసి దాశరథియైన రాముడా?

లక్ష్మ—ఔను.

ఇట్లు పరోక్షపద్ధతిలో వాలిలక్ష్మణుల రమ్యసంభాషణతో మురారి రాముని రాజసము ధ్వనింపజేయును. అసలికి వచ్చినను రాముడు రాడే—ప్రతిప్రసంగమును అతడు చేయడు; లక్ష్మణుడున్నాడుగదా విషయమును తెలిసికొనుటకు! ఇంత లోతుగా చూచి వ్రాయగలవారెందరో ఉండరు. ఈసంభాషణ మురారి సంవాదశైలికి ఒరవళ్లు. రాముడు ప్రతిసందర్భమున నిట్లు నిక్కులులేవడు. పరశురామప్రవేశఘట్టమున రాముడే వినయముతో సంభాషించును. ఇదే ఘట్టము నతిగాని జయదేవుడు లక్ష్మణునిచే భార్గవుతో మాటాడించి ఔచిత్యమును చెరిచెను. జయదేవుని లక్ష్మణుడు వట్టి ప్రేలరి. రాజశేఖరుడు నీఘట్టమును బజారునకు దించెను. రాజశేఖరుని పరశురాముడు వాచాలుడు. అతని భార్గవపరిచయమే యాతయామముగ గన్పించును.

'ఈశ్వరుని లలాటాగ్నివలె ఒక తాపసుడు వచ్చుచున్నాడు; అతడు నాలుగేనమ్ములు అక్షవలయము దాల్చెను.' అను నీ లఘూపోద్ఘాతమే రసికోద్ఘాతము. దీనికి తోడు రాజశేఖరుని రచనలో లక్ష్మణుడు భార్గవభేత. మురారివలె ఈ సందర్భమును లోతులుముట్టి చూచిన కవి లేడు. అతడీసన్నివేశము నద్భుతము నారభటీవృత్తిలో పోయిపోయి అనిపించెను. అతని భృగునందనపరిచయమే వీరయుక్తిసముచితము. 'అజన్మబ్రహ్మచారియు శిలాస్తంభములవంటి భుజముల యంతరమున నొప్పారు నల్లెత్రాటి యొరపిడిచారికలచే భువనవైత్రప్రశస్తి నెరిగించువాడు; అక్షత్రక్షణాకీర్ణకతివైన వక్షఃపీఠమున బాణములను మోయుచున్నవాడును, రాజన్యులను మదపుటేనుగుల వేటయందు వేడుకకాడునైన జామదగ్న్యి డితడు' అని. (ఇది మూలమున స్రగ్ధరాశ్లోకగ్రథితము) ఇక్కడే భార్గవుని ప్రవేశసమయనిర్వేదోక్తియు వీరోచితము. 'క్షత్రియుద్ధకథ యిపు డెక్కడిది? దేవలోకపు గాలిబాటల గడ్డివెంబడించినది—గొడ్డుపోతు భూమి భటులను ప్రసవింపదు.'...ఇత్యాది. ఈ ఘట్టమునంతను ఆ భాషయందే చదివి కృతార్థులు కావలెను. మురారికి సహజమైన మాటల తూకము రామపక్షమున గోచరించును. రాముడు వినమ్రుడు; సహిష్ణువు—శాంతుడును, భార్గవుడు దారికి రాడు; తప్పనిసరిగ విజృంభింపవలసివచ్చినది. శాంతివీరులైన భారతీయుల సుశీలవిశేషత—అపరిహార్యమగుచో నుద్రేకించిపలుకుట మురారిరామునికి తప్పనిసరియైనది. ఐనను రాముడు వక్రోక్తులు పేల్పలేదు; మురారియే యిట్లు వ్రాయగలడు. 'ఓసీ రాచపురుగా, రాచవారల రాపెట్టి పెరసిన మా పరవస మెర్రుగుదుపుగదా' .. ఇది ఉద్ధతభార్గవధోరణి. చివరకు రాము డెందుకోని యన్నాడుగదా 'ఓయీ నీకీర్తి బాపుటాకుద్ర ప్రాబడి చినిగినది' అని. ఈమాట పరశురాముని సప్తధాతువులు కరగించినది. ఈ అంకరచనకు స్వారస్యము చిట్టచివర వాక్యమునచే మురారి చెప్పించెను.

'దశకంధరజేత కార్తవీర్యుడు; వానిని గెలుపుగొన్నవాడు భార్గవుడు; అట్టి భార్గవుని రాముడు కాకపక్షధరుడైనవాడే జయించె ననుటతో బాలకాండ

యంతే రావణవధధ్వనితమై రామాయణము ప్రారబ్ధమై
నది. ఐతే అటుతరువాత విషయములను ప్రత్యేకముగ
వర్ణించుట జగదానందముకొరకే' అని (౭వ అంకము
౧౫౫ శ్లో) మురారియే యీ రహస్యము బెరిగి
కూర్చిన కవి. ఇందుచేతనే పరశురాముని వాలిని ప్రవేశ
పెట్టిన మురారి రావణుని రంగముపై నిలుపలేదు.
ఈ గ్రంథపరిచయముగల భాస్కరుడు 'అని విన్న నెర
గొన్న యజ్ఞము భోరిగొన్న పరశురాముని వాజీ భంగ
పరచె' అను నవాల్మీకమగు వాక్యమును హనుమద్రా
వణసంవాదములో హనుమచే బలికించెను. ప్రతివిషయ
మునను మురారిమాపు ఇంత తలస్పర్శమైనది. అతడు
వాల్మీకిరామాయణము చదివిన శ్లోకస్వరు చదివియుండెను.
బాలవాల్మీకిబిరుదాంకము ఇతనికి తగును. భవభూతి ఈ
రామపరశురామగాథను పెంచి యీవెంకము నింపెను.
పర్యవసానము పూజ్యము.

రామరావణయుద్ధమునుగూర్చిన మురారివర్ణ
నమే వేరు. రాముడు ప్రతిపక్షుల నందరిని మెచ్చు
కొనును; రావణపక్షమువారును రామునివిషయమున గౌర
వము ప్రకటింతురు. 'రాముని గుణములకు ముల్లోకము
లయ్యెడుపోయినవి' అను మాల్యవదుక్తి దీనికి సాక్షి.
కథ అంతయును నొక రెూత్తైన ధర్మోత్కృష్టము విభీష
ణుడు రామపక్షమునకు వచ్చు పోకయొత్తు. 'ఇది యెట్లు
జరిగినది?' అని సారణుడు మాల్యవంతుని ప్రశ్నించెను.
'ఎట్లు జరిగినదా—దశకంఠుని నడుగుము! అథవా
దైవము నడుగుము!' (అథవా దైవం పృచ్ఛ!) ఈఘటన
యంతయు నిట్లు జరుగవలసియున్నది; జరిగినది. ఇది
యాలరిబ్రహ్మ చెయిది అని మురారియుద్దేశము. ప్రతిప
క్షముచెడ నింత సానుభూతి చూపుట అపూర్వము.
'ఈభూమి వీరక్షేత్రము; ఇంకను రావణుడు శోకపీడితుడు,
వాలి యొక్క పేరుము. వాలి రావణుని పరాభవించెను.
కపులున్న కారణమున గనుటయు, పీనులున్న కారణమున
వినుటయు తప్పకున్నను ఈ విషయములను చర్చించి
పల్కుటకు మన పెంతటివారము!' అని మురారి సుగ్రీ
వునిచే పలికించును. ఇందు సుగ్రీవు డన్నగారియెడ గల
సౌదర్యమును ధ్వనింపజేసెను. అట్టి విషయమును
కప్పిపెట్టలేదు. 'పదితలలు ఇరువదిచేతులు గల రావ
ణునిచే స్వయముగా భరింపబడు రాజ్యభారము జారు
పాటు చెందె నన్నతో—జారుట దానిస్వరూపము.
వ్యక్తిగతలోపము గాదు' రావణవధనుగూర్చి మురారి
విశ్వాస మిది. అందుచేతనే ఉద్యోగపు గుండెజబ్బునకు
పాలుగాక సమాహితచిత్తముతో గ్రంథమునందలి ప్రతి
వాక్యమును వ్రాయగల్గిన మహాకవి మురారి.

అతి తోకతో ఒకే వాక్యమున పాత్రల శీలస్వ
భావాదికమును వెల్లడించుటయు గలదు. రాముడు
గుహునిచే సుగ్రీవునకు సందేశము పంపుచు వాచికమునకు
సౌమిత్రి నాజ్ఞాపించెను. అతడు పెన్నాడుగదా 'మన
మిద్వరము మాదృశ్యనకు కావలసినవారము; ఐనను జ్ఞాతి
బుద్ధితో కోతికిసహజమగు చాపల్యము చూపెదవేని
(సాహోద్యప్రతిజ్ఞనుండి లంఘింతువేని) వాలి పెత్తుటి
రుచిమరగిన రామబాణములే పూటకూళ్ళు' అని.
అనగా వాలిని లెక్కింపని బాణములు నిన్ను
ప్రక్కింపక మానవనుట. లక్ష్మణుడు రాముని యభిప్రా
యము తెలియక సందేశవాచికము చెప్పినవాడు గాడు;
అది యిట్లే యుండవలెను. కాని నవమైత్రి కిది సముచి
తమా. రాముడు నవ్వువెంగముతో 'వత్స సహో, లక్ష్మ
ణుడు వచించినప్పుడిట్లే యుండును' అని సమర్థిం
చెను. ఇందు లక్ష్మణుని యుద్ధతశీలమే గాక రాముని
రాజనీతివిశారదతయు ధ్వనితములు.

వ్యక్తులనేగాక సమాజమును చిత్రించుటలో
మురారి నేర్పరి. ఇది సంస్కృతరూపకముల వ్యంగ్యము.
విశ్వామిత్రశిష్యులు మధుపర్కమునకై గోవిశసనము
చేయు సందర్భమున 'ఇక గడ్డితెచ్చు పీడ వదిలెగదా'
యనుకొనుట, లంకలోని రక్కసుల పిల్లలు మేఘనా
దుని ఇంద్రవిజయము నాడుకొనుట, రావణుని శవ
ముపై బడి శోకించు మండోదరిని కోతులు తారస్వర
మున ననుకరించుట—ఇట్టివి వాతావరణకల్పనమున కెను
కూలపడు హృద్యరచనలు.

తెగజదివినవారికి ఆధారములపై పెట్టా పనిలు
వారును. అచ్చముగు తర్కముతో చూచినప్పుడు పౌరా
ణికకల్పనలు హాస్యప్రాయములు. మురారియందలి యీ
విప్లావకధోరణి ఆ కవులలో అరుదైనది. చంద్రుడు అత్రి

కంటినుండి పుట్టెనని పురాణము; చంద్రుడు అత్రికంటి పుట్టె —అని మురారి విశ్వామిత్రునిచే ననిపించెను. పెక్కు భుజముల కౌగిలియు, పెక్కు మొగముల ముద్దులు కల్గియు పతివ్రతగా మెచ్చదగినది మండోదరి యొక్కతెయే. పదిమొగముల రావణుడు పాలుత్రాగుట కుపక్రమింపగా ఎనిమిది మొగము లెప్పుడును ఏడ్చుచునే యుండును (రెండు చన్నులు రెండు మొగములకే సరిపోయెనట.) మంథరము సముద్రమథనమునకు సాయపడిన దుర్మార్గుడు. అందుద్భవించిన లక్ష్మిచేతనే ఈ ప్రపంచమున కొందరు గొప్పవారు—కొందరు పేదవారును గా వర్గీకరింపబడిరి—అని మార్క్సువలె మురారి ఆవేదన పడును. ఇట్టి వనేకములు.

కొన్ని ఘట్టములు కేవలము మడిగట్టుకొన్న పెద్దలను నొప్పించుటకే వ్రాసినట్లుండును. శ్రోత్రియులచే నశ్రోత్రియ భావములను పలికించు టిట్టిదే. ఎంత మడిగట్టుకొన్నను వారును మానవులే అని అతని భావము కావచ్చును. మండలద్రష్టల యందొకడు చెందినవాడు శునశ్శేపుడు. అట్టివాడు వేకువ పెను చుక్కలను తెల్లనీరుల్లిపాయలతో పోల్చును. ఆడుగాడిద చెవిలోపలి తెలుపును బోలిన కెంపుతో క్రుంకుచున్నది ప్రొద్దు అని ఇంకొక ఋగ్ద్రష్ట విశ్వామిత్రుడు పల్కును. లోకమున పెద్దవారిని చూచినప్పుడు 'నమో నమః' అను వాడుక నేటికిని గలదు. దీని నాక్షేపించుచు—రెండుమారులు రామునిచే ధనువెత్తించిన మారీచునకు నమో నమః అన్నాడు మురారి. ఈ శ్లోకార్థము పరిచయమైనచో శిష్టుల వినయమున నీ పద ప్రయోగము చేయుదా రరుదు.

ఇట్లని భారతీయసంస్కృతి నాక్షేపించువాడు గాడు. ఋషులచే నాతడు మాటాడించు పెక్కు సందర్భములు ఉదాహరింపదగినవి. మచ్చున కొకటి—దశరథునకు కబురుపెట్టగా వచ్చిన రాముని నాంతరదృష్టితో చూచి యవతారపురుషునిగా పోల్చుకొన్నట్లు విశ్వామిత్రునిచే మురారి ఇట్లు చెప్పించెను: 'ఋగ్వేదమండలదశకమునందలి ఆయామంత్రములచే స్మరింపబడిన వాడవు నీవు; యజ్వలచే నీ ప్రీతికై స్వాహాకార పూర్వకముగ నర్పింపబడు హవిస్సును త్రేతాగ్ని భక్షించుచున్నది; పాలకడలి పక్కగా గల్గిన నిన్ను క్రతుభోక్తలు పుడమి కవతరింపజేసిరి. ఉద్వృత్తులైన దశకంధర ప్రభృతులు నీచే నిగ్రహింపబడువారు.' దీనిచే ప్రేక్షకులకు రాముని నవతారమూర్తిగా ప్రథమ పరిచయము చేయుటేకాక విశ్వామిత్రుని ఋషిత్వమును చాటిచెప్పినట్లైనది. రీతిలో భావములో వైదికవైభవముచే నీరచనలో ఈశ్లోకము కోటీరమణి (౧ అం—౫౧ శ్లో). ఇది పరాశరుని ఆగ్నేయసూక్తములను, పరుచేపుని బహుఋక్కులను తలపునకు దేగల శ్లోకరత్నము. అవిద్యాబీజవిధ్వంసముచే ఆర్యములైన ఋషిచక్షువులు—భూతభవిష్యత్తుల కావలిదెసను వర్తమానమును దర్శించును. ఈ ఋషివాక్కులను శాస్త్రములే యనుసరించును... ఇత్యాదిగా తావుకొరకఁచో నెల్ల మురారి యార్షసంస్కృతి నుపశ్లోకించును. జనకవిశ్వామిత్రుల సంభాషణ మిట్టి దివ్యరచనలలో నొకటి; లౌకికకవులలో ఒక్క మురారికే యిది సుసాధము.

ఇంతటి విధేయత గల్గియు వైధేయతకు పాల్పడక విమర్శించు దిట్ట మురారి. చంద్రుడు సురల సారాయికొట్టు, అర్ధనారీశ్వరుని కప్రము అపసవ్య సూత్రమే (ఎడమవైపు స్త్రీగాన కుడిభుజమునుండియే అతని జన్నిదము ప్రేలునట) మొదలైనవి పైసిద్ధాంతమును పోషించును.

ఇవి యన్నియు నిట్లుండగా మురారికల్పనలు, స్వభావోక్తులు గ్రంథమునకు భారభూతము లయ్యు నొకసారి చెవిబడెనా మనసున బడి పాయకుండును. 'కనుచాటగుచున్న సూర్యుని వేయికిరణములను క్రమముగా లెక్కించుచున్నట్లు తమ్మిరేకులు సాయంవేళ ముడుగును—వేకువను తిరిగి లెక్కించుచున్నట్లు ఒక్కొక్కటిగా విడును.' ఇందు లెక్కించు విధానమును అచేతనమున నుత్ప్రేక్షించుట గమనించునది. 'వేకువను కాంతి కగ్గిన చంద్రబింబము సాలిపట్టువలె నున్నది.' 'రేయిచీకటి పానబొట్లు కమలకుట్మల బడి వేకువ దానినుండి వెడలు తుమ్మెదలమిష. నల్లని

ముల్యములు వెలువరించుచున్నవి.'—ఇట్లెన్నేని చూప వచ్చును. స్వభావ-చిత్రణముతో సమప్రాణితమగు సత్ప్రేక్షతో అవి యన్నియు సరసములు. సాయం కాలమున ఊరబిచ్చుకల యుల్లాసమును వర్ణించిన భారతీయకవి యితడే. ఇట్లే ప్రభాతమున కాకుల యర పును స్వభావోక్తిలాలిత్యమునకై వర్ణించినవా డితడు. శ్రీహర్షుడు శాబ్దికచమత్కృతికై వాయసరుతిని స్వీక రించెను. ఇవన్నియు లలితములయ్యు కావ్యమును శ్రవ్యముగా మార్చినవి.

ఈ ప్రేక్షణకమునకంతకు మాతృభూతము ఇందలి ప్రస్తావన. ఇంత లలితమును, శాస్త్రీయమును, ఆవర్జకము నైన ప్రస్తావన నాగరరూపకవాఙ్మయమున లేదు. కథావస్తుసూచకముగ సూత్రధారునిచే స్వపక్ష సమర్థనముగా చెప్పించిన శ్లోకము అద్భుతము. ముద్రాలంకారమున శ్లేషకలక్ష్య మనదగియున్నది. ఆ సందర్భ మిది. నాందియైనతరువాత ప్రవేశించిన సూత్ర ధారుడు—ఎవడో ద్వీపాంతరమునుండి వచ్చిన నట కుడు రౌద్రబీభత్సభయానకముగ నభినయించి సభ్యుల నుద్వేజితుల జేసినాడట! మన్యమదేశీయుడనైన సుచరిత్రుడను పేరుగల నేను మీకు ప్రియముపుట్ట నభినయింతును...ఏమనుచున్నారు? పరదేశివి, సహాయ సంపద లేనివాడవు; ఎట్లు కృతకృత్యుడవు కాగల వనియా? వినుడు! న్యాయమున ప్రవర్తించువానికి తిర్యక్కులు సహాయపడును; చెడుదారిని బోవువానిని సోదరుడును విడుచును—అని. (ప్రస్తావన ౪ వ శ్లో.) అప్పయ్యదీక్షితుల మెచ్చుదలయే ఈ శ్లోకసుస్థావరము జేయుటకు నిదుదుపరాక. ఇందు ధర్మవీరుడైన రామునకు సుగ్రీవాదుల సహాయము, తప్పుదారిని బడిన రావణుని విభీషణుడు విడుచుట సూచింపబడినవి.

వర్ణనల పట్టున శ్రోత్రదానులు త్రొక్కుటలో మురారి మేటి. దశరథుని కీర్తిని బహుళపక్షదశ మ్మృగాంకచ్ఛేదోజ్జ్వలముగా నతడు వర్ణించెను. ఇది మనోహరము. చంద్రికోజ్జ్వలత్వమునకు ప్రతికవియు శుక్లపక్షమునే స్వీకరించును; మురారిమాత్రము పత్య్ర మునకు మెరుగుపెట్టుచు బహుళపక్షచంద్రికయే యుజ్జ్వలమని చెప్పగల్గెను. ఇది సారస్వతమున క్రొక్క కవి చేరుకు చేయగల కృత్యము. ఇట్లే ప్రమిదలోని దీపము క్రుంగగా చీకటి నాభిదప్పినపై దను చీకటి యుధివాసవిలోక్తియు పతితలకు నుదువరానిది. రాజ శేఖరు డీభావము నలంకరించుచు విద్ధసాలభంజికలో చీకటిని వర్ణించెను.

ఇందు చివరిదిగా చెప్పదగినది గద్యపద్యరచ నలకు కవియిచ్చిన సమప్రాధాన్యము. ముద్రారాక్ష సమువినా పరిశిష్టరూపకవాఙ్మయమున నుంచి నాక మున బడిన గద్యము స్వల్పము; మృచ్ఛకటికమునందు ప్రాకృతభేదముల నేర్పరించుటకు గద్యము చాల వాడ బడెను. కాళిదాసభవభూతులకు పద్యరచనపై నున్న చూపు గద్యరచనపై లేదు. రూపకభేదములైన భాణ ములందు గద్యప్రాముఖ్య మున్నను అది అంతయు నొక శ్రేణి. ఈ రూపకసమష్టిలో మురారిగద్యపంక్తులు పునః పునః పఠనీయములు. దీనికి పైనిచ్చిన వాలిలక్ష్మ ణుల సంవాద మొక లక్ష్యము. విష్కంభములును గద్యప్రశస్తిచేతనే శోభితములు.

ఇట్లెన్ని కోణములనుండి చూచినను నిలువగల రూపకము అనర్ఘరాఘవము. నాయీ ప్రశంస స్థాలీ పులాకము. గ్రంథమునందలి విషయభారమును సుపరాము చేసిన దింకొక కరుణహాస్యవిన్యాసము; ఉక్తిచాతు ర్యము. ఈ హాస్యగర్భితతయే లేకున్న సామాన్యపఠితలు భయపడవలసిన గ్రంథములలో నిది యొకటి. కాళిదాస శూద్రకహర్షవర్ధనరాజశేఖరుల హాస్యము విదూషకతత్తు ల్యాశ్రితము; ప్రధానముగ భోజనశృంగారోపాధి కము. అనర్ఘరాఘవమున విదూషకుడు లేడు. వినను సుకుమారహాస్యము మొదలు గ్రామ్యపరిహాసమువరకు నెన్ని రకము లుండవచ్చునో అన్నియు కలవని పించును. శృంగారముతోగాని హాస్యము కలిసిరాదను నాలంకారికోక్తి సమర్థమైన మురారిపట్ల కుంఠితీ కరింపకతప్పదు. అతని బుద్ధిప్రసంగమునను గోరుచెచ్చని హాస్య మున్నది. హాస్యము వస్తువునందు అలక్ష్యభావమును పెంపొందించుట కొక సాధ నము. పండితప్రబంధియైన మురారి దీనిని గ్రహింపడా? హాస్యము తక్కువతరగతులనే యూత

జీవింపనక్కరలేదు; మనము ఘను లనుకొనువారు చాలంబికములే. సంస్కరణప్రియులకు హాస్యము సాధనము. తీవ్రవిమర్శకల్లోలితమైన జీవితమును నిరుపద్రవముగ నొడ్డుచేర్చు చుక్కాని హాస్యము.' కలకలలాడు మొగముతో ప్రకృతిఋణమును దీర్పుము (*Pay Nature's debt with cheerful countenance*) మానవుడు మానవుడుగా జీవించుటతో తృప్తిపడినచో భూమిజీవితమున నిన్ని విషాదచ్ఛాయలు కమ్ముకొనియుండవు! అశాంతి దురాదర్శఫలితము (*The unrest is the effect of a false ideal*). ఇంతటి భావవైశాల్యమును గల్గించు హాస్యతరంగములు ఆయా సందర్భముల నుదుటనవ్వులు చూపును. ఎడతెగని జన్మముల విత్యహావికోష్ఠ దేవపతికి ముక్కంటి లెక్కవరై చూపులు నుందగించెను; చంద్రుడు సముద్రనకు సర్వాంగ పేదస్కారుడు; కట్టపగలు రెండుజాముల వేళ పొడదలచి నాగకన్నెలు నైకలూడదీసిరి; ఋషి కాంతలు బెదరించుటకు దండములెత్తగా లేళ్లు బెదరక అందుకొన్నవి. ఇత్యాది. (గుణశ్లేషహాస్యముల సంవాదమును, శతానందభార్గవసంవాదమును చూడునది) ఏడవ అంకమంతయు బహువిధహాస్యశోభితము.

మొత్తముపై శిల్పదృష్టిని విస్మరించి తన సుఖ దుఃఖములను, అనుభవములను ఏకరువు పెట్టుకొను నాటక యుగమునకు — వానిని మరచి ప్రకృతివర్ణనలలో మైమరచు మరియొక యుగప్రారంభమునకు అనర్ఘ రాఘవము కూడలి. మురారి యీ రెండుయుగముల నరము చేసికొన్నవాడైనను వానికి బానిస కాడు. తన కృతిలోని వర్ణనలతో అతని కెంత తాదాత్మ్యము మున్నదో అంత తాటస్థ్యమును కలదు. పునరుజ్జీవకమైన నవ్యతకై కలవరించువారు పఠింపదగిన యుత్తమ రూపక మీ సుకృతికృతి.

పండితుల మన్ననలు వడసిన మురారిని ఇంకొక కవితో పోల్చుట కలహము పెంచుటే అగును. అతని స్థాన మతనిది. అతనిని భవభూతికన్న ఘనుడని యారాధించువారు పెక్కు రున్నారు. భవభూతి కితడు జఘన్యుడే అని తెరలో పలికి సంతోషపడు వారును లేకపోలేదు. వా రితనికి వస్తుపాత్రరసౌచిత్యము తోడి రచన తెలియదని యాక్షేపింతురు. మురారియం దీనింద సాహసము. 'సుకైర్ద్యశరితుపాస్యమో యశస్య మత్సరిణో వయమ్' దీనికి వాకట్టు. మహావీరచరిత్రముకన్న వస్తుపాత్రరసౌచితిలో అనర్ఘ రాఘవము అనర్ఘమైనది. ఈ వ్యాసమే ఆవిషయమును స్పష్టీకరించుటకు వేసగిపగటి వెలుగు.

సాహిత్యము కుదుర్చుకోవలెనన్నచో దాటి పోవు ప్రయత్నములు మానవలెను. ఆధునికపత్రికలు తేలికమార్పులు జీర్ణించుకోమరగి సాహిత్యగౌరవ మున్న గ్రంథము దెసకు పోదు; అథవా వెళ్లినను వారిది దాటిపోవుమాటే. చివరకు వారు విద్యార్థులకు లైనను మిగిలెడిదీ తేలికదనము. మురారిని ప్రశంసించు పండితోక్తు లనేకము కలవు. వానిలో ప్రసిద్ధమైన 'దేవీం వాచ ముపాసతేహి బహవః సారం తు సారస్వతం జానీతే నితరా మసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః — అబ్ధిర్లంఘిత ఏవ వానరభటైః...' అను శ్లోకము మురారిప్రశస్తికే కాక విద్యార్థుల సాహిత్యకృషికిని సూచకముగ నున్నది. 'అబ్ధిర్లంఘిత ఏవ వానరభటైః' — కోతులును సముద్రమును దాటినవి. కాని సముద్ర గాంభీర్యము నవి యేమెరుంగును? దాటుకొనిపోవుట వలన ప్రయోజనము లేదు. తలస్పర్శముగ చూడవలె నను కుతూహలము, క్షమ ముఖ్యములు. అట్టివారే లోకమునకు చంద్రకాన్త్యాదికము లర్పింప నలంకర్మీణులు. మురారి యిట్టి సాహిత్యపాథోనిధి మంథానగిరి. తత్ఫలితముగు నీరచనయే ఓఋస్వాదుసుధ—సర్వజ్ఞులు తలదాల్చదగిన రతన మిది—కవయితే యన్నట్లు అనర్ఘము.

౨

ఆంధ్రకవులు రీతిప్రియులు. అందుచే రీతిమహితములైన గ్రంథములు వారి కారాధ్యములు. అనర్ఘ రాఘవ మట్టి యారాధ్యముల నొకటి; కాదంబరి యింకొకటి. కాదంబరి మన ప్రాచీనకావ్యముల ఓజోరీతికి భిక్షపెట్టిన యన్నపూర్ణ. అనర్ఘ రాఘవము తెనుగుకైతల నాగరికమైన కథ్యమునకు తోడుపడిన శిల్ప

కారిక. తెనుగువృత్తముల రీతికి—ముఖ్యముగా శార్దూలముల పోకడకు నన్నయ్యగారినుండియు మురారిరచనకే ఒజ్జబంతులు. అంతేకాక ఈ కావ్యములకు ప్రాధిమను ప్రవరించు పాణౌకృతి,ద్వైరాజ్యము,పాణింధమము వంటి యనేకపదరత్నము లీయూపణమున లభించినవే. నన్నయ్యమంచి రామకృష్ణునివరకు గల కవీంద్రులెల్లరు. తృణమో పణమో మురారిరచననుండి గ్రహించిరిగాని వట్టిచేతులతో రాలేదు. ముఖ్యముగా ప్రాబంధికుల పదముల తమాషా అనర్ఘరాఘవపరిచయప్రాప్తమే.

నన్నయ్య మనకు కవిప్రథముడు. అతని వృత్తగమనమునకు మురారివృత్తగమన మాదార్శకము. మురారి వ్రాసినన్ని దీర్ఘవృత్తములు ఇంత ప్రౌఢముగా వ్రాసిన మరియొక సంస్కృతకవి యుండడేమో (ఏమో అనుటకు మదయారుడు కారణము.) వృత్తమును నడిపించుట ప్రత్యేకకళగా పెంపొందించినవాడు మురారి. అతని రూపకమునందలి ౫౬౫ పద్యములలో సుమారు ౨౬౭ పెద్దవృత్తములు; వీనిలో ౧౫౭ శార్దూలములు. నాటకరచనలో ఇన్ని వృత్తములు వ్రాయుటయు కాళిదాసభవభూతులకంటె మురారియందు గానవచ్చు నాకర్షకమగు నొక వైలక్షణ్యము. ఈ వృత్తరచనలో అతను కొన్ని పోకడలు పోయెను. మొదటి పాదద్వయమున విషయము నందిచ్చి మిగిలిన రెంటిట నొకే సమాసము ఘటించుట; చివరిపాదమును సమతతో అనుప్రాసఘటితముగ ముగించుట. మొదటి రెంటిని ఒకే సమాసముతో నెత్తికొని యుత్తరార్ధమున విషయము నుంచుట. ఒక్కొకచో చివరిపాదమునుమాత్రము సమాసాంతము చేయుట. ఇందు వీనికి క్రమముగా "త్రైలోక్యాభయలగ్నకేన భవతా... తవ యశోభిరశోభి విశ్వం ... ఉద్దామద్యుమణిద్యుతివ్యతికర... సంవృత్తోయం యది తవ భుజా" అనువానిని చూచునది. నన్నయ్యగారి వృత్తములను ఇన్ని పోకడలు పోవును. "త్రేతాద్వాపరసంధి నద్ధతమదాంధభూత... పాతాళైకనికేతనాంతరమునకా...దాశార్హుండు పూజార్హుడే...వివిధోత్తుంగతరంగఘట్టన..."పద్యములలో నై పోకడలు నీవగట్టును. ఈ గతులకు నన్నయ్యగారి రచనయంతయు నద్దమే. ఇంతేగాక అక్షరవిన్యాసములో దీర్ఘములు సంయుక్తపూర్వములు ఒత్తులు బిందుయుక్తములు ఆవృత్తముచేయు మురారిపద్ధతి నన్నయ్యరచనయందే కానవచ్చు ప్రావ్యలక్షణము. చతురంభోధిపర్యంత భూవలయముకా...సర్వేశసారణ్య సత్కీర్తిధృత్కంబకు దాని...భరతు దశేశభూభువనభారధురంధరుడై... ఇత్యాదులు పఠించునది. ఇట్లే ఋషిప్రోక్తముగ పద్యమును నడిపించు శక్తిని భవభూతి యనుష్టుప్పులలో జూపినట్లు మురారి వృత్తములయందు చూపును. నన్నయ్యగారి రచనయంతయు నార్షమే యనదగినది. మురారి శబ్దబ్రహ్మోపాసకుడు. "నశబ్దబ్రహ్మోఖ్యం పరిమళ మనాఘ్రాయ ... వ్యనిర్వాసితశబ్దబ్రహ్మోగమ్ ...స్ఫురద్వాగ్బ్రహ్మోణ" ...ఇత్యాదిమురారి ప్రయోగములను పఠించునది. నన్నయ్యగారు నిట్టివే. ఇట్లు వృత్తగమనములో, అక్షరావృతిలోనే కాక భావముల ననుకరించుటయు నన్నయ్యగారిలో గానవగును. "శ్రవణసుఖమ్ముగా..."పద్యములోని కరికరశీతలచ్ఛాయతచ్ఛీకరాంబుకణముల చల్లని గాడ్పువడి వాని కెంది సుఖంబున్న సింహములు—వనగజముఖోత్కీర్ణ పయోబిందువుల శిశిరమసృణములైన కచ్ఛస్థలుల విశ్రమించు నీగ్రంథమునందలి శేర్ల నెఱుంగును. ఇట్లు మురారి నన్నయ్యలలో గల సాహిత్యబంధుత్వమును, కాక శాఖీయమగు గోత్రబంధుతయు పొషించు టొక ఆశ్చర్యకరమగు విషయము. మురారిభట్టును, నన్నయ్యభట్టును మౌద్గల్యసగోత్రులే.

ఎఱ్ఱనయు పద్యరీతిలో అనుకృతిగా, భావనలో అనూక్తిగా నడిపించిన తావు లొంకురెం డున్నవి. దీని కాతని "అతిగాంభీర్యవిభూతి..." పద్యము స్మరించునది.

అదేమార్గమున వచ్చి అనర్ఘరాఘవమును కొల్లగొట్టినవాడు శ్రీనాథుడు. అతని ద్వైరాజ్యము, చక్షుఃకరంబము, ప్రత్యూహము, కాలముద్వహము, కింపుర్వాణ వ్యామగ్రాహ్యాది బహుపదములు మురారివే. అంతేగాక "ఉద్దామద్యుమణిద్యుతివ్యతికరప్రక్రీడదర్కోపల" ...శ్లోకమును అచలేంద్రమంథ సంక్షుబ్ధదుగ్ధమయసాగరమును శ్రీనాథునిలో తెనుగువారివిగా స్థిరపడినవి.

మొదటిదానికి అతడు దుముకులు చేర్చెను. రెండవ దానిని మంథాచలమంథానమథ్యమానదుగ్ధపాథోధిల హరికోద్భూతిగా నాతడనుకరించెను. మురారికల్ప భాండారమునిట్లు వాడుకొనియు శ్రీనాథుడు మురారిని కవిస్తుతుల పేర్కొనడు. శ్రీనాథుని స్తుతింపమి తద నక్తత్రయము పెద్దనయందొక మచ్చగా పిశేలింగము గారు చాటిరి. ఇట్టిదో శ్రీనాథునియందు నిది కళంకమే గదా—నే నట్లనను. పెద్దన శ్రీనాథు నీవిషయమ్మున మును పరికరపు పరీక్షగా విడిచిరి. కవుల కిది యొక వినోదము.

రాయలవారి దిగ్గజములకును మురారికావ్యమే విరాజత మైనది. పెద్దనలో మురారిని కొన్ని భావ చ్ఛాయలు, పదప్రయోగములు గలవు. భట్టుమూర్తిగారి హరిశ్చంద్రనలోపాఖ్యానపద్యము—శ్రీనైదేహీసుత కా ఘృణాద్యహో జయశ్రీ కా అనునది—'కన్యా కాచి దిహాపి కర్మణి పణప్యాత్...' అను శ్లోకమున కనుకృతి. ఇది భార్గవధనుర్భంగసమయమునందలి శ్లోకము. 'శివధనుర్భంగముచే తాను రామునకు పత్నియైనది; భార్గవుని నారాయణ ధనుర్భంగముచే నింకొకతె లభించును గాబోలు'నని సీత అనూయపడినదని చమత్కారము. తిమ్మనగారి తుండపరిమృజిత మురారిదే' మురారిని పెద్దన భట్టుమూర్తు లిరువురును స్తుతించి కృతజ్ఞత తెల్పుకొనిరి. పింగళివారియందును ఒండురెండు భావచ్ఛాయ లున్నవి. తరువాత రీత్యారాధకులలో నిష్ణాతుడుగా కొండాడబడిన పాండురంగకవియు మురారిపదభక్తుడును, భావానక్తుడు నై యున్నాడు.

రాజన్నిదం బహుళపక్షదళవ్యపాంక
చ్ఛేదోజ్జ్వలై స్తవ యశోభి రశోభి విశ్వమ్—
బహుళపక్షంబు చీకటిబహుళమగుట
చాయవెన్నెల తరితీపు చేయుకరణి—

ఒక్కొక్క కవి కొక పదముసం దెక్కువ మక్కువ యుండును. మురారికి తత్తాదృక్ పదప్రయోగము అట్టిది.

తత్తాదృగుజ్జ్వలకపుత్థ్యకులప్రశస్తి...
తత్తాదృక్ కృణపూలకోపనయన...
తత్తాదృక్ ఫణిరాజరజ్జుకషణ...

శ్రీనాథునకు పాటింపముమున బలె రామకృష్ణున కీప్రయోగమున రుచి యెక్కువ. తత్తాదృక్తుండరుచిః.. తత్తాదృశ్యదజృంభమాణకిరణీ...

మన మహాకవులకు అనర్ఘరాఘవమున గల గౌరవమున కీనిర్దేశములు చాలునని విరమించెద.

## 3

ఇట్టి యెక్కువిశిఖామణి నివాసస్థలమును, జాతిని పట్టియిచ్చు సాధనములు గ్రంథస్థములైన యాతని పంక్తులే. పీని కర్థభేదములు పెంచి విమర్శకులు పెక్కు దారులు తీసిరి. ఫలితము నిరాకారప్రార్థన. మురారి భీమేశ్వరమును, సప్తగోదావరమును స్మరించుటచే నంధ్రుడు కావచ్చునని కొందరి వాదము. ఇతె డిట్లే పెక్కుస్థలములను వర్ణించియున్నాడు; ఐన నాయాజాతులకు సంబంధించినవాడని వారువారనుకో వచ్చును. నాటకము పురుషోత్తమయాత్రాగతులకు ప్రదర్శింపబడినట్లు చెప్పబడినది. కాన కవి జగన్నాథముప్రాంతమువాడు కావచ్చును. ఈ పురుషోత్తమశబ్దమునకు జగన్నాథు డను అర్థము చెప్పుటకు ఆంధ్రపండితులు కొందరు అంగీకరింపరు. వారది విష్ణుపరముగ గ్రహింపతగెనని వాదింతురు. వైవాహిక గీతముల స్త్రీల 'యులులూలు' ధ్వనిని మురారి వర్ణించినాడు. ఇదియు నితడు ఓఢ్రదేశపువా డనుటను స్థాపించుటకు చాలియున్నది. ఐన నితడు ఓఢ్రుడు దశనేమో. అనర్ఘరాఘవము ఉత్తరాహులయందు కన్న దాక్షిణాత్యులందే ఎక్కువ ప్రచారములో నుండుటచే అత డీద్రావిడజాతుల నొకదానికి సంబంధించినవాడు కావచ్చునని మరియొక వాదము. ఈ వాదమునకు బలముగ నాడు గన్పించినది ఇతని 'అము'పద ప్రయోగము. తమిళులు అంగీకారమునకు 'అము' వాడుదురు. ఇది సంస్కృతపదముగ నే కోశకర్తలు చెప్పినను—దీనికి ప్రచార మరవలయందే యుండుటయు,

ఇది మురారినాటకమునకే చాలపాటులు ప్రయోగింప బడియుండుటయు గమనింపదగినది.

అత డేజాతివాడైనను, ఎక్కడివాడైనను ఒకటే—సారస్వతపు టెల్లలలో నిట్టి పేచీలకు తావు లేదు.

మురారిగ్రంథము మాఘకావ్యమును దలపించుటచే "మురారిపదచింతా చేత్ మాఘే మతింకురు" వంటి ప్రశంసలు పుట్టినవి. మొత్తమునకు శ్రవ్యములలో మాఘుడును, దృశ్యములలో మురారియు సమయసముచితశబ్దారాధనలో ఒకరికొకరు పోల్పదగినవారు. ఇదిగాక మురారినాటకమున కాళిదాసీయనాటకచ్ఛాయలు, భవభూతియుత్తరరామచరితచ్ఛాయలు గలవనుట సాహిత్యవైదికుల కనాఘ్రాతవిషయము గాదు.

విస్తరభీతిచే గ్రంథములు, సందర్భములు సూచించి విడుచుటైనది. ఐనను ఇట్టివి జిజ్ఞాసువులకే గాని యెల్లరకు రుచించునవియు గావు.

నేడు దొరలబడిన అనర్ఘరూపకముల ననర్ఘరాఘవ మొకటి. ప్రముఖాంధ్రకవుల పదప్రయోగశైలిచిత్రి కొరకైన దీనిని పఠింపవలసియున్నది. భిన్నరుచులగు జనుల కెల్లరకు సమారాధ్యముగ నుండవలెననియే రచయిత రూపకప్రక్రియను స్వీకరించును. పెక్కుగ్రంథములకై కాలయాపన చేయుటకన్న అనర్ఘరాఘవము వంటి గ్రంథము నొండురెండు తలస్పర్శముగ చూచిన చాలును; సాహిత్యభూమి యసివారుగా జేగదగిన బలాటై కన్పించును. పండితులేగాక రసికులును మురారిగ్రంథమును పఠించి కృతజ్ఞతాముత్పులకాంకురములు వహింతురుగాత!






# భారతీయభాషలు - వాఙ్మయము

'సుమతి'

మన రాజ్యసత్కృతిలో ౧౪ భాషలకు గణ్యతయున్నది. ఇంగ్లీషు రాజ్యభాషగ ౧౫ సంవత్సరములవరకును ఉండవచ్చును. దాని స్థానే రాజభాష కావలసినది హిందీ. కాగా ౧౩ భాషలు దేశభాషలుగ పేర్కొనబడినవి. అవి—సంస్కృతము, తెలుగు, తమిళము, మళయాళము, కన్నడము, మరాఠీ, గుజరాతీ, పంజాబీ, కాశ్మీరీ, ఓఢ్రము, బంగాలీ, అస్సామీ, ఉర్దూభాషలు. ఈయాభాషలనుగూర్చి స్థూలముగా కొంత తెలిసికొందము.

## ఇంగ్లీషు

౧౮౩౫ మొదలుకొని, ముఖ్యముగ ౧౮౫౮ నుంచి, మన దేశములో చదువులకు ఇంగ్లీషే అవలంబమైనది. అదే అంతకుముందునుండియు రాజభాష. ఆభాషాప్రాధాన్యములో దేశ మొక శతాబ్దముపైగా గడిపినది. విద్యార్థులుకాని, జిజ్ఞాసువులుగాని ఇష్టపడి చదువుకొన్నది కాదది. ప్రభుత్వము జరుగుటకు, ప్రభుత్వము నాశ్రయించుటకు, జీవయాత్రకు ఇంగ్లీషే శరణ్యము. ప్రపంచమహాసారస్వతములలో ఇంగ్లీషు ఈనాడు ముఖ్యము, ప్రబలము అనుట నిజమే. ఈనాడు విశ్వసాంగత్యమునకు ఇంగ్లీషు వ్యాసంగము అవసరమే. కాని ఆంగ్లమునకు నేడున్న స్థానబలిమి స్వతఃసిద్ధము కాదు, అత్యంతము అనర్హము. ఇంగ్లీష్-అతిశయ హేతువుచే దేశభాషలు కుంచుకొని పోయున్నవి. మనకు భౌతిక దాస్యము తప్పినను భాషలో, భావములో దాస్య మింకను తప్పలేదు. క్రమేపి ఇంగ్లీషు యథోచితమగు స్థానమునకు తగ్గునని ఆశించవచ్చును.

ఈ నూరు నూటయేబదేండ్లలో భారతీయులు ఆంగ్లభాషాప్రవీణులై ఖ్యాతినందిరి. చక్కని రచయితలుగ, కవులుగ, గద్యకవులుగ పలువురు జగద్విఖ్యాతి గాంచిరి. ఇట్టివారితో ఇండో-ఆంగ్లియన్ సాహిత్యము, అనగా భారతీయమగు ఆంగ్లసాహిత్యము ఏర్పడినది. రాజా రామమోహనరాయ్ ఈశాఖలో ప్రథముడు. అక్కచెల్లెళ్లు అరూదత్తు, తోరూదత్తు కవయిత్రులుగ పేరందిరి. రమేశచంద్రదత్తు రామాయణ మహాభారతములకు చేసిన ఆంగ్లకృతులు మెచ్చదగినవి. రవీంద్రనాథ ఠాకూరు వంగములో "వాక్పతి"యైనను ఆంగ్లసారస్వతము చేకొనక విశ్వసాహిత్యమున వన్నె దిద్దెను. సజీవులలో బహుభాషాకోవిదులు శ్రీ అరవిందులు ఆంగ్లమున కవిగా ప్రశస్తులు. ఇట పేర్కొనని రచయితలు ప్రధాని పండిట్ జవాహర్లాల్ నెహ్రూ ప్రభృతులు పలువురు కలరు. సుమారు ౩ లక్షలమందికి ఆంగ్లము వచ్చును.

## సంస్కృతము

దేశభాషల కిది తల్లి. జగద్భాషల కిది తోబుట్టువు. ఇది మృతభాష కాదు, జీవద్భాష. నిత్యము సంస్కృతమే మాట్లాడు కుటుంబము లింకను కొన్ని వేలు దేశములో నున్నవి. భారతీయసంస్కృతికి, సంప్రదాయమునకు సంస్కృతవాఙ్మయమే నిధి. ప్రపంచమందలి వివిధవాఙ్మయములలో ఇది సుసంపన్నము, నిరుపమానము. ఇదే దేశభాషల సారస్వతమునకు ఒరవడి. మహాభారతఇతిహాసము, రామాయణకావ్యము దేశభాష లన్నిటిలోనికిని పరివర్తితమై అవే ముఖ్య గ్రంథము లైనవి. వ్యాప్తి తగ్గినను ఈ దేశభాషలలో సంస్కృతవైభవ మింకను నిలిచియున్నది. ఒక శతాబ్దమునుండియు యూరప్, బ్రిటన్, అమెరికాలలో సంస్కృతము ప్రత్యేకించి అభ్యస్తమై మన్నన నంది

నది. యుద్ధమునకు పూర్వము జర్మనీలో అన్ని విశ్వ విద్యాలయములందును సంస్కృతము బోధించువారు. ఇపుడు మరల బోధించుచున్నారు. స్వదేశములో పునరుజ్జీవితమైనను సంస్కృతి యింకను అర్హస్థానమందలేదు. సంస్కృతవిద్యాపీఠమొకటి స్థాపించు నాలోచన కలదు. ప్రాచ్యవిద్యాపీఠములు నిరంతర పరిశోధన కావించుచున్నవి. సాయణాచార్యుడు ఋగ్వేదభాష్యము రచించిన అనంతరము ఇన్ని శతాబ్దముల కిపుడు మరల క్రొత్త భాష్యమొకటి సిద్ధాంజన మనుపేర శ్రీ అరవిందుల అన్వయముప్రకారము ఋగ్వేదమున కంతకును మాత్రార్థమును అధ్యాత్మగతముగ వివరించుచు ప్రచురితమగుచుండుట విశేషించి చెప్పదగియున్నది. శ్రీమన్మహాభారతమున అనేక ప్రక్షిప్తములు చేరి మూలగ్రంథము గుర్తుపట్టుటకు వీలులేకుండుటచే లభ్యమగు గ్రంథమంతయు పరిపూర్ణముగా శోధించిశోధించి పూనాలోని భండార్కర్ సంస్థవారు శుద్ధప్రతిని వెలువరించుచున్నారు. ఇది చాలవరకు పూర్తికావచ్చినది. సంస్కృత వాఙ్మయచరిత్రము సంగ్రహించి చెప్పుటకైనను ఇచట స్థలము చాలదు. వ్యాస, వాల్మీకి, కాళిదాస, భవభూతి మున్నగు కవీశ్వరుల కావ్యములు నేటికిని మన సొమ్ములు. సంస్కృతము నిత్యము వాడువారు కొన్ని వేలమందియు, భాషవచ్చినవారు కొన్నిలక్షలమందియు కలరు.

## హిందీ

హిందీ రాజభాష కావలెనని ౩౦ సంవత్సరములు ఆందోళన సాగి నెరవేరినది. క్రమముగ ఇంగ్లీషుస్థాన మాక్రమించుచు ౧౫ ఏళ్లలో హిందీ భారతరాజ్యభాష కాగలదు. ముఖ్యముగ సంస్కృతమును ఆశ్రయించి, దేశభాషలను దృష్టిలో నుంచుకొని అఖిలభారతీయభాషగ హిందీ వికసించవలెనని యుండునని రాజ్యాంగ వ్రతిలో చెప్పియున్నది. దేశ జనాభాలో సుమారు సగముమందికి ఏదో ఒకరకమైన హిందీ తెలియును. హిందీవాఙ్మయము ౧౨వ శతాబ్దమునుండియు ఎత్తిమాపవచ్చునుగాని ఎక్కువ వ్యాప్తి, వికాసము గతమూడు రెండ్లలో లభించినవి. హిందీ అనేక ప్రాకృతాదిభాషల సంపుటిగా సిద్ధించుచున్నది. ఖడీబోలీ, బిహారీ, అవధి, వ్రజభాషా, బుందేల్ ఖండ్, రాజపుటానీ, భోజపురీ ఇత్యాది మాండలికము లనేక మిందున్నవి. మూలముగ హిందీ పలుప్రాంతములలో వాడుకలో నున్నను భేదము చాల కలదు. ఏకరూపము సాధించవలెనని యత్నించుచున్నారు. కబీరు, ధర్మదాసు మున్నగువారు భోజపురిలో పాటలు, పద్యములు వ్రాసిరి. ఆధునికులలో రాహులసాంకృత్యాయనులు హిందీలోను సంస్కృతములోను కాక భోజపురిలోను ప్రవీణులు. హిందీప్రాచీనసాహిత్యములో తులసీదాసు రామచరిత మానసము ప్రత్యేకించి చెప్పదగినది. హిందీకి ముందుముందు మంచిరోజు లున్నవి. సుమారు ౧౫ కోట్లమంది హిందీ మాట్లాడుదురు.

## తెలుగు

ఇది మద్రాసుప్రాంతములోను, హైదరాబాదులోను, మధ్యప్రదేశములోను, ఒరిస్సాలోను వాడుకలో నున్నది. శాసనాలా అవీ క్రీస్తు ౧౦ శతాబ్దికి పూర్వం చెప్పదగిన వాఙ్మయం మనకు లభించలేదు. చాలగ్రంథ ముండియుండవలెను గాని ఖిలమైయుండును. నన్నయభారతమే తెలుగుసాహిత్యమునకు మూలము. ఇది ౧౧వ శతాబ్దివాటిది. నన్నయ, ఎఱ్ఱాప్రగడ, తిక్కన తెలుగుభారతమును రచించిరి. అదే తెలుగు భాషకు ప్రమాణము, మిక్కిలి ప్రసిద్ధము. పోతనభాగవతముకూడ ప్రశస్తిగాంచినది. రామాయణము పలువురు వ్రాసిరి. రామాయణమును పురస్కరించుకొని సుమారు ౫౦౦ గ్రంథములు తెలుగులో వెలువడినవి. ప్రత్యేకించి పేర్కొనవలసినవారు శ్రీనాథుడు, అల్లసాని పెద్దన, తిమ్మన, సూరన మున్నగువారు. ఆధునికులలో కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, తిరుపతివేంకటేశ్వరకవిద్వయము... తెలుగుభాషను సుసంపన్నముచేసినారు. ఆంధ్ర, మద్రాసు, ఉస్మానియా విశ్వవిద్యాలయములలో తెలుగునకు కొంత గణ్యత యున్నను సంపూర్ణవికాసమునకు వలయు కృషి జరుగలేదు. నూరేండ్లక్రితము చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ చేసిన కృషి నుపయోగించుకొను యత్నమైనను కనబడదు. వినను జవసత్వములు గల కవులు, రచయితలు ప్రతిభాశాలురగువారు పలువురు ప్రకృతము చక్కని వాఙ్మయము నదజల్లుచున్నారు. సుమారు ౩ కోట్లమంది తెలుగు మాట్లాడువారున్నారు.

## తమిళము

తమిళ వాఙ్మయముకూడ ప్రాచీనమైనది. తోలాప్పియం నాటినుంచి నేటివరకును తమిళము అనేకరీతుల పెరిగినది. ఇవ్విభాష దక్షిణమునను, సింహళములో కొంతమేరయందును, మలయాలోను ప్రచారములో

నున్నది. చెప్పదగిన ముఖ్యగ్రంథములు కంబరామాయణము, తిరుక్కురళ్, నాలడియార్, మణిమేకలై, శిలప్పదికారమ్ మున్నగునవి. భాష, లిపి వేరని పించినను అచ్చతెలుగుకు, తమిళమునకు దగ్గరసంబంధమున్నది. ఈ రెండుభాషలును ఇరుగుపొరుగువై వైష్ణవసంప్రదాయము ఉభయత్ర వర్ధిల్లుటచే సాంగత్యము చాల పెంపొందినది. రెండుకోట్లు పైగా తమిళు లున్నారు.

## మళయాళము

మద్రాస్‌లోని మలబారుజిల్లాలోను, తిరువాంకూరు-కొచ్చిన్ కూటమిలోను ఈ భాష వ్యవహారములో నున్నది. ౯ వ శతాబ్దినుంచి దీనికి శాసనాది సాహిత్యసామగ్రి లభించును. ౧౪ వ శతాబ్దపు మళయాళశైలి మళయాళ, సంస్కృత సమ్మిళితమై "మణి ప్రవాళ"మని ప్రసిద్ధిగాంచెను. ౧౫ వ శతాబ్దమునుంచి సంపూర్ణగ్రంథములు లభించుచున్నవి. భారతభాగవతరామాయణములు మళయాళములో వెలసినవి. వల్లత్తోల్ నారాయణమీనన్ అనుష్టుప్ ఛందస్సులో అనువదించిన రామాయణము మిక్కిలి ప్రసిద్ధమైనది. తుళ్ళల్, కథకళి అనే నాట్యకావ్యములు స్వతస్సిద్ధమైనవి. తమిళమువలెకాక మళయాళము చాలవరకు సంస్కృతమయము. మళయాళము మాట్లాడువారు కోటిలోపు ఉందురు.

## కన్నడము

లిపిలో భాషలో ఇది తెలుగుకు తోబుట్టువు. దీని గ్రంథసామగ్రి ౮,౯ శతాబ్దులనుండి కానవచ్చును. సాహిత్యమున కాశ్రయము సంస్కృతము. పంప, పొన్న, రన్న, బసవ, జన్న మున్నగు కవీశ్వరులు కన్నడవ్యవసాయము బాగుగ చేసిరి. వీరశైవమతము కన్నడ, తెలుగుసాహిత్యములను సన్నిహిత మొనర్చెను. చంపూకావ్యములు, యక్షగానములు, శాస్త్రగ్రంథములు చాల కలవు. కేశిరాజకృతమగు శబ్దమణిదర్పణ మిప్పటికి ప్రసిద్ధము. ఆధునికులలో ముఖ్యులు మాస్తి, పుట్టప్ప, కైలాసం, మూర్తిరావు, బేంద్రి ప్రభృతులు. ఇది ప్రధానముగ మైసూరులోను, కొద్దిగ హైదరాబాదు, బొంబై, మద్రాస్ ప్రాంతములలోను వాడుకయందున్న భాష. కన్నడులు కోటికి పైగా నున్నారు.

## మరాఠీ

సాహిత్యనిదర్శనములు లభ్యమై లేకపోయినను ౧౩ వ శతాబ్దికి పూర్వము చాలకృషి జరిగియుండవలెను. మరాఠీసాహిత్య మెక్కువగ మతసంబంధముగలిగి తత్త్వములతో నిండియుండును. మహారాష్ట్రములో భగవద్గీతప్రభావ మధికముగ కన్పించును. జ్ఞానదేవకృతమైన జ్ఞానేశ్వరీయమను గీతాభాష్యము నేడు ప్రసిద్ధము. ఆధునికులలో శ్లోకపు ఫణితిని గీతను మరాఠీలోకి అనువదించి ఖ్యాతిగాంచినవారు వినోబాభావే. అక్కడ గీతాసంప్రదాయము, భక్తిసంప్రదాయము హెచ్చు. లోకమాన్యతిలకు రాజకీయనాయకుడుగాకన్న గీతాభాష్యకారుడుగా మహారాష్ట్రములో విఖ్యాతుడు. నామదేవు, ముక్తాబాయి, ఏకనాథ, తుకారాం మున్నగు భక్తులు భక్తిసాహిత్యమును అభంగముల రూపమున వెలువరించిరి. ఆధునికులలో ముఖ్యులు విష్ణుశాస్త్రీచిప్లూంకర్, అగర్కార్, పరాంజపై, యన్. సి. కేల్కార్, వి. యం. జోషీ, యన్. యస్. ఫాడ్కే మున్నగువారు. మరాఠీలు రెండు కోట్లకు పైగా నున్నారు.

## గుజరాతీ

అచ్చతెలుగుకు, గుజరాతీకి మాటలతీరులో పోలికలున్నవి. ఇది బొంబై ప్రాంతములోను, సౌరాష్ట్రములోను, ఆఫ్రికాలోను, ఇతరవిదేశములలో, భారతీయులు వలసగ ఉన్నచోట్లను ప్రచారములో నున్నది. ఇందులో జైనసంప్రదాయము ప్రధానము, తొలుత చాలవరకు జైనసాహిత్యమయ మిది. గాంధీ మహాత్మునకు ప్రియముగూర్చిన కీర్తన "వైష్ణవ జనతో" అనునది నరసింహమెహతా రచించినది. మీరాబాయిపాటలు అందరికీ తెలిసినవే. ఆధునికులలో నర్మదాశంకర్, త్రిపాఠీ, మలబారీ, గాంధీ, ఆనంద ధ్రువ, కె. హెచ్. ధ్రువ, కె. యం. మున్షీ ప్రభృతులు ముఖ్యులు. గుజరాతీలో జైన, పారసీ, ముస్లిం, క్రైస్తవవాఙ్మయము చాల వచ్చినది. ఇటీవల గుజరాతీ వివిధరీతుల వ్యవహృతమగుచు ఆధునికావసరములకు అనువుగ తయారగుచున్నది. గుజరాతీలు కోటికి పైగా కలరు.

## పంజాబీ

ఇది పంజాబులోను, పాటియాలా [పంజాబ] రాష్ట్రములోను వ్యవహారమున నున్నది. ఇది సిక్కుల భాష అనవచ్చును. లిపిని గురుముఖీ అందురు. పంజాబీలో ముస్లిం, హైందవవాఙ్మయములు వచ్చినను ప్రధానముగ ఇది సిక్కుమతమునకు చెందినది. ఈ భాష అంత ప్రాచీనమూ కాదు, సంపన్నమూ కాదు. గురునానక్ బోధించిన గురుగ్రంథసాహిబ్ అనే ఆదిగ్రంథము పంజాబీకి మొదలు. పదవగురువు గోవిందసింహు రచించినది రెండవగ్రంథము-దశమగ్రంథ మనునది. ఈ రెండుగ్రంథములను పరిశీలించి భాయి కాహన్ సింహు గురుశబ్దరత్నాకర్, గురుశబ్దాలంకార్, గురుశబ్దరత్నాకర్, మహాకోశ్ అనునవి రచించెను. ముస్లింసాహిత్యము ముఖ్యముగ సూఫీలది ఎన్నదగినది. ఆధునికులలో ముఖ్యులు వీరసింహు, పూరణ్ సింహు, కిర్పాసాగర్, ధనీరాం. కోటిన్నరకు పైగా పంజాబీ మాట్లాడువా రున్నారు.

## కాశ్మీరి

జమ్మూ-కాశ్మీర్ భాష కాశ్మీరి. ౧౪ వ శతాబ్దపు శైవభక్తురాలు లాల్ దేద్ అనునామె అప్పుడును ఇప్పుడును వాసికెక్కినది. నంద్ ఋషి అను షేక్ నూరుద్దీన్ ఋషినామ అను నీతిగ్రంథము వ్రాసెను. కాశ్మీరిలో ప్రేమగీతము లెక్కువ. ముస్లింకవులు పలువురు ప్రాచీనులు, ఆధునికులు ఉన్నారు. పర్షియన్ పలుకుబడి హెచ్చు. మొత్తముమీద కాశ్మీరిలో పర్షియన్, సంస్కృతములు రెండింటి ప్రాబల్యము కన్పించును. రామాయణము, కొరాను, బైబిలు అనువదించబడినవి. ఆధునికులలో నందలాల్ కౌల్, పంగిగనయ్, జిందాకౌల్, ఘులాంఅహ్మద్ మహజూర్ పర ముఖ్యులు వారు ప్రసిద్ధులు. ఇటీవల వీరకావ్యములు చాల వచ్చెనని చెప్పుదురు. సుమారు ౧౫ లక్షలమంది కాశ్మీరభాషమాట్లాడువా రున్నారు.

## ఒ ర్రి యా

తొలివాఙ్మయము ౮-౯ శతాబ్దులది బౌద్ధసర్మ ప్రధానము. అతరువాత ౧౧ వ శతాబ్దమునుండి పూరీ జగన్నాథ దేవాలయమున ఆలయగాథలు మదలపంజి అను పేర తాటాకులపై వ్రాసియుంచబడుచున్నవి. భారతభాగవతరామాయణములు ఒరియాలోనికి అనువదించబడినవి. అవి వ్రాసిన సరళదాస్, జగన్నాథదాస్, బలరామదాస్ ఉద్దండులని చెప్పనక్కరలేదు. మరల ౧౬ వ శతాబ్దములో రాజకృష్ణసింహు రచించిన భారత మే ఇప్పటికి ప్రమాణము. గోపాలకవి అను తెలుగుకవి సంస్కృతశ్లోకములను సమాదరించి ఒరియాలో అధ్యాత్మరామాయణము రచించెను. ఆధునికులలో రాధానాథ్ రాయ్, బియారీమోహన్ ఆచార్య, ఫకీర్ మోహన్ సేనాపతి ప్రసిద్ధులు. ఈ భాషలో మాంత్రికములు లేవనవచ్చును. ఒరిస్సాలో దీని వ్యవహారము బెంగాలీకి చేరువ. వృత్తాలు వందలకొలది. అందు చిత్రవిచిత్రా లనేకము. ఒరియా మాట్లాడువారు కోటికి పైగా నున్నారు.

## బెంగాలీ

వంగభాష పశ్చిమబెంగాలులోను, పాకిస్తాన్ తూర్పుఖండమను తూర్పుబెంగాలులోను, పరిసరప్రాంతములలోను వాడుకలో నున్నది. అవిభక్తబెంగాలులోని ముస్లిములభాష ఉర్దూ కాదు. బెంగాలీ. ప్రాచీన పూర్వసాహిత్యమున చండీదాసు, కృత్తివాసలోచనదాస ప్రభృతులు ప్రసిద్ధులు. పూర్వసాహిత్యము విస్తారమున్నను ౧౯, ౨౦ శతాబ్దములందే బెంగాలీ ప్రఖ్యాతికెక్కినది. వైష్ణవకవితావళిలో వైష్ణవభక్తి సంప్రదాయము, చైతన్యబోధ ఎక్కువ. రాధాకృష్ణుల ప్రేమలు వర్ణించుచు విద్యాపతి మైథిలిలో వ్రాసిన పాటలు తరువాతివారికి ఆదర్శమైనవి. ముస్లిం వాఙ్మయము క్రమశః ఏర్పడినది. ఆపైని క్రైస్తవవాఙ్మయమును వచ్చెను. ఆధునికులలో రాజా రామమోహన రాయ్, ఈశ్వర్ చంద్ర విద్యాసాగర్, మైకేల్ మధుసూదన్ దత్, బంకించంద్ర చటర్జీ, రవీంద్రనాథ ఠాకూరు మిక్కిలి విఖ్యాతులు. భారతజాతీయగేయము 'జనగణమన' ఠాకూరువిరచితము. జాతీయోద్యమమును మంత్రతుల్యముగ ఆవేశపరచిన 'వందేమాతరం'గీతము బంకించంద్రచటర్జీ వ్రాసినది. వీరి ఉభయుల గ్రంథములు తెలుగువారికి పరిచితములు. శరత్చంద్రచటర్జీని తెలుగుదేశము దత్తతచేసుకొన్నది. బహుశః దేశభాషలన్నిటిలోను బెంగాలీయే అగ్రగామి, పరిపక్వము అనవచ్చును. బెంగాలీ మాట్లాడువారు ౫ కోట్లకు పైన గలరు. కాని దేశవిభజనానంతరము భారతదేశములో ఇప్పుడు బెంగాలీ మాట్లాడువారు రెండుకోట్లకు పైగా నుందురు.

## అస్సామీ

సిద్ధులలోపలనే ఈ భాషలోనూ తొలి గ్రంథము బౌద్ధసమ్మతము. అది ౮-౧౦ శతాబ్దులది. అయినను ౧౪ వ శతాబ్దికి కొంచెము ముందుగ హేమ సరస్వతీవిరచితమగు ప్రహ్లాదచరిత్రమే అస్సామీ సాహిత్యమునకు ఉపక్రమము అనవచ్చును. ఈ సార స్వతములో ముఖ్యముగ శ్రామికకవిత్వము, గద్యకావ్య ములు, అంకీయా-నాట్ చరిత్ పుథి ఆనేచ్ ప్రత్యేకములు ఎంచదగినవి. మహాభారతమందలి వీరగాథలు తీసికొని పెక్కు కావ్యములు రచించిరి. కందలిరామాయణము, దుర్గబర్ గీతిరామాయణము, శంకరదేవుని కావ్యనాటక ములు పేర్కొనదగినవి. బెంగాలీలోవలె ఇందును వైష్ణవప్రాబల్య మున్నది. బ్రిటిషుపాలనములో తొలుత అస్సామీని ఉపేక్షించి బెంగాలీనే ప్రవేశపెట్టిరి. కాని క్రైస్తవమిషనరీల కృషిచే అస్సామీకి ప్రతిష్ఠ చిక్కెను. అనంతరము వారిలో ముఖ్యులు హేమ చంద్రబరువా, రజనీకాంతబార్డలాయ్, మఫీజుద్దీన్ అహ్మద్, శరచ్చంద్రగోస్వామిప్రభృతులు. అస్సాం లోని ఖాసీకొండజాతులవారు ౧ లక్షలమంది. భాష ఖాసీ. దీనికి లిపి లేదు. రోమన్, బెంగాలీలిపులలో గతినూరేండ్లలోను వ్యక్తమైన ఖాసీసాహిత్యము వర్ధిల్లినది. అస్సామీని ౨౦ లక్షలమంది వాడుదురు.

## ఉర్దూ

పైన వివరించిన భాషల లిపులన్నియు ఎడమ నుంచి కుడికి వ్రాయునవి. అవి చాలవరకు సంస్కృత లిపియను నాగరికుటుంబమునవి. కాని ఉర్దూ కుడినుండి ఎడమకు వ్రాయునది. ఇది అరబ్బీపారసీల జాతిది. దీనిని హిందుస్తానీ అనువారు. అరబ్బీ పారసీపదభూయిష్ఠమును కాక, సంస్కృతభూయిష్ఠమును కాక తేలికముగలిగి రెండులిపులలో దేనియందైనను వ్రాయ బడునది హిందుస్తానీయని హిందూ-ముస్లిం ఐక్య సాధకముగ గాంధీజీ నిర్వహించిరి. కాని దేశవిభజనతో ఈ వాదబలము పోయి హిందీ పైకివచ్చెను. మహమ్మ దీయులు దాడివచ్చినపుడు వారి గుడారములలోని సిపా యీల మిశ్రకారము 'ఉర్దూ'గా మొదలైనను ఈ ఏడెని మిదివందల సంవత్సరములలో ఉర్దూ ఒక భాషగ, వాఙ్మయముగ వికసించినది. ఉర్దూ ప్రధానముగ ముస్లిములదైనను దాని సంపత్తికి హిందువులును కృషి చేసిరి. ఉర్దూవికాసము మన దేశమందలి ముస్లింరాజ్య ముల ననుసరించినది. ముస్లిములు భారతదేశమంతటను ఉండుటచే ఉర్దూ ఇంచుమించు అన్నిరాష్ట్రము లందును వ్యవహారములో నున్నదనవచ్చును. అలీఘర్, ఉస్మానియా విశ్వవిద్యాలయములందును, రాజకీయ హేతువులచేతను ఇటీవల ఉర్దూప్రాముఖ్యము హెచ్చెను. ఘాలిబ్, ఇక్బాల్, తేజ్బహదూర్ సప్రూ, కిషన్ చంద్, ఖాజా అబ్బాస్ ప్రభృతులు పేర్గాం చిన ఉర్దూరచయితలు. ఉర్దూ మాటాడువారు రెండు కోట్లకు పైగా నుందురు.

## జానపదసాహిత్యము

మన దేశమున ౨౨౫ భాష లున్నవని లెక్క. కొన్ని భాషలకు లిపి లేదు. సాహిత్య మున్నదిగాని గ్రంథములు లేవు. ఈ సాహిత్యము ముఖ్యముగ ఆది వాసులలో నున్నది. ప్రస్తుతము దీని ప్రాంతము మధ్య ప్రదేశము, పరిసరము. ఈ భాష చాలభాషల మిశ్రము. ఇందులో అనేకశాఖలు ఆయా ఆదివాసుల తెగలనుబట్టి కలవు. ఆదివాసుల ఆచారవిచారములు, సంస్కృతి హైందవజన్యములే అయినను వాటి విశిష్టత వాటి కున్నది. అందువలన ఆదివాసు లనువారి సంస్కృతిని సంరక్షించుటకు రాజ్యస్మృతిలోనే నిబంధన చేయ బడినది. ఆదివాసుల భాష, భావము చాల సజీవమైనవి. హిస్లప్, ఎల్విన్, కెంఫ్రల్ ప్రభృతులు పరిశోధనచేసి చాల వాఙ్మయమును గ్రంథస్థముచేసినను చేయవలసిన దింకను విస్తార మున్నది.

## శ్రేయోమార్గము

భారతమున బహుభాష లుండుట ఐక్యమునకు ప్రతిబంధకమను ఆక్షేపణ ఒకటి కలదు. కాని ఈ ఆక్షేపణ నిలువదు. ఇన్ని భాష లున్నందువలన దేశముయొక్క ఐక్య మెన్నడును భంగపడలేదు, భంగ పడదు. ఐక్యమును భేదించిన హేతువులు వేరు. ఈ భాషలకు, వాఙ్మయములకు అన్నిటికిని మూలధాన మొకటే. ఆ వాఙ్మయములకు వస్తు వొకటే. అంత మాత్రమున ఈభాషలచే ఐక్యము వచ్చితీరునని కాదు. పలుభాషలవలన ఉన్న ఐక్యము పోదు. ఏకభాషవలన ఐక్యము సిద్ధించు ననియు లేదు. అనైక్యబీజములు మనుష్యుల మానసములలో ఉదయించును. వాటికి వాహనమే గాని ప్రేరకము కాజాలవు భాషలు. భారత దేశమున ఐక్యసంసిద్ధి భాషలమూలముననే కలుగును. ఇది యథార్థము. ఈ యథార్థము గమనించి భాషల నాశ్రయించి దేశమును సమవిభక్తము చేసినపుడే శ్రేయము.

# అప్పగింతలు

[కథానిక]

శ్రీ జి. సాంబశివరావు

సుబ్రహ్మణ్యానికి కాకకాక పెళ్లి అయింది. లేక లేక పిల్ల పుట్టింది.

పిల్ల పుట్టింది అంటే వూరికే పుట్టిందా? తల్లిని చంపి మరీ పుట్టింది.

సుబ్రహ్మణ్యం భార్య సుందరమ్మ కాపరానికి వచ్చిన తరువాత పదిహేండ్లకు గాని కానుపు రాలేదు. అటు తల్లివైపునగాని, ఇటు అత్తవైపునగాని ఇటువంటి వార్తే లేదు. ఈ పదిహేండ్లకు కానుపు అంటూ రావడం అటూ, ఇటూ గూడా ఇదే ప్రథమం.

సుందరమ్మఅత్తగారు కాపరానికిరావడం, నీళ్లు పోసుకోవడం ఒక్కసారే జరిగాయి. తల్లి పిల్లపిల్లకూ రెండేసి ఏండ్ల వారడిలో పదిమందిసంతానాన్ని కన్నది. అందువల్ల సుందరమ్మ ఇంత ఆలస్యంగా నీళ్లు పోసుకోవడం అందరికీ విడ్డూరంగా కనిపించింది.

సుందరమ్మ అంత బలమైన మనిషి కాదు. కొంచెం లావుపాటిది. శరీరం దొందఅవడంచేత పైకి నిండుగా కనపడినా లోపలమాత్రం అల్పిష్టంగానే వుంటూవుండేది. కొంచెందూరం నడిస్తే ఆయాసం; కొంచెం పనిచేస్తే అలసట. అందువల్ల సుబ్రహ్మణ్యం గూడా అప్పుడప్పుడు భార్యకు పనిపాటల్లో కొంచెం సాయపడుతూ వుండేవాడు.

కాకకాక పెళ్లికావడం, లేకలేక కడుపు రావడం, అదివరకే ప్రేమాస్పదంగా వున్న భార్య అతనికి ఇప్పుడు అంతకంటే ఎక్కువైపోయింది. ఇంట్లో పని పాటలు చేసేందుకు మనిషి, మంచినీళ్లు తెచ్చేందుకు బ్రాహ్మడు, వంటచేసేందుకు వేరే వంట మనిషి—ఇంతమందికి అతని సంపాదన ఆరోజుల్లో జీవితాన్ని గడిపింది. ఎప్పుడూ స్వంతంగానే అన్ని పనులూ చేసుకునేవాళ్లు ఇప్పుడు ఇంతమందికి ఇంట్లో కొలువు ఏర్పాటుచేయడంవల్ల వూళ్లోవాళ్లంతా అబ్బురంగా చెప్పుకున్నారు.

సుందరమ్మకు అయిదో నెల వచ్చింది. అల్లుడు పంపితే కూతురును పురిటికి తీసుకుపోదామని తల్లి వచ్చింది. అల్లుడు పంపనన్నాడు. 'మీది పల్లెటూరు, డాక్టరుసహాయం కావాలన్నా దొరకదు. కాబట్టి మీరు ఇక్కడే వుండి కూతురుకు నీళ్లుపోసి వెళ్లుదురుగాని' అని అల్లుడు అనేసరికి అత్తగారు కిం అనలేకపోయింది. ఇంటిలో ఇంకో అసరాగూడా చిక్కినందుకు సుబ్రహ్మణ్యం సంతోషించాడు.

నెలలు గడుస్తున్నకొద్దీ సుందరమ్మకు నీరు చూపడం ప్రారంభించింది. సుబ్రహ్మణ్యం డాక్టర్లను తీసుకువచ్చి మందిప్పించాడు. కొంచెం తగ్గింది. అయినా డాక్టరు మందువాడుతూనేవుండాలన్నాడు. సుబ్రహ్మణ్యం అట్లాగే చేస్తున్నాడు.

తొమ్మిదో నెలలో కనవలసిన సుందరమ్మ పదో నెల వచ్చినా ప్రసవించకపోవడంవల్ల పుట్టేది మగపిల్లవాడేగాని ఆడపిల్ల కాదని చుట్టుపక్కల అమ్మలక్కలు జోస్యాలు చెప్పారు. ఒక మొగకాయ కాస్తే బాగుంటుందని సుబ్రహ్మణ్యానికి మనస్సులో ఎప్పుడూ వుంటూనేవుంది. భార్యతో ఏకాంతంలో వున్నప్పుడు ఒకసారి ఆమెతో అమాటే అన్నాడు. ఆమె సిగ్గులో ఇటూ అటూ చెప్పలేకపోయింది.

ఆమెసౌమాత్రం తెలుసుకునకనా చెప్పడానికి! అయినా ఆమె చెలితే సుబ్రహ్మణ్యానికి నమ్మకం.

పదో నెల ప్రవేశించినదగ్గరనుంచి సుందరమ్మ పొట్టకు నీరుపట్టడం ప్రారంభించింది. సుందరమ్మ అసలే కూలం. ఈపొట్టకు పట్టిన నీరుతో బోర్లించిన బానకులాగ ఆమెకడుపు కనిపించింది. సుబ్రహ్మణ్యానికి గాభరా ఎక్కువైంది. మళ్లీ డాక్టర్లు వచ్చారు. ఎటూ తేల్చిచెప్పలేకపోయినారు. ఇది కట్టి నీరుపట్టడమా? జలోదర మేమన్నా పుట్టుకువస్తున్నదా? ఇది ఎటూ తెగకుండానే, సుందరమ్మకు నొప్పులు వచ్చాయి. ఒక రాత్రివేళకు ఒక స్త్రీశిసువు కల్గడం, తెల్లవారకముందే సుందరమ్మ ఇహలోకం వీడటం జరిగిపోయింది.

అప్పుడు సుబ్రహ్మణ్యం ఎంత ఏడ్చాడో ఎవరూ చెప్పలేరు. ఏడుపులోపల వున్న దుఃఖానికి కొలత అవుతుందా? దుఃఖాన్ని ఒత్తిగిల్లచేసుకోడానికి మార్గం అయితే కావచ్చు. ఇట్లా ఒత్తిగిల్లకుండా అతనిలో ఎంతదుఃఖం బంధింపబడిపోయిందో ఆతరువాతి అతని రూపం, అతని జీవితం, అతని ప్రతిపనీ వ్యక్తం చేస్తూ వచ్చాయి.

౨

చిట్టి పుట్టిన ఆరోజున ఎట్లా వున్నాడో, సుబ్రహ్మణ్యం, చిట్టి పెట్టిన పన్నెండోఏటగూడా అట్లాగే వున్నాడు. వచ్చిన భేదమల్లా ఒక్క వయస్సులోనే.

ఈ పన్నెండేండ్లలోనూ అతని దుఃఖం ఎంత ఒత్తిగిల్లిందీ చెప్పడం కష్టం. సుందరమ్మ పోయిన కొత్తకాలానికి అతని దుఃఖం పూర్తిగా ఒత్తిగిల్లింది అనుకున్నారుగాని, ఇవ్వాళ్ల చిట్టిపెళ్లి అంటూ నిశ్చయంకావడంతో అది ఉబికివుబికి వస్తున్న చిహ్నాలు అంతా చూడగలిగారేగాని, ఒక ఖైదీని జైలులో వుంచినట్లు అతడు ఇంతకాలం దాన్ని తన మనస్సులో బంధించివుంచాడని ఎవరికీ తట్టింది కాదు. ఏరోజు కారోజు వచ్చి మీదపడుతూ, అతని దుఃఖంలో వేసహస్రాంశాన్నో రూపుమాపగల్గుతోం దనుకున్నారుగాని ఏరోజు మీదపడిన ఆరోజుతో అతనిలోని ఈ దుఃఖం క్రొత్తతలలు వేస్తున్నదని ఎవ్వరూ అనుకోలేకపోయారు. మనస్సులో కురుకు కట్టిన పాదులాగా ఆదుఃఖం అతనిలో పెరిగి సర్వమైన అతని భావజగత్తును ఆక్రమించి, లోకానికి, వుండి కూడా లేదన్నట్టు తోచింది. కాని అది అతని మనస్సులో వేళ్లు దించుకొన్నదని, శరీరంలో కాయలు కాసింపని లోకానికి తెలియవలసిన అవసరం, అగత్యం ఎక్కడ వుంది? పెళ్లికి పిలిస్తే వచ్చారు గాబట్టి ఇవ్వాళ్ల చుట్టాలందరకూ పట్టింది.

వచ్చిన చుట్టాలలో డెబ్బదియేండ్ల వృద్ధు డొక డున్నాడు. ఆయన సుబ్రహ్మణ్యం భార్యకు మేనమామ అవుతాడు. సుబ్రహ్మణ్యాన్ని పరామర్శిస్తూ అన్నాడు గదా: "నాయనా! దుఃఖం అందరికీ వస్తుంది. దాన్ని సహించడమే మానవునిలోని ఉదాత్తతను చాటుతుంది. భగవంతుడు గీతల్లో ఏమన్నాడు? కష్టాన్ని, సుఖాన్ని సమంగా చూడమన్నాడు. నీ భార్యపోవడం ఒక కష్టం. ఒక దుఃఖం. ఇప్పుడు శుభకరా అని పిల్లకు పెళ్లిచేస్తున్నావు. ఇది సుఖం. ఈ వలుసుగూడా లేకపోతే ఈ సుఖం నీకు లభ్యమయ్యేది కాదు. ఆ దుఃఖాన్ని, ఈ సుఖాన్ని భగవంతుడు నీపాల వేశాడు. దుఃఖకాలంలో దుఃఖించడం, సుఖసమయాలలో సంతోషపడటం మానవుని లక్షణం. ఇంకా ఒక మెట్టు పైకి పోయావా? నీకు దుఃఖమూ వుండదు, సుఖమూ వుండదు. ఈ రెండూ సమానమే అవుతాయి. అది సామాన్యులకు సాధ్యమైన కార్యం అయినా కాక పోయినా అందుకు ప్రయత్నించడం మంచిదే గదా! భార్యపోయిందని ఇప్పటివరకూ కుమారిలిపోతున్నావే! రేపు కూతురును అత్తవారింటికి పంపాలి. ఒక అయ్య చేతుల్లో పెట్టినతరువాత పిల్ల నీయింట్లో వుంటుందా? ఇంతకాలం గారాబంగా పెంచిన కూతురు అత్తవారింటికి పోగా వచ్చిన వియోగంతో దుఃఖాన్ని తెచ్చుకొని, పూర్వం ఉన్నదానికి ఇది తోడుకాగా జీవితాన్ని ఎందుకూ కొరగాకుండా చేసుకుంటావూ?

జీవితం ఇందుకేటయ్యా! దాన్ని హృదయదౌర్బల్యం అని భగవంతుడు గీతల్లో అన్నాడు. హృదయదౌర్బల్యం చెడ్డది. క్షుద్రమైంది. దాన్ని త్యజించాలి. అట్లా చేస్తేనేగాని జీవిత ఉన్నతి వుండదు."

ఈమాటలతో సుబ్రహ్మణ్యానికి దుఃఖం మరీ పొర్లివచ్చింది. ఇంతకుపూర్వం 'అయ్యో! నాయనా! సుందరమ్మ పోయిందా!' అన్నవాళ్లేగాని ఇంత ఇదిగా వేదాంతాలు చెప్పినవాళ్లు అతనికి కనిపించలేదు. వేదాంతాలతో దుఃఖం ఉపశమిస్తే ఎంతన్నా కావచ్చును. ఇప్పటికి ఆమెపోయి పన్నెండేళ్లయినా తన హృదయంలో దుఃఖం తొలగకుండా వున్నదే! తాను ఇటువంటి వేదాంతాలు ఎన్ని చెప్పుకోలేదు? అవి ఎందుకూ కొరగాకుండా ఎన్నిసార్లు పోలేదు?

అట్లా అని సుబ్రహ్మణ్యం దుర్బలహృదయుడు కాదు. బింకం గల మనిషి. లోపల వున్న విషయాన్ని బయటికి పొక్కనీయని మనిషి. అట్లా కాక నిత్యమూ ఏడుస్తూ కూర్చునేవాడైతే చిట్టిని ఇంతదాన్ని ఏలా చేయగలిగేవాడు? చిట్టికోసం అతను దుఃఖాన్ని మింగాడు. లోపల అణుచుకున్నాడు. అందువల్ల చిట్టికి, తన తండ్రి తాను ఎరుగని తన తల్లికోసం ఇంత ఇదైపోతున్నాడని తెలియదు. నిజానికి తెలియవలసిన అవసరంగూడా లేదు.

చిట్టికి ఇప్పుడు పన్నెండేండ్లు. అరవిచ్చిన గులాబిపువ్వులా ఆమె బాల్యానికీ, యౌవనదశాప్రాదుర్భావానికీ నడిమిదైన కాలంలో వుంది. తండ్రి చేసిన గారాబం, అమ్మమ్మ పెట్టిన ఒద్దిక ఆమెలో గంగాయమునానదులవలె ఒకటిగూడా ఒకటికాకుండా ప్రవహిస్తూ సర్వస్వమైన ఆమెభావప్రపంచానికి హద్దులు దిద్దుతున్నాయి. ఏవిషయంలోనైనా ఒక పట్టుదల, అట్లా పట్టుబడితే బాగుంటుందేమో నన్న ఒక భావం, అందువల్ల పదిమందిచేత 'చూడమ్మా! తల్లి లేక పోయినా పిల్ల ఎంత ఒద్దికతో, ఎంత నేర్పుతో మెలగుతున్నదో' అని అనిపించుకోగల నిర్దాతనం ఆమెకు అలవడ్డాయి. గారాబం చేస్తే అది తండ్రిదగ్గరేగాని, ఇతరులదగ్గర చేస్తే నెగ్గుకురావడం కష్టమన్న విషయం ఆమెకు పసిపిల్లవాతే, మనస్సు ఇంకా పరిపక్వం కాకముందే, ఇది ఇది, అది అది అని-తెలుసుకోవాలని స్థితిలోనే పట్టింది. తల్లి చనిపోయిన పిల్లలకు అట్లా తెలుస్తుంది. ఎట్లా తెలుస్తుందో చెప్పడం కష్టం! అట్లాగే ఆమెకు అది తెలిసింది.

వచ్చిన చుట్టాలు పిల్లలోని ఈ నిర్దాతనానికి సంతోషించారు. "తల్లి లేకపోతేనేమమ్మా! తల్లికన్నా ఎక్కువగా పెంచే తండ్రి వుండగా! పిల్లను చూడండి, ఎంత మర్యాద! ఎంత మెప్పుదలతనం!" అని అంతా అన్నారు. "ఔను! సుందరమ్మే మంచిది. సుబ్రహ్మణ్యం సరేసరి. తల్లిదండ్రుల చాలు తప్ప పిల్లకు వేరే చాలు వస్తుందా" అన్నారు. ఇంత నలుసును కని, అది పెద్దదై, పెళ్లికూతురైననాడు చూచే భాగ్యం సుందరమ్మకు లేనందుకు విచారించారు. అది వుంటే ఎంత బాగుండేది అన్న భావం వారి అందరిలోనూ వుంది.

—"నాయనా! సుబ్రహ్మణ్యం! పిల్లను పెంచి పెద్దచేశావు. ఒక మంచి అయ్యకును చూచి ఆయనచేతిలో పెడుతున్నావు. బాగానే వుంది. కాని ఆ సుందరమ్మకూడా వుండి చూస్తుండగా పనటం చూడగల్గితే ఇంకా ఎంత బాగుండేది—" అని చుట్టాలలో ఒకావిడ అన్నది.

సుబ్రహ్మణ్యం ఏమీ మాట్లాడలేదు. కాని అతని ముఖంలో ఆమె లేని లోపం దైన్యంలాగా ప్రతిఫలిస్తూనే వుంది.

—"ఒసే! అట్లా అనకు. అది లేని లోటు ఎట్లాగూ వుండనేవుంది. అది తెలియని విషయమైతేగా! అయినా వాడి దగ్గరే అట్లా అని మళ్ళీ ఇది చెయ్యకు. మా నాయన కష్టపడి తల్లి లేని లోటు కనపడనీకుండా పిల్లను పెంచుకొన్నాడు. అట్లాగే ఆ పిల్లను ఒకళ్ల చేతుల్లో పెట్టనియ్యి—' అని అన్నది ఇంకొక వృద్ధురాలు.

దానికీ సుబ్రహ్మణ్యం ఏమీ అనలేదు. దైన్యం ముఖంలో గాఢమైన రేఖలను తీర్చింది.

—"పోనుగాని, నాయనా! సీతమ్మల్లా వాళ్లాగూడా వచ్చిపట్టున్నారు. పీటలమీద వాళ్లను కూర్చోపెట్టి పెళ్లి కానిస్తావా? లేకపోతే రవికగుడ్డ తొంటిని పెట్టుకుని నీవే కానిస్తావా? పాపం! సుంద రమ్మేగనక వుంటే ఈకష్టం ఎందుకు వచ్చేది—"అని కంటనీరు పెట్టుకొని ఎడమచేయి అలవాటుపడినదానికి వలె ముక్కుదగ్గరకు పోగా వ్యవహర్తను అనుకుంటూ వుండే ఒక నడివయసు వచ్చిన ఆవిడ అన్నది.

సుబ్రహ్మణ్యం ఏమీ అనలేదుగాని ఉత్తరీయపు కొంగుతో కళ్లు తుడుచుకొన్నాడు.

ఆదారిగా పోతూవున్న సుందరమ్మ మేనమామ ఇది చూచి, "ఏమిటే! ఆడమూక అంతా ఇక్కడ చేరి వాణ్ణి గగ్గోలుపెడుతున్నట్లున్నారు. ఈమూక ఎక్కడ చేరితే అక్కడ ఇంతే. ప్రతిదీ తమకే కావా లన్నట్లు ప్రవర్తిస్తారు. చూడు నాయనా! సుబ్ర హ్మణ్యం! పెళ్లివారు వచ్చారు. చెరువుగట్టుకు పానకం బిందెలు పంపాలిగాని, రా పోదాం!" అని రెక్క పుచ్చుకొని సుబ్రహ్మణ్యాన్ని తీసుకుపోయాడు.

3

కన్యాదానంవల్ల వచ్చే పుణ్యాన్ని ఏతండ్రీ తనకు దక్కకుండా ఇంకొకళ్ల పరం కానీయడు. అందువల్ల సుబ్రహ్మణ్యమే భార్యకు చిహ్నంగా ఒక రవికగుడ్డ చేత్తో పుచ్చుకొని చిట్టిం ఒక అయ్యచేతిలో పెట్టివేశాడు. పెళ్లి అని అనుకున్నదిమొదలు సుంద రమ్మ అతనికి సాక్షాత్కారంగా కనిపిస్తూనేవున్నది. ప్రతిపనీ ఆమె పురమాయిస్తున్నది. ప్రతిదీ ఆమె దగ్గరవుండి చేయిస్తున్నది. పిల్లకు ఈరకం పరికిణీ, ఈ రకం చొక్కా కుట్టిస్తే బాగుంటుందని చెబుతున్నది. అతని మనస్సుకు ప్రతివిషయంలో అట్లా అనిపించి అట్లా చేస్తూవచ్చాడు. ఇది తన మనస్సు కల్పించు కుంటున్న సృష్టే అయినా, అతనికిమాత్రం యథా ర్థంగా గోచరిస్తూ ముందుకు తీసుకుపోతున్నది. నిజా నికి చేత్తో రవికగుడ్డ పుచ్చుకొని కన్యాదానం చేస్తు న్నాడేగాని తన భార్య తన ప్రక్కన నిలబడివుండి తనతోపాటు ఆ కన్యాదానంవల్ల వచ్చే పుణ్యాన్ని పంచుకుంటున్నట్లే అతను భావించాడు.

—"బాబాయిగారూ! ఈ శుభసమయం అంతటా అది నాతో వున్నట్లే వున్నదనుకుండీ!" అని సుందరమ్మ మేనమామతో, పెళ్లి చాలాభాగం అయి, ఇంక అప్పగింతలు జరుగుతాయనగా సుబ్ర హ్మణ్యం అన్నాడు.

—"అవును నాయనా! అట్లాగే వుంటుంది. నీకు, దానికి అంత దృఢబంధమే లేకపోతే ఇంకో పెళ్లి చేసుకునేవుండేవాడివి. ఏమో మనం అంతా పాతకాలపు మనుష్యులం, అట్లాగే అనుకుంటాం. ఏదో లే! ఆ శాస్త్రనలుగును వదిలిపోయింది, కాబట్టి దానికీ ఆ శాస్త్రపుణ్యంలో పాలున్నా లభించింది" అని ఆయన అన్నాడు.

—"ఇందులో పుణ్యమేముంది తాతయ్యా! పిల్లకు పెళ్లీడు వచ్చింది. పెళ్లి చేస్తున్నారు. పుణ్య మేమిటి? పంచుకోవడ మేమిటి? అందులోనూ ఎప్పుడో చచ్చిపోయిన ఆవిడకూడానా!—" అని సంగతిసందర్భం తెలియని ఆయనమనుమడు—కొత్తగా కాలేజీపరీక్ష ఇచ్చిన కుఱ్ఱవాడు అన్నాడు.

—"ఒరేయ్! ఈకాలపువాళ్లకు మేమేమీ చెప్పలేం. పాతకాలపు వాళ్లం మేమట్లాగే అను కుంటాం. ఒక కానీ దానంచేస్తేనే పుణ్యం వస్తున్నదే! అందులో ఒక పిల్లను, కన్నదాన్ని, ఇన్నిఏండ్లు పెంచి, ఒకళ్ల చేతుల్లో పెట్టడం అంటే తక్కువవిష యమా! అయినా మీ ఆలోచనలు వేరు, మాఆలో చనలు వేరు—"అని ఆయన అన్నాడు.

మగపెళ్లివారి పురోహితుడు వచ్చి అంపకాల విషయమై తొందరచేస్తున్నాడు. పెళ్లిపెత్తనానికి పూనుకున్న సుబ్రహ్మణ్యంతమ్ముళ్లూ, బావమరదులూ అతని పురమాయింపులకు తలఒగ్గి ఏమిచెబితే అది అల్లా నెరవేరుస్తున్నారు. పెండ్లికుమారునికి, అతనితండ్రికి, తల్లికి, అన్నలకు, వదినెలకు, అక్కలకు, బావలకు, పిన తండ్రులకు, పినతల్లులకు, మేనత్తలకు, మేనమామలకు

వరుసగా పీటలు వేశారు. ఇంకా ఎవరికన్నా పీటలు వేయాలేమోనని సుబ్రహ్మణ్యం బావమరది గ్రుచ్చిగ్రుచ్చి అడిగి, వారికరవున వచ్చిన దూరపుబంధువు—ఒక పూర్వసువాసిని—ఆమెకుగూడా ఒకపీట వేయించాడు. ఇంట్లో ఆడవాళ్ళు బియ్యము, పెసరపప్పు ఒక కొల్లాయి గుడ్డలో పోసి, అందులో ఒక కందపిలక వేసి వడి గంటిబియ్యం మూటగా కడుతున్నారు. పురోహితుడు బయటనే వుండి, అందులో ఒకరూపాయికూడా వేసి కట్టాలని కేక వేశాడు. మూట పెద్దదయితే పిల్ల మొయ్య లేదు; కొంచెం చిన్నదిగా వుండేటట్టు కట్టండని ఇంకొక రెవరో పురమాయించారు.

పావడిలో ఒక మూల కూర్చున్న మంగలివాళ్లు "పోయి రాగదమ్మ! జానకీ!" అన్న పాటను దీనాతి దీనంగా సన్నాయిమీద పలికిస్తున్నారు.

పెండ్లివారంతా ఒకరి తరువాత ఒకరు వరుసగా వేసిన పీటలమీద తమ తమ నియమితస్థానాల్లో కూర్చున్నారు. ఇంక పిల్లను తీసుకురావడమే తరువాయి. పురోహితుడు మళ్లీ నోరుచేసుకొని, తెల్లవారకముందే పెళ్లివారు ప్రయాణం కావలసివున్నదనీ, అట్లా అయితేనే గృహప్రవేశలగ్నానికి అందుకోవడం సాధ్యమవుతుందనీ, అందువల్ల పిల్లను తీసుకురావడంలో ఆలస్యం చెయ్యకూడదనీ కేకలు వేశాడు. నడుమున కట్టిన వడి గంటి బియ్యపుమూటతో, ముఖమున దిద్దిన కళ్యాణపు బొట్టుతో, రాత్రి అంతా నిద్దర లేకపోవడంచేత కన్నులు ఎఱ్ఱబడగా, కనురెప్పలు అరమోడ్పు కాగా కొత్తచెలువము తెచ్చుకొన్న మొగముతో, సీతను అనుసరించిన జనకరాజుకువలె సుబ్రహ్మణ్యం ఆమెను అనుసరించి రాగా చిట్టిని తీసుకువచ్చారు.

సుబ్రహ్మణ్యంకళ్లలో నీళ్ళు గిర్రున తిరిగాయి. రొండిని గుడ్డపెట్టుకొని కన్యాదానం చేసినప్పటికన్నా అతని దుఃఖం ఇప్పుడు తీవ్రతరమైంది. ఎందుచేతనో తాను చెప్పలేడు. ఇది తన పేరు. దాన్ని ఇంకొకళ్ల మెళ్ళో వేశాడు. అందుకు ఎందుకు విచారం! అయినా అతనికి దుఃఖం ఆగింది కాదు. పసుపుపళ్లెములో చేతులు ముంచి, పేరు పేరునా అందరికీ ఆమెను అప్పగిస్తున్నాడు. ఇది మీకోడలు, దీన్ని సరిగ్గా చూడండి అంటున్నాడు. ఇది నీభార్య, నీయిష్టం వచ్చినట్లు చూడు అన్నాడు. తాను కన్న ఈ కూతురును, ఒకళ్ళ చేతుల్లో పెట్టగానే తనది కాకుండా అయిపోతున్నది. ఒక చేయినరికితే అది కొంతకాలం బాధ పెట్టి తరువాత నయమైపోతుంది. ఇది అట్లా కాదు. తాను కని పెంచిన కూతుర్ను, దానిమీద సర్వాధికారాలూ నీవి, నాకేమీ ప్రమేయం లేదు అని ఒకళ్ల చేతుల్లో పెట్టడం! ఎప్పుడూ ఇంట్లో 'నాన్నా! నాన్నా!' అంటూ తిరిగే ఒక పసికూనకు ఇది తన ఇల్లు అని చెప్పుకునే అధికారం లేకుండాచేయడం! చిట్టి అత్తవారింటికి పోతుంది. తాను వెళ్ళి తీసుకవస్తాడు. అప్పుడు ఈఇల్లు తన దంటుందా! ఇది మా నాన్నగారి ఇల్లంటుంది. నేను మాయింటికి పోతానని అత్తవారింటిని పేర్కొంటుంది. ఇది పైకి మాటల్లో కనుపించే విషయం. కాని హృదయమధ్యంగా వున్న ప్రేమండి విషయమైన సంబంధం విచిత్రమైంది. కని, పెంచి, పెద్దదాన్ని చేసిన ఆ మమకారం చంపుకోవడం మహా కష్టం. అది కబుర్లవంటిది కాదు. కబుర్లు చెప్పడం తేలిక. ఈ మమకారాన్ని చంపుకోవడం కష్టం. అందులోను తల్లి లేని పిల్లను, తానే తల్లియై, తండ్రియై పెంచిన సుబ్రహ్మణ్యానికి దుఃఖం ఒకదానికొకడు ఆమ్రేడితమై దాన్ని మూడింతలు చేసింది.

'ఇప్పుడే అది వుంటే' అని అతను అనుకున్నాడు. ఒక వ్యక్తికి దుఃఖం వస్తుంది, సుఖం వస్తుంది. ఆదుఃఖాన్ని పంచుకునేవాళ్లు వున్నప్పుడే దాని తీవ్రత తగ్గినట్లనిపిస్తుంది; ఆ సుఖాన్ని పంచుకునేవాళ్లు వున్నప్పుడే అది రాణిస్తుంది. ఇది దుఃఖం కాని దుఃఖం! సుఖం కాని సుఖం! సుందరమ్మగనక వుంటే, ఇదమిత్థం కాని ఈ సుఖదుఃఖస్వరూపాన్ని తనకు విడమరచి అర్థమయ్యేటట్లు చెప్పివుండేది. సుబ్రహ్మణ్యానికి సుందరమ్మలేని లోటు ఇప్పుడు కనుపించినంతగా ఇంకొకప్పుడు కనుపించలేదు. అందువల్ల అతని దుఃఖం తీవ్రమై, పేరు పేరునా, చిట్టిని, అత్తవారికి అప్పగిస్తూ, అప్పగిస్తూ, ఒక్కసారి భావురుమన్నాడు. వచ్చిన అటుచుట్టాలకూ

ఇటు చుట్టాలకూ గూడా కళ్ల నీళ్లు వచ్చాయి. అంతే, ఏమి లాభం? సుందరమ్మను ఎవరూ తీసుకురాలేరు. అతని దుఃఖాన్ని పంచుకోనూ లేరు.

౪

మూడునిద్దురలై చిట్టి ఇంకా రాలేదు. సుబ్రహ్మణ్యానికి ఇంట్లో ఎంత మంది చుట్టాలు వున్నా, ఒంటరితనం అనుభవిస్తున్నట్టే వుంది. ఇంత మంది చుట్టాలు వుండికూడా, చిట్టి లేకపోవడంచేత అతనికి ఇల్లు బావురుమంటూవున్నట్టు వుంది. చిట్టి లేని ఈ వెలితిని అనుభవించి, తనకు మళ్లే బాధపడే జీవి ఈ లోకంలో తనకు లేకుండాపోవడంగూడా అతని ఈ ఒంటరితనాన్ని మరీ ఎక్కువచేసింది. సుందరమ్మే వుంటే ఇందులో సగం ఒంటరితనాన్నైనా పంచుకొని వుండేది.

ఈ స్థితిలో సుబ్రహ్మణ్యానికి విచిత్రమైన భావం ఒకటి తోచింది. లగ్నం వేళ, కన్యాదానం చేస్తూన్నప్పుడు, తన ప్రక్కన సుందరమ్మ వున్నట్టు భావించిన తాను ఇప్పుడు భావించలేకపోతున్నాడు. అప్పగింతల సమయంలోగూడా ఆమె లేని లోటు తనకు బాగా కనిపించింది. ఈ విచిత్రమనఃపరిణామానికి కారణం ఏమైవుంటుంది? అతడు ఇందుకు ఇదీ కారణం అని చెప్పలేకపోయాడు.

చిట్టిని నిన్న అత్తవారు మూడునిద్దురలకు తీసుకు పోయారు. ఇంకా రెండురోజులు గడిస్తేగాని రాదు. ఒక్కరోజున ఆమె తన దగ్గర లేకపోవడమే ఇంత బాధగా వుంటే, ఆమె ఇంకొన్నాళ్లకు అత్తవారింటికి పోతుంది; తన బాధ అప్పుడేమౌతుంది! తాను ఆమెను అత్తవారింటికి పంపకుండా వూరుకుంటాడా?

సుందరమ్మ కాపరానికి వచ్చిన కొత్తలో ఒక పండుగ రాగా తన బావమరిది వచ్చి చెల్లెలిని తీసుకు పోతా నన్నాడు. తాను వల్లకాదన్నాడు. భార్యను విడిచి తాను వుండలేడు. తానుగూడా అత్తవారింటికి పోదామంటే సెలవు దొరికేది కాదు. బావమరిది బ్రతిమాలి, బామాలి, చెల్లెలిని తీసుకుపోయాడు. పండుగ వెళ్లిన మరునాడే తాను తన భార్యను తీసుకు రావలసిందని ఉత్తరం వ్రాశాడు. బావమరిది గజగజ లాడుకుంటూ వచ్చి సుందరమ్మను దింపిపోయాడు.

చిట్టి విషయమూ అంతే. అల్లుడు వచ్చి కూతురును తీసుకుపోతా నంటే కాదనే అధికారం తనకు ఎక్కడిది?

సుబ్రహ్మణ్యం ఆలోచనలో పడ్డాడు. చిట్టి వస్తుంది. నాలుగురోజులు వుంటుంది. తిరిగి అత్తవారింటికి పోతుంది. అప్పుడు తానేమి చేస్తాడు! సుందరమ్మ పదిసంవత్సరాలు తన సహధర్మిణిగా వుండి తన జీవితాన్ని వెన్నెలబాటల్లో నడిపింది. పోయింది. తాను ఏమి చేశాడు? ఆమె లేనితనంవల్ల వచ్చిన దుఃఖాన్ని ఇంతకాలంగా దాచుకున్నాడు. ఎందుకు దాచుకున్నాడు? చిట్టి అగడైపోతుందని దాచుకున్నాడు. చిట్టిగూడా అత్తవారింటికి పోతున్నది. ఇప్పుడు తాను ఏమిచేయగలడు?

దుఃఖానికి ఒక హద్దు వుంది. కష్టానికి ఒక హద్దు వుంది. సుఖానికీ అంతే. ఆ హద్దుదాకా వచ్చేదాకానే ఆ దుఃఖంయొక్క తీవ్రత, ఆ కష్టంయొక్క వికటచంక్రమణం, అసుఖంయొక్క విలాపం. ఆతరువాత ఒక విరాగం తోస్తుంది. ఒక తెంపు వస్తుంది. అప్పుడు ఆ దుఃఖంతో, ఆ సుఖంతో, ఆ కష్టంతో సర్దుకుపోవడం సాధ్యమౌతుంది. కాని ఆహద్దు ఎప్పుడు వస్తుందో! ఏయుగంలో వస్తుందో!

చిట్టి వెళ్లిన రెండవరోజున సుబ్రహ్మణ్యం మనస్సు నిద్రలోంచి మేల్కొన్నట్టు మేల్కొన్నది. మబ్బుతెర తొలగిన సూర్యుడు ఎంత వేడిగా, కరుకుగా ప్రకాశిస్తాడో అతని మనస్సు అంత చురుకుగా పనిచేసింది. ఒక్కసారిగా తనకు డెబ్బయిఏండ్ల సుందరమ్మ మేనమామ ఆరోజున చెప్పిన మాటలలోని అర్థం సుస్పష్టంగా తోచింది. దుఃఖం ఏమిటి? సుఖం ఏమిటి? ఇవి మనము మనకై తెచ్చుకొన్నవి. ఇది సుఖం అనుకుంటే సుఖం, దుఃఖం అనుకుంటే దుఃఖం! ఏమి అనుకోకపోతే! సుందరమ్మ తన భార్య. చనిపోయింది. తనకు దుఃఖం. పోకావున్న సుందరమ్మకు భర్తసుఖం వుందా? ఉందని అనుకున్నా బ్రతక

గలిగిందా ? ఈ దుఃఖాలకు, ఈ సుఖాలకు మరణాన్ని ఒక హద్దుగా దిద్దిన ఏశక్తి వుందో, అది మహోత్తమైనది అయివుండాలి.

చిట్టి కాపరానికి వెడుతుంది. తాను కాదనదు. చిట్టి తన ఇంటిని ఆనందమయంగా చేస్తుందన్న భావం తనలో ఇంత కాలంగా వుంది. దానికి క్లేశ మన్నది లేదనుకోవడం తాను కల్పించుకున్న భావం కాకపోతే మరేమిటి ? మరణంతో నశిస్తుందనుకున్న హద్దు అంతకు ముందుగూడా రావచ్చు. నిజంగా వచ్చింది. జీవితంలో అనుభూతి విషయకమైన ప్రతి చిన్న విషయాన్నీ మనుష్యుడు పాటిస్తే, నిజంగా తాను పడుతున్నా, ననుకుంటున్న యాతనలు ఏమీ పనక్కరలేదు. ప్రపంచం ఒక బడి. జీవితం ఒక పుస్తకం. ప్రతి అనుభవమూ ఒక పాఠం. బడిలో పడి, జ్ఞానం అంటూ వచ్చిన దగ్గరనుంచీ ఈ ప్రతిపాఠాన్ని జాగ్రత్తగా చదివి దానివల్ల వచ్చే గుణపాఠాన్ని తనకు తాను యుక్తంచేసుకోగల ఏ వ్యక్తికయినా దుఃఖమూ, సుఖమూ, కష్టమూ ఒకటే అవుతాయి.

ఈ మూడురోజులుగా సుబ్రహ్మణ్యంమనస్సులో రేగిన తుపాను ఇప్పుడు విరిసిపోయింది. మూడు నిద్దరలు అయి, చిట్టి, భరత్తో సహా పుట్టింటికి వచ్చింది. సుబ్రహ్మణ్యం సంతోషించాడు. ఆ సంతోషంలో ఒక నిర్లిప్తత వుంది.

చిట్టి తండ్రిదగ్గరకు వచ్చింది. తండ్రి ఆమె చుబుకము గిల్లి 'చిట్టీ ! మీ ఇల్లు బాగున్నదా !' అన్నాడు. చిట్టి చేతిన ఒక మనోహరమందహాసరేఖ ముఖ్యరంగా తోచిన మనసిద్ధకొంతేరలను చీల్చు కొని బయటకు వచ్చింది.

---



# ప్రేమగీతి

శ్రీ స్థానాపతి రుక్మిణమ్మ

చక్కదనమును ప్రేమింపజాలు దేని
వలదు ప్రేమింప ; దశదిశల్ వెలుగజేసి
ఆదిమధ్యాంతములు లేని అధికదీప్తు
చక్కనౌ కాంతి ప్రేమింప జనును నీకు.

తరుణి నంచును ప్రేమింప దలతువేని
వలదు ప్రేమింప ; సర్వదా తలుణమూర్తి
నవనవోన్మేషరీతుల నాట్యమాడు
మాధవుని నీవు ప్రేమింప మంచిదగును.

ధనముకోసమె ప్రేమింప దలచితేని
వలదు ప్రేమింప ; నుడువగా నలవిగాని
రత్నరాసుల వెలుగొంది రహి దనర్చు
నుదధి నెప్పుడు ప్రేమింప నొప్పు నీకు.

ప్రేమకై నన్ను ప్రేమింప బేర్మి దలతె
ప్రేమమున్ గొల్లరావోయి ప్రియవయస్య !
ఇనుడు, మాధవు, డుదధి యిన్నింటికంటె
నమ్మకమ్మగు నాడు మనమ్ము నిడుదు.

# బాష్పాంజలి

●

శ్రీ మోచర్ల రామకృష్ణయ్య

నీ కేమి కొఱంత ? శోక-వ్యాకీర్ణభవార్ణవమున నల్లాడు జనా
నీకమునకు మాకేకద-చేకూరెఁ గొఱంతనీవు సిద్ధుఁడ వగుటన్.

కలుషసంసారతాపతప్తులకు మాకు-నిలువ నీడ నొసంగిన నీవు నేఁడు
కంటి కగపడ వన్న దుఃఖంబె కాని-నిజముగా నీకు మృతి కల్గెనే మహర్షి!

తపముఁ గావించి, కౌమారదశ ఫలింప-నెన్నఁడో నీవు చావు జయించినావు-
నీవు మృత్యుంజయుఁడవె సందేహమేమి ?-మాపుకొనలేము చింత పామరుల మగుట.

ఈవు మేను విడిచి పోవు వేళకు మింటఁ-గంటఁ బడె విచిత్రకాంతి యొకటి-
అది భవన్మహస్సుకద చిదంబరవీథి-విరియఁబాఱి మేళవించె నందు.

ఆఱుమోముల దేవర వనుచు నమ్మి-కొలచినారము నిను; మేలుకలిగె మాకు;
అరిది యేమిందు ?వేలుపు లట్టివార-లిడుమ లెడయుట నిన్నాశ్రయించి కాదె ?

నిన్ను మాకొఱకిచ్చోట నిలిపి యిట్టు-లొంటిమై నెన్నియేండ్లు తా నుండఁ గలఁడు ?
అవనివాసంబు చాలు రమ్మనెనో యేమొ-యీశ్వరుఁడు-కానిచోఁ బోదువే మహాత్మ!

శివగురు నానతిన్ గదలి చేరితి వాతని చెంత, సామి, ని
న్నవిరళభక్తితోఁ గొలిచినట్టి మమున్ మది నుంచి, మాపయిన్
భవదనుకంప నింపుమని ప్రార్థనచేయుదు మేము; నూత్నబాం
ధవు-ను మిత్రులన్ మఱగి, దాసుల నొప్పరికింపఁబోకుమా !
ఈ వెచ్చోటఁ దప మ్మొనర్చితివొ, నీ వెచ్చోట సిద్ధుండవై
నావో, యేయెడ నీవు నీమనుగడన్ సాధించినావో, యవే
దేవా సేవ్యములైన క్షేత్రములు-తాదృక్పుణ్యభూముల్ గదా
కైవల్యప్రియులైన మానవులకుం గల్పద్రుమప్రాయముల్.

---

# భాష - అర్థతత్త్వవిజ్ఞానము

## (Language & Semantics.)

శ్రీ గురుభాగవతుల ధర్మారావు

(గతసంచిక తరువాయి)

ఇప్పటి భావములు, హేతువాదములు, నీతినియమములు మన కెంతయో నిస్సందేహములుగను, సహజములుగను కన్పించును. కాని రెండుమూడువేల సంవత్సరముల పూర్వమున గల మానవసమాజపు మానసికప్రపంచము నేటికంటె చాల భిన్నము. పురాతనమానవులకు ప్రపంచమంతయు అద్భుతమయము. వారి మనోవృత్తులు శిశువుల మనోవృత్తులవంటివి. విషయముఖచింతనకన్న (*Objective Thinking*) ఆత్మముఖచింతన (*Subjective Thinking*) వారిలో నెక్కువ. రాయిని చూచి మనము దానికి ప్రాణం లేదంటాం. లేదా శాస్త్ర దృష్ట్యా చూస్తే, అసంఖ్యాకపరమాణుపరిమాణుపరిభ్రమణసంజనితదృశ్య మంటాం. మనం రాయిని చూచి భయపడము కాని వారి కది యెంతయు భయావహముగ నుండెను. దానియం దొక యపూర్వ శక్తియు, దేవతలును వానికి గోచరించుచుండెను.

సభ్యతా (*Civilisation*) ప్రగతిని మనము తిలకించినచో నది బహిర్ముఖ చింతనవైపునకు మరలుచున్నదనియు, వారి మనోబుద్ధినిర్మాణము కల్పనలను భావనలను త్యజించి, క్రమక్రమముగా విషయాభూతమగుచుండె ననియు చెప్పవచ్చును. దీనినిబట్టి నవనాగరికులమగు మన జ్ఞానవిజ్ఞానములు దోషరహితము లనియు, వారివి దోషపూరితము లనియు భావించుట పొరపాటు. *Anthropologists*— పురాతన మానవతత్త్వశాస్త్రవేత్తలు చెప్పిన దేమన, ఆధునికులమనిపించుకొను మన మనోనిర్మాణమునందును, మన ప్రవర్తనయందును ఆదిమ మానవుల మనఃప్రవృత్తులును, ప్రవర్తనాబీజములును సూక్ష్మమున తలలెత్తుచున్నవని.

మాతృగర్భమున మానవశిశుపిండము కొన్ని యవస్థాభేదములను పొందును. ఈ యవస్థాభేదము స్వల్పజీవజంతువులనుండి మానవునివరకు వచ్చిన పరిణామ రేఖను స్ఫురింపజేయునని జీవశాస్త్రజ్ఞులు (*Biologists*) చెప్పుచున్నారు. ఈ విధముగ ప్రాచీననరుని మనః ప్రవృత్తులను బోధపరచుకొనుటకు శిశువుయొక్క మనః ప్రవృత్తులు మనకు తోడ్పడును.

### క్రియాపదములందు కాలసంజ్ఞలు:

శిశువువలెనే, ఆదిమనరులు భూతకాలమునగాని, భవిష్యత్తునందుకాని దృష్టి యుంచక వర్తమానమునందే దానిని నిలుపుదురు. ప్రపంచమున గల చాలా భాషలలో వర్తమాన, భూత, భవిష్యత్కాలముల సంజ్ఞలు లేవు. వారు గుర్తించునది అవస్థ (*Aspect*) గాని కాలము కాదు. ఆటవికులు మనము గుర్తించజాలని వాసనలను, ధ్వను

లను ఎన్నో గ్రహించుదురు. దీనికి కారణము వారికిని ప్రకృతికిని గల సాన్నిధ్యమే. ఇది నవీనుల మగు మనకు లేదు. ఆదిమమానవుల కవసరమును, గ్రహింపగలుగునదియు గమనము (*Movement*). గమనము వర్తమాన కాలపు టవస్థ. బహు ప్రాచీనమగు శిల్పమున నీవిషయము మనము గమనించగలము. హారిణశృంగముపై ప్రాచీనశిల్పి యొకడు పరుగెత్తుచున్న లేడిని చెక్కినాడు. మొదటి చిత్రమునందు వెనుకకాళ్లుమాత్రము కనుపించును. రెండవదానియందు పూర్ణమైన హారిణచిత్రము గోచర మగును — ఇంచుమించు సినిమాఛాయాపటములవలె.

***Time is an abstract category* —కాలజ్ఞానము:**

కాలవిచక్షణ—ఇది వస్త్వేతర శ్రేణీగణమునకు సంబంధించును. ప్రాచీనమానవునికి తన వయస్సుగాని, తన. భార్యాశిశువుల వయస్సుగాని తెలియనగత్యము లేదు. భూతము నతడు విస్మరించును భవిష్యత్తుపై దృష్టి లేదు. కావున కొన్ని ప్రాచీనభాషలలో కాలసూచకప్రత్యయము లరుదు. కొన్ని యవ్యయములను పరిశీలించినచో నవి స్థలనిర్దేశకము లని తేటపడును. కారణ మేమన,—మనోవైజ్ఞానికదృష్ట్యా కాలము సూక్ష్మము; స్థలము స్థూలము. ఎన్నియో వస్తువు లొకేక్షణమందు దృష్టిపథమున పడును. కాని కాల మట్లు కాదు. సూక్ష్మీకరణశక్తియే (*Abstraction*) దానిని సృష్టించగలదు.

**భవిష్యత్కాలము :**

వర్తమానభూతకాలములకన్న భవిష్యత్కాలమును గ్రహించి, సంజ్ఞలను సృష్టించుట కష్టము. వ్యాకరణముల చరిత్రను పరిశీలించినచో, వర్తమానభూతకాలములపిదప భవిష్యత్కాలము దర్శింపబడిన దని తెలియగలము. ఇండోయూరోపియన్ భాషల సహాయమున మౌలికమగు భవిష్యత్తును ఇంకను భాషావేత్తలు నిర్మించలేదు. స్లావిక్, గోథిక్ (*Slavic, Gothic*) భాషలలో భవిష్యత్తునకు స్పష్టమైన స్వరూపము గోచరించదు. ఇంగ్లీషులో ఉన్న ఈ వాక్యము—"*I will be drowned, and nobody shall save me*"—ఇటాలియన్ భాషలో ఉండుటకు వీలులేదు. గ్రీకో, రోమన్ (*Graeco-roman*) సభ్యత అంతరించి, అంతకన్న తక్కువ శ్రేణికి చెందిన సభ్యత దాని స్థానము నాక్రమించుటచే, *Vulgar Latin* అనే భాషలో భవిష్యత్కాల సంజ్ఞ శిథిలమయ్యెను. భవిష్యత్ ధ్యానమున చూపబడు శాంతి, మనోనిగ్రహాలను బట్టి జాతియొక్క విద్యాపరిమితి మనము లెక్కింపవచ్చును.

**లింగము (*The problem of gender*):**

కొన్ని ఆధునికభాషలలో పుంలింగ, స్త్రీలింగ, నపుంసకలింగముల భేదనిర్ణయము అర్థహీనముగ కనుపించును.

ఫ్రెంచిలో *Nose* (ముక్కు); *Field* (పొలము); *Sun* (సూర్యుడు)—ఇవి పుంలింగములు. కాని *Table* (బల్ల), *Mouth* (నోరు), *Moon* (చంద్రుడు)—ఇవి స్త్రీలింగములు. ఇటాలియన్ భాషలో, *Le Tigre* (పులి) స్త్రీలింగము. కాని *Le Gatto* (పిల్లి) పుంలింగము. హిందీలో దాడీ (గడ్డము) స్త్రీలింగము!

ఇండో-యూరోపియన్ భాషలు పరిశీలించినచో ఈలింగభేదమునకు కారణము కొంతవరకు తెలియును.

ఇండో-యూరోపియన్ భాషలు మాట్లాడువారు నిర్జీవములగు స్థావరములకును, ప్రాకృతికవస్తువులకును మానవత్వమూ, దేవత్వమూ ఆరోపించేవారు. బాలుడు తానాడినపుడు ప్రమాదమున చేయి గోడకు తగిలి గాయము పొందినపుడు, గోడకు మానవత్వ మారోపించి తిట్టుట మనకు తెలిసినవిషయమే. జర్మనుభాషలో చంద్రుడు పుంలింగము; సూర్యుడు స్త్రీ లింగము. సంస్కృతములో "పాదపము" నపుంసకలింగము కాదు. కాని "మూలము" నపుంసకము.

ఈ లింగవివేచనసందర్భంలో ఫ్రేజర్ (*Fraser*) పండితుడు చిత్రమైన అభిప్రాయమును వెలిబుచ్చినాడు. అది ఏదనగా—మాట్లాడువ్యక్తి పురుషుడైనచో శబ్దము పుల్లింగముగా భావింపబడె ననియు, స్త్రీయైనచో స్త్రీలింగముగా భావింపబడె ననియు. కొందరు 'జ్యోత్స్న' 'సఖీ' శబ్దములు స్త్రీలింగములుగ గణింపబడుటకు కారణము వాటి యాహ్లాదకరత్వ మని భావించుచున్నారు. కాని "పుష్పము" "కుసుమము" ఆహ్లాదకరములయ్యు నపుంసకములు.

పతంజలి వివక్షయే లింగప్రభేదమునకు కారణమని వాక్రుచ్చినాడు. "పుట్టించుట" అనే భావము ముఖ్యమైనపుడు శబ్దము పుంలింగ మనియు, "వృద్ధిచెందుట" అనే భావము ముఖ్యమైనపుడు స్త్రీలింగ మనియు, రెండును ముఖ్యమైనపుడు నపుంసకలింగ మనియు చెప్పినాడు. "బ్రహ్మన్" అనే పదము నపుంసకలింగ మగుటకు కారణము—వ్యష్టిత్రయములకు మధ్య నుండు స్థితిని (*Conservation of energy*) తెల్పుటచే నని కైయటుడు వచించినాడు.

ఈ నాగరికప్రపంచమున లింగప్రభేదము రానురాను నిష్ప్రయోజన మగుచున్నది. కవిత్వమందుగాని, ఆవేశపూరితవక్తృత్వమందుగాని మానవత్వదేవత్వము లారోపించుట కవకాశము కొంత కలుగుచున్నది. "వందేమాతరం" అను జాతీయగీతముయొక్క హృదయంగమత్వము చాలావఱకు "మాతరం" అను శబ్దముపై ఆధారపడియున్నది.

భాషలోవలె. లింగవిషయమునకూడ శబ్దరూప మర్థమందు మార్పు కలిగించినది. స్థూలార్థములు సూక్ష్మము లగుట *Idea* అను శబ్దమునుబట్టి తెలిసికొనగలము. ఈశబ్దము 'విద్' అను ధాతువునుండి పుట్టినది. విద్ అనగా చూచుట.

అర్థభేదములు కొన్ని సాంఘికసంకేతములనుండి (*Social Conventions*) పుట్టినవి. అవి ఆంతరికవిపరిణామములు (*Psychological Changes*) కావు. వీటిని అటుండనిచ్చి, మిగిలిన యర్థభేదములను మనము విచారించిచో నవి యన్నియు రూపకము, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి మొదలగు అలంకారసంజ్ఞల ద్వారా సాధ్యము లగునని చెప్పగలము. *Norse* భాషలో కిటికీకి *Vin Dauge (Eye of The Wall)* అని పేరుపెట్టినవాడును, గ్రీకు భాషలో సీతాకోకచిలుకకు *Soul*—అనగా "ఆత్మ" అని పేరుపెట్టినవాడును కవులని చెప్పవచ్చును.

ఇటాలియన్ భాషలో కంటిపాపకు *La Luneta (The Little moon)* అందురు. తెలుగు శబ్దమగు పాపకును, ఈ ఇటాలియన్ శబ్దమునకును ఎంత సాన్నిధ్య మున్నదో చూడుము.

"గౌ ర్వాహీకః" అనునపుడు ఎద్దు మొద్దుతనము వాహీకున కారోపింపబడినది.

ఆలంకారికులు పదములను వాచకము (*Denotative Words*) లనియు, లాక్షణికము లనియు (*Words with Secondary meaning*), వ్యంజకము లనియు, వీటి యర్థములను క్రమముగ వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యము లనియు విభజించినారు. కాని "గంగాయాం ఘోషః" (గంగానదిఒడ్డున నున్న గొల్లపల్లె) అనుదానియందు వాచ్య, లక్ష్య, వ్యంగ్యములు మూడును "గంగా" యను శబ్దమున కనబడుచున్నవి. వ్యంగ్యము కవిత్వమున కాత్మవంటిదైనను, మన లాక్షణికులు వ్యంజనమును (*Suggestion*) ఒకవృత్తిగా పరిగణింపలేదు. "కుశల" "ప్రవీణ" శబ్దముల యర్థ మిప్పుడు వ్యంజకశక్తిచేనిర్ణయింపబడినది. ఒకప్పుడు వాటికి సాంకేతికార్థము లేయుండెను. (కుశలుడు=గడ్డికోయువాడు)

**No Semantic Laws Exist**—అర్థవైజ్ఞానికసూత్రములకు స్వతంత్రమగు ఉనికి లేదు:

భాష ఒకవిధమైన కవిత్వమువంటిది. సృష్టించుట దాని స్వభావము. ఈ సృష్టించుటలో కొంత స్వేచ్ఛ దానికి కలదు. కళాస్రష్టపై మన సంకేతములను విధింపగలమా? అట్లే భాషనుకూడ మన మనుదినము సృష్టించుచున్నాము. ఈస్వేచ్ఛ నియమబద్ధమైనది కాని, అశృంఖలమును, విప్లవకారకమును కాదు. కావ్యములు, చిత్రములు శిల్పములు-ఇవన్నియు నెట్లు రససౌందర్యములను నిర్మించునో, అట్లే భాషయును. ఈ సౌందర్యనిర్మాణముల రహస్యధర్మమును గుర్తించుట యెట్లు కష్టసాధ్యమో, అట్లే భాషాపరిణామమున నిబిడీకృత మగు నర్థతత్త్వమును దర్శించుటయు కష్టసాధ్యము. రస, రీతి, శయ్యా, ఛందస్సులతోను, కథావస్తుపాత్రములతోను అలరారు కావ్యరాజములను రచించిన కాళిదాసాదిమహాకవులు పూర్ణమైన స్వేచ్ఛ కలిగియుండినను, వారి స్వేచ్ఛ నిరంకుశస్వేచ్ఛ కాదు. దానియందంతర్గత మగు న్యాయము (*Logic*) ఉన్నది. ఈన్యాయమే కావ్యాంగముల నన్నిటిని ఏకీకరణము గావించి, కవివ్యక్తిత్వమందు నిగూఢమైయున్న సమగ్రానందానుభూతిని కల్గించుచున్నది...... కావ్యమం దున్న న్యాయ మాంతరంగికము. అది మానవ హృదయమున కానందానుభూతి నందిచ్చి, స్పందింపజేయునుగాని, గణితశాస్త్రమువలె, తడిలేనిదియు, కేవలబుద్ధిసంపాదితమును కాదు.

ఈవిధముగ భాషకుకూడ నాంతరంగిక న్యాయమును, దాని సౌందర్యమం దొకయపూర్వనిర్మాణమును కలవు. ఇవి లాక్షణికులచే బహిరాపాదితములుగాక, వృక్షము యొక్క వంకరటింకరలుగల కొమ్మలవలె నాంతరంగికజీవనవిన్యాసములు. అర్థశాస్త్రసంబంధములగు నీభాషయందలి మార్పులు కేవలతర్కబుద్ధితో చూచువారికి నాకస్మికములుగను, అహేతుకములుగను అగుపడును. కాని మనస్తత్త్వపరిజ్ఞాన (*Psychological*) దృష్టితో చూస్తే, వానిని సంపూర్ణముగ గ్రహించగలము. వీనియందు హేతుబద్ధమైన యావశ్యకత లేదు. ఐరోపాదేశీయులు వాణిజ్యసంస్కృతికి (*Commercial culture*) రాగానే, ఒక నూతనక్రియాపదమును—"*To pay*"— సృష్టించుకోవలసివచ్చెను. ఈ "*To Pay*" అనునది ఒక *Concept* (సంబద్ధప్రత్యయము). కాని ఇది ఒకొక్క భాషలో ఒకొక్క విధముగా మారినది. జర్మనుభాషయందు *Bezahlen*—సొమ్ము

లెక్కించుట; లాటిన్ భాషయందు *Solvere*—కరిగించుట. *Vulgar Latin*లో *Pacare*—*To pacify* శాంతింపజేయుట. దీనిని బట్టి ప్రతి భాషయు, ఒకే భావమును స్వతంత్రముగ తెలకనువగు పదములద్వారా వ్యక్తపరచునని స్పష్టపడుచున్నది.

పైన చెప్పబడిన విషయములవల్ల తేలిన దేమనగా—భావవ్యక్తీకరణమునకై మన మొక మాటను వెదుకుకొనునపుడు కొన్ని భావానుసంగములు—*Logical* గా అవసరముకానివి—కొన్ని మన మనోదృష్టిని ప్రవేశించును. ఏల? భాష మనుష్యుల వ్యవహారముకాబట్టి. మానవులు వాస్తవిక జగత్తును కేవలము హేతుశాస్త్రదృష్టితో చూడక, ఆత్మముఖదృష్టితో చూతురు. వచించువాడును, భాషాస్రష్టయు నగు మానవుడు గణితశాస్త్రవేదియు, తార్కికుడును కాడు. అతడు కళ నుపాసించును. చిరంతన బాలకుడు. అతని జీవితమును కదలించునవి కలలు, కామములు, యత్నములు, భయములు, భావోచ్ఛ్వాసములు. మనము మన వాదములను భాషయందు బలవంతముగ చొప్పించుట మాని, భాషనుండియే దాని మర్మధర్మముల నభ్యసింపవలెను.

**భాషాకోశములందును, వ్యాకరణములందును గల జాతీయత :**

జాతీయత కొంతవరకు భాషలో ప్రతిబింబించును. ఒకేభాష మాట్లాడువారి చరిత్ర, మానసికతత్త్వం, పరిసరప్రకృతి లక్షణములు, సంస్కృతి—వీటినన్నిటిని అనుబంధించే సాధనం ఆభాషయే. ఐరోపీయసంస్కృతి బోధపరుచుకొన్న వారికి ఆ ఖండమందలి భాషలలో ఐరోపీయ సంస్కృతియొక్క వివిధఛాయలు కనబడును. అట్లే మన దేశమందుగూడ. ఇటాలియన్ భాషలోవలె తెలుగుభాషలో సంగీతగుణమున్నది. తెలుగు "*Italian of the East*". జర్మన్ భాషలో పదములు, వాటి యర్థములు మార్పుచెందే ముఖ్యస్థలము వారి సైనికదళము. అమెరికన్లు వాడు ఇంగ్లీషులో *Handicap. Knock Out*—అను పదములు చాలామట్టుకు కనుపించును. ఈమాటలు వారి యాటపాటలకును వర్తకవ్యవహారములకును సంబంధించినవి. ప్రాచీనలాటిన్ భాషలో *Egregios* అంటే "మంచివాడు". దీని వ్యుత్పత్తి "ఎంపుడుగొర్రె" అని. ప్రాచీన లాటినుభాష మాట్లాడేవారు వ్యవసాయదారులు. ఇంగ్లీషుభాషలో *Nuance* అనే మాటను అనువదించుట కష్టము. ఇట్లే తెలుగుపదముల కున్న నానుడి, స్వరములు, అక్షరసమామ్నాయము, పదవాక్యరచన, సామెతలు ఇతరద్రవిడభాషలలో కనుపింపవు.

తెలుగు ప్రాకృతభాషకు సన్నిహితమా, లేక ద్రవిడభాష దాని మాతృకయా? అను విషయముపై వాదప్రతివాదము లున్నవి. ఈ చిక్కు ఇంతవరకు విడకపోవుటకు తగిన సామగ్రి లభింపమి కొంతవరకు కారణము. క్రీ. శ. 5, 6, 7 శతాబ్దులలో ఆంధ్రుల చరిత్రగాని, వారు మాట్లాడుచుండిన భాషాస్వరూపముగాని నిర్ణయించుటకు సాధనసామగ్రి ఇంకను చిక్కలేదు. దేశము నేలిన యాంధ్రుల భాష ప్రాబల్యము కలిగియుండెనా? లేక కొంతకాలమువరకు ప్రబలియుండినను కాలక్రమేణ ప్రాంతీయభాషకు తావిచ్చెనా? నార్మనులు ఇంగ్లాండులో తమ భాషను కొంతకాలమువరకే ప్రబలునట్లు చేయగలిగిరి. పిదప సంఘము మారి

ఆంగ్లోసాక్సన్ భాష నార్మన్ ఫ్రెంచిభాషను కొంతవరకు జీర్ణించుకొని చివరకు అదృశ్య మగునట్లు చేసెను. తెలుగున గల ప్రాకృత భాషాచిహ్నాలుగాని, ప్రాకృతభాషా మర్యాదలుగాని ఇదమిత్థమని చెప్పుటకు— *Philology, History. Numismatics, Epigraphy* —ఇంకా ఎన్నియో శాస్త్రములు లవగతము చేసికొన్నవారు పరిశోధనలను వేర్వేరుగా జరిపి ఫలితములను సమన్వయము చేసినగాని వీలుండదు. మనము గమనించవలసిన విషయ మేమన—భాష మానవ వ్యవహారములలో నొకటి గావున, ఒక కుటుంబములకుగాని, భిన్న కుటుంబములకుగాని చెందిన రెండు భాషలయందు జరుగు మార్పులు మొదట మానవసమూహములద్వారా జరుగును. కాని నిఘంటువులలోను, వ్యాకరణముల లోను జరుగదు. కీ శే. గిడుగు రామమూర్తి పంతులుగారి పరిశోధన లన్ని క్రోడీకరించి *"Historical grammar of Telugu"* ఒకటి తయారు చేసే ప్రయత్నము లింకను కనుపడవు. ఎంత పరభాషాప్రాబల్య మున్నను భాషకు ఒక వ్యక్తిత్వము, ఓజస్సు, విశిష్టత యున్న యెడల నిజస్వరూప మెప్పుడును వినష్టింపదు. ఈమధ్య ప్రపంచభాషాతత్వవేత్తల సమావేశ మొకటి ప్యారిస్‌నగరంలో జరిగినది. దానికి మన తెలుగువా రెవరూ వెళ్లినట్లు తెలియదు. డా. సునీతకుమార ఛటర్జీగారు వెళ్లేరట. అక్కడ జరిగిన ప్రసంగాలలో ద్రవిడభాషా తత్వ మొకటి అని వా రన్నారు. ఏవిధముగ క్రీ. శ. 15, 16-వ శతాబ్దములయందు ఐరోపీయభాషలు గ్రీకు, లాటిన్ ప్రాబల్యమున గొప్ప మార్పులు చెందినవో అట్లే ఇప్పుడు మన దేశపు భాష లన్నియుగూడ ఆంగ్లేయ భాషాసంపర్కమునను, నూతనచారిత్రాత్మిక శక్తుల సంఘటనవలనను క్రొత్తస్వరూపము లను పొందుచున్నవి.

రాయలసీమయందు వాడబడే తెలుగులో కొన్ని ప్రాతపదము లున్నవని కొందరి యూహ. ఏ భాషలోనైనను ఒకే యర్థ మిచ్చు రెండుపదము లుండును. అందొకటి ప్రాతది; రెండవది నవీనము. కొంతవరకు రెండు ప్రాంతాలమధ్య రాకపోకలు లేకపోవుటయే యీ వైవిధ్యమునకు కారణమై యుండవచ్చును.

*Linguistic innovations start from one individual* — భాషలో క్రొత్త పదములు క్రొత్త అర్థములు:

ఇవి ఒకప్పుడు వ్యక్తుల వల్లనే - అనగా మహాకవులవల్లనే పుట్టును. డాంటే ఇటాలియన్ భాషను చాలావరకు పోషించేడు. అట్లే ఇంగ్లీషుకు షేక్స్పియరు, తెలుగుభాషకు నన్నయ, రవీంద్రుడు బంగాళీభాషకు పెట్టినభిక్ష అపారము. వాడుక భాషయందు గల అర్థగాంభీర్యము, అర్థసంపద అతని రచనలలో మిక్కిలి కనుపడుచున్నవి.

*The importance of phonetics to linguistics.*—

ఏ సజీవభాషయందుగాని దాని యక్షర సమామ్నాయమువల్ల తెలుపబడని కొన్ని స్వరము లుండును. కావున వాటిని పర్చి-ఎప్పటికప్పుడు అక్షరసమామ్నాయమునకు చేర్చవలెను. ఇవి ముఖ్యముగా వాడుక భాషకు చెందినవి. గ్రాంథిక భాషయందున్న పదములు, అర్థములు రత్నములే. కాని ఈ రత్నములు వాడుకభాష అను గనినుండి వచ్చినవే. కావున వాడుకభాషయందు కన [illegible]డు స్వరములు Phoneticగా పరిశీలిస్తే, ప్రతి తరమందును గ్రాంథిక, వాడుకభాషలకు గల పరస్పరసంబంధము తేటపడుతుంది.



కంచి దేవాలయంలోని వీరవిహారమూర్తి - కైలాసనాథుడు.



అదే దేవాలయంలోని ఇంకొక ప్రళయతాండవమూర్తి.

# నిద్ర - దాని చిత్రవిచిత్రాలు

శ్రీ వావిలాల సోమయాజులు

ఆది ఆముక్తమాల్యదపాఠ మనుకుంటాను; నాకు వెర్రినిద్ర వస్తున్నది; కుప్పయాచార్యులవారు కుదుర్లైన గొంతుకతో 'నిద్రాదేవత నిన్ను పూనె గదరా నిర్భాగ్యదామోదరా!' అనే శార్దూలపాదాన్ని ఘనా జటా వేసి చదువుతుండగా మిత్రుడు తట్టి మేల్కొలిపాడు. మరొక సహాధ్యాయి 'నిద్రకుకూడా ఓ దేవతంటూ ఉన్నదాండీ!' అని అయ్యన్న చనువుతో ప్రశ్నించాడు. ఆ దొడ్డపండితుడు తడువుకోకుండా 'జ్యేష్టాదేవి, అలక్ష్మి—లక్ష్మి అమ్మవారి అక్కయ్య' అన్నారు. మావాడు 'ఆమె ఎలా ఉంటుందండీ' అని ప్రశ్నిస్తే—

'అలక్ష్మీం త్వాం కురూపాసి కుత్సితస్థానవాసినీ,...అలక్ష్మీం కృష్ణవర్ణాం, ద్విభుజాం, కృష్ణవస్త్రపరిధానాం, లోహాభరణభూషితాం, శర్కరా చందనచర్చితాం, గృహసమ్మార్జనీహస్తాం, గర్ధభారూఢాం, కలహప్రియాం.'

అని—జ్ఞప్తికి లేదు—ఏదో గ్రంథం పేరు చెప్పారు. జరిగిన ఉదంతం సాకల్యంగా అవగతం చేసుకొని నేను 'దామోదర' శబ్దౌచిత్యం ఏమిటని ప్రశ్నించాను. ప్రమీలావస్థనుంచీ బయటపడ్డ నన్ను ఒక చిరునవ్వుతో ఆదరించి 'ఉదరే దామ యస్యేతి దామోదరః —యశోదాదేవి మన్ను దిన్న బాలకృష్ణమూర్తిని పలుపుతో కట్టివేసిందికనుక దామోదరుడైనాడు. మన్ను తిన్నట్లు నిద్రపోయ్యే పీనాటివాళ్లను నిద్రాదేవత పాశబద్ధులను చేస్తున్నది కనుక వీరూ దామోదరులే' అన్నారాయన. ప్రాచీనులు నిద్రకూ ఒక దేవతను సృష్టించుకున్నారని ఆనాడు మా కవగతమైంది.

తరువాత బాబిలోనియాదేశంలో పూర్వులు నిద్ర పట్టకపోతే 'లోహార్' అనే నిద్రాదేవతను పూజిస్తారనీ, ఫిన్నిష్జాతివారికి 'ఉని' అనే నిద్రాదేవతా, 'ఉంటామో' అనే స్వప్నదేవతా ఉన్నారనీ తెలుసుకున్నాను.

నిద్ర సృష్టిలో ఒక విచిత్రమైన సృష్టి. అది 'పట్టు పెల్లా'లా ప్రతివ్యక్తినీ కప్పివేస్తుంటుంది. అన్నార్తునికి అన్నం; తృష్ణార్తునికి దాహం. శీతోష్ణబాధితులకు అది ఉష్ణమూ, శీతమూను. అమిత్రులకు మిత్రము; నిలయరహితులకు నివాసము; మనోబాధితులకు మహనీయాంజనము. అయితే, 'అది మృత్యువును పోలి ఉండటం ఒక్కటే దానిలో దోష'మన్నాడు ఒక తాత్వికుడు. చంపటంతప్ప తక్కిన పనులన్నీ అది చేసే రీతిగా ఇదీ చేస్తుంది. మృత్యువుతో నిద్రకున్న ఈసహజబాంధవ్యాన్ని గమనించిన ఒక భావుకుడు అందుకనే 'నిద్ర ఒకజాతి మృత్యువు; దాని పుట్టుక నరకం; కాని దాన్ని నరకం తరిమివేసింది; స్వర్గం చేరనివ్వలేదు' అన్నాడు. అందువల్ల త్రిశంకుస్థితి పొందింది నిద్ర.

నిద్రకూ, మృత్యువుకూ ఉన్న సమాన ధర్మం అవి అవహించినప్పుడు ఆత్మకు స్వాతంత్ర్యాన్ని ప్రకటిస్తవి. ఈరెంటినీ గురించిన పరిపూర్ణవిజ్ఞానం కలవాడు 'పరమవివేకి' అని ఈకారణంవల్లనే భావుకులు పలకవలసివచ్చింది. 'మన జననమే ఒక నిద్ర; విస్మృతి.' ఈ నిద్రలో ఆత్మ మనతో సుమారం జన్మదేశాన్ని వదలి వస్తుందని తాత్వికమహాకవి వర్డ్స్వర్త్ అన్నాడు. ఈ రావటం కేవలం అజ్ఞానంతోనూ కాదు; అంధకారంతోనూ కాదు, ప్రత్యభిజ్ఞా ప్రకాశంతోనే.

'షడ్దోషాః పురుషేణేహ హాతవ్యా భూతి మిచ్ఛతా, నిద్రా తంద్రా భయం క్రోధ ఆలస్యం దీర్ఘసూత్రతా' అని ఆర్యోక్తి. నిద్ర, ప్రమీలనము, భయము, క్రోధము, ఆలస్యము, పోమరితనము—వీటి వల్ల అదృష్టం కలుగదని భారతీయనిర్ణయము. అందు వల్ల దురదృష్టహేతువుల్లో నిద్ర ఒకటి. అంతమాత్రం చేత నిద్ర పనికిరాదని అన్వయించటానికి అవకాశం లేదు. అది ప్రాణాధారమనీ, క్రమనిద్ర లేకపోతే ఆయుక్షీణ్యమనీ మనవారు గుర్తించారు. అందుకనే ఆర్యక్షేమీశ్వరుడు నిద్రననుసరించి—

'చిత్తం ప్రసాదయతి లాఘవ మాదధాతి
ప్రత్యంగ ముజ్జ్వలయతి ప్రతిభావిశేషమ్,
దోషా నపస్యతి కరోతి చ ధాతుసామ్యం,
ఆనంద మర్పయతి యోగవిశేషగమ్యమ్'

అని వివరించాడు. 'మనస్సును నిద్ర నిర్మలం చేస్తుంది. అవయవాలను తేటపరుస్తుంది. శరీరదోషాలను రూపుమాపుతుంది. ధాతువులను సుస్థితిలో నిల్పుతుంది. యోగగమ్యమైన ఆనందాన్ని ప్రసాదిస్తుంది' నిద్రాశబ్దార్థమే పై అంశాన్ని వివరీకరిస్తున్నది. 'నియతం ద్రాన్తి ఇంద్రియాణ్యత్రేతి నిద్రా' అని. ఇంద్రియాలు నియతంగా దీనిలో ఉపరతాలటం వల్లనే నిద్ర నిర్దిష్టింది. దీనికి పర్యాయశబ్దాలైన స్వప్నసంవేశనాలకుకూడా అర్థమిదే.

కవిరాజు శ్రీనాథమహాకవి 'కంటికి నిద్ర వచ్చునె, సుఖం బగునే రతికేళి, జిహ్వకున్ వంటక మిందునే, యితరవైభవముల్......శాత్రవుడొకండు తనంతటివాడు కల్గినన్' అని కీర్తనగాన్న శైలాన్ని సహించలేని వింధ్యాద్రిచేత పలికించాడు. ఈర్ష్య నిద్రాభంగకారి. అంతే కాదు. 'అలుక ఎత్తినవానికి, నర్థచింతకునకు, నాతురునకు, గామగోచరాత్మునకు వచ్చునే నిద్ర?'—'ఎన్నటి జను లెఱింగిన యిన్నాళ్లును తెలుగులందు నెయ్యది లేనట్, గన్నుమొగుడ నీవటె! నా కిన్నియు గలుగంగ నిద్ర యేటికి వచ్చున్' అని కవిబ్రహ్మ తిక్కనసోమయాజి సౌప్తికపర్వలో అశ్వత్థామచేత పలికించినాడు.

నిద్రాభావానికి ఇవి కొన్ని కారణాలు. రేపటి పగ సాధిద్దామనే ఉద్రేకంతోనూ, మార్గాన్వేషణలోనూ నిద్రపోడు. అర్థచింతకునకు ఆలోచనాతత్పరత నిద్రను దూరం చేస్తుంది. ఆతురునికి, కామగోచరునికి శరీర స్వాస్థ్య, అవస్థాభేదాలవల్ల నిద్ర రాదు. నిద్ర పట్టక పోవటానికి కారణాలను స్వాస్థ్య, శారీరక, మానసికా లని శాస్త్రజ్ఞులు త్రివిధాలుగా నిర్ణయించారు. శరీరంలో 'క్రొమైన్' అనే పదార్థం తక్కువకావటం వల్ల నిద్రకు భంగం కలుగుతుందనీ, అది ప్రత్యేకంగా ఒక జబ్బు కాదనీ, ఒక రుగ్మతకు బాహ్యచిహ్నమనీ 'క్లోవాక్' అభిప్రాయం. 'మన కెందుకు నిద్ర పట్టటం లేదా అనే ఆలోచనతో నిద్రపోగొట్టుకుంటే వాళ్లున్నా'రని ఈమధ్య ఒక శాస్త్రజ్ఞుడు వ్రాశాడు.

కొంచెం దీర్ఘనిద్ర పోయేవాళ్లను చూస్తే 'కుంభకర్ణు'డని వారికి బిరుదనామం పెడుతుంటాము. కుంభకర్ణుడు 'లంక కంపిం'చేటంత కోలాహలం జరిగితేగాని నిద్ర లేవడట. 'ఊర్మిళాదేవి' నిద్రలో ఉత్తమస్థానం వహించింది పురాణస్త్రీలోకంలో. ఆమె భర్త అన్నగారి అజ్ఞాతవాససమయంలో నిద్రావస్థలోనే అధికకాలం గడిపినట్లు వాల్మీకి వ్రాత. పౌరాణికవ్యక్తుల మాట అటు ఉంచినా, హెరడోటస్ చరిత్రకారుడు ఆరునెలలు నిద్రమేల్కొని ఆరునెలలు నిద్రించే జాతులను చూచినట్లు వ్రాసినాడు. ఇంత ఎందుకు! కొద్దికాలంక్రింద వార్తాపత్రికల్లో అన్నా ప్యాక్ పోవెల్ అనే ఆమె ప్రియుని మరణవార్త వినగానే నిద్రావస్థను పొంది ముప్పదిఒక్క సంవత్సరాలైనతరువాత మేల్కొన్నదనే సంగతి ప్రకటితమైంది.

జంతుసృష్టికి దీర్ఘనిద్ర ఒక విలక్షణము. వాటికి అది సహజావబోధము. 'ఆకులపాటు' ప్రారంభం కాగానే ఆస్ట్రేలియాలోని ఒపోస్సం, డింగో మొదలైన జంతువులూ, కొన్ని క్రిమికీటకాలూ, సర్ప జాతులూ ఎవరో చెప్పినట్లు దీర్ఘనిద్రకు సిద్ధపడుతూ ఉంటవి. వాటి అన్ని అవయవాలూ ఒక్కమాటున నిద్రావస్థ పొందవు. ఒక క్రమపరిణామాన్ని అనుస

రించి మత్తుపదార్థాన్ని చేకూర్చుకుంటూ కొంతకాలం బహుభారంతో నిద్రితావయవాలను బిగుసుకుంటూ వాటి కార్యకలాపాలల్లో మాంద్యము వహిస్తూ ఆస్థితిలో వాటి శరీరోష్ణత పగ మారుతుంది. నిద్రపోయే గబ్బిలాన్ని నీళ్లల్లో ముంచినా, చుంచుఎలుకను బాదినా మేల్కొనదట! జాగ్రదవస్థలో అతిభయంకరమైన సర్పము నిద్రావస్థలో కొట్టినా కోపం పెట్టుకోదు. 'మాంబా'జాతిపామును లాప్సుకోలమ్ అనే శాస్త్రజ్ఞుడు మేల్కొల్పినప్పుడు దాని క్రౌర్యం అణుమాత్రం కనిపించలేదట! నిద్రపోయే కప్పను మేల్కొలిపితే 'ఈబ్రతుకు కొందు'కన్నట్లు ప్రవర్తిస్తుంది. ఎలుగుబంట్లు ఇటువంటి దీర్ఘనిద్రావస్థలోనే ప్రసవించి మేల్కొని రెండుమూడు పిల్ల పిల్లలతో ఆడుకుంటుంది. ఈజిప్టుదేశంలోని 'నత్తలు' అయిదారేండ్లుదాకా నిద్రపోతూ ఉంటవట! ఒకమాటు ఒక నత్తగుల్లను అందంగా ఉండని తెచ్చి బ్రిటిష్‌వస్తుప్రదర్శనాలయంలో ప్రదర్శించారు, అందులోని జంతువు చనిపోయిందనే ఉద్దేశంతో. కాని తరువాత అయిదు సంవత్సరాలకు అది మేల్కొని నడిచింది. ఇలా క్రిమికీటకాలూ, జంతువులూ నిద్రపోవటానికి ఒక కారణం వాటికి ఆహారంగా ఉండే క్రిములూ, జంతువులూ నిద్రపోవటమే. శీతాకాలంవల్ల కలిగే బాధను తప్పించుకోటానికి ప్రకృతి తన సంతానమైన వీటికి నిద్రామార్గం ప్రసాదించింది. దూరం ఎగిరిపోయే పక్షులూ, తేనె సేకరించుకొని రెక్కలాడించి తెట్టెను వెచ్చగా ఉంచుకోగల తేనెటీగలూ ఇలా దీర్ఘనిద్ర పోవు.

మానవచరిత్రలో దీర్ఘనిద్రకు సంబంధించిన విశేషవిచిత్రాంశాలు కొన్ని కనిపిస్తున్నవి. జగజ్జేత అలెగ్జాండరు పర్షియాచక్రవర్తి డేరియస్‌మీద ప్రచండయుద్ధాన్ని ప్రకటించిన దినం అతిదీర్ఘనిద్ర పోయినాడట! సేనానాయకుడు 'పర్మీనియస్' అతని నిద్రను మేల్కొల్పటానికి జంకినట్లు గ్రీకుచరిత్రవల్ల వ్యక్తమౌతున్నది. కేటోచక్రవర్తి ఆత్మహత్య చేసుకోదలచుకున్ననాడు అతనికి ఘోరనిద్ర పట్టింది. 'సెక్ట్సస్‌పాంపే'ను జయింపవలసిన సమయం, సముద్రయుద్ధం తీవ్రంగా సాగుతున్నది. కాని నాయకత్వం వహించవలసిన సందర్భంలో అగస్టస్‌సీజరు మృతితో తుల్యమైన నిద్ర పోయినాడు; విజయవార్తతో వచ్చిన సేనాని 'ఎగ్రిపా' ఎంతకాలమో వేచి నిలవవలసి వచ్చింది.

దీర్ఘనిద్ర పోతూనే కొందరు ఇతరులు జాగ్రదవస్థలో చేయగల కార్యకలాపాలను నిర్వర్తిస్తారు. జేన్‌గైడర్ అనే పదునైదేళ్ల కన్య యూరప్ దేశంలో నిద్రపోతూ ఎన్నో గ్రంథాలు చదివిందట! అవిమయూ లన్నీ ఆమెకు జాగ్రదవస్థలో జ్ఞప్తికి ఉండేవి. ఆమె నిద్రపోవటం ప్రారంభిస్తే అదేపనిగా నిద్రపోతుంది. మసాచ్యుసెట్సులో 'స్లైక్' వైద్యశాస్త్రజ్ఞానికి పరిశోధనార్థం ఆమెను ఒప్పజెప్పితే ఇదమిత్థమని తేల్చలేక అతని మతి పోయిందని వార్తాపత్రికల్లో ప్రకటితమైంది. అమెరికాదేశంలో ఒక ప్రసిద్ధరచయిత నిద్రలోనే స్వకపోలకల్పితాలైన అనేకగ్రంథాలను 'టైపు' చేసివేసేవాడట! నిద్రలేచి చూస్తే, అవి తనవేనా అనే అనుమానం అతనికే కలుగుతుండేది. అటువంటి నిద్రాసమయంలో అతను పూర్వం భావించిన రూపకాలల్లోని పాత్రలు కంటిముందు కనబడించి వాటి సంభాషణలు అవి చేస్తుంటే అతని రచన అయిపోతుండేదని స్వాన్సు విశ్వవిద్యాలయతత్వోపాధ్యాయుడు హీత్ ఒక ఉపన్యాసంలో పేర్కొన్నాడు. నిద్రపోతూ అనేకమంది నడవటం ప్రపంచంలో సర్వసామాన్యమైన నిద్రావైచిత్ర్యం.

నిత్యమూ ఎన్నిగంటల నిద్ర అవసరమనే విషయంలో భిన్నాభిప్రాయాలున్నవి. నెపోలియను చక్రవర్తి 'పురుషునికి ఆరుగంటలూ, స్త్రీకి ఏడు, బుద్ధిహీనుడికి ఎనిమిదిగంటలూ నిద్ర చాలు'నని పలికినట్లున్నది. కాని, వాటర్లూ యుద్ధంతరువాత 'హెలీనా'లో ప్రతినిత్యమూ తొమ్మిదిగంటలకు పైగా ఆయన దీర్ఘనిద్ర పొయ్యేవాడు. బిస్మార్కు, హంబోల్టు, చర్చిలు వంటి కొందరు ప్రతిదినం నాలుగైదుగంటలకంటే నిద్రపోని విఖ్యాతులు కనిపిస్తున్నారు. వలబడి ఎనిమిదిగంటలు తీక్ష్ణమైన కృషి చేసిన తరువాత ఎనిమిదిగంటల నిద్ర చాలునని ఎడిసనాయన

శయుని అభిప్రాయ మొక టున్నది. నిద్ర అసలు అవసరము లేదనే నమ్మకంతో హార్వర్డు శ్రమపరిశోధ నాలయానికి వచ్చిన ఒక యువకుడు రెండువందల ముప్పది ఒక్కగంటలు మేల్కొని తరువాత బాధపడి నాడు. మనసు అస్తావిస్తావ పడినది. నిద్రాకాల నిర్ణయము దేశకాలవయోనుకూల మని చెప్పవచ్చు. పసిపిల్లలకు పదహారుగంటలకాలం తప్పక కావాలి. కొందరికి నాలుగైదుగంటలు చాలు. పద్మినీజాతి స్త్రీ జాముకంటె విస్తారం నిద్రింపదని మహాకవి కాళిదాసు పలికినాడు. కాని వైద్యశాస్త్రజ్ఞులు ఇటువంటి నిద్రను అంగీకరింపరు. ఎనిమిదిగంటలు నిద్రపోవలసి ఉంటే ఆరుగంటలకు తగ్గించుకోవటంవల్ల 'కలో రిక్ శక్తిని పాతికపాళ్లు విస్తారంగా ఉపయోగించ వలసి ఉంటుందని వారి నిర్ణయం. ఇలా తగ్గించు కోవటంవల్ల చర్మవ్యాధులూ, నిస్సత్తువా, మనో మాంద్యమూ కలుగుతుందని వారి తీర్పు.

పరిశోధింపవలసిన అంశాలలో నిద్రను అతి ప్రధానమైన దానినిగా శాస్త్రజ్ఞులు పరిగణించారు; పరిశోధనలు సాగించారు. ఒక్క అంశమూ ఇద మిత్థమని నిర్ణయంకాకపోవటంవల్ల ఒక శాస్త్రజ్ఞుడు అన్నాడు: 'మా పరిశోధనల ఫలితాంశము రాత్రి శయ నించి ఉదయం మేల్కొంటమే' అని. నెబ్రస్కా విశ్వవిద్యాలయంలోని వైద్యకళాశాలలో 'జహార్' అనే ఆచార్యుడు నిద్రను గురించి పరిశోధించి కొన్ని విశేషాంశాలు ప్రకటించాడు. 'ఆధునిక ప్రపంచంలో నిద్ర పట్టనివాళ్లు విశేషంగా కనిపిస్తున్నారు. వాళ్లు రెండు జాతులు. శాంతియుతమైన నిద్ర కావాలని కోరుకుంటే పిచ్చివాళ్లూ, జబ్బువల్ల బాధపడేవాళ్లూ. నిద్రనుగురించి ఆలోచిస్తూ వేళ తప్పించుకునే వెర్రి వాళ్లు మొదటి జాతివారు. వయస్సు మళ్లిన వాళ్లలో నిద్రపట్టక పోవటానికి వాళ్ల చిన్నతనంలో తల్లి దండ్రులు బలవంతపెట్టి నిద్రపుచ్చటం కారణం. నిద్రపోవ మని మనస్సును అటువంటి స్థితిలోకి తీసుకో వచ్చే యత్నంగాని, శారీరకశ్రమగాని మంచిది కాదు. 'జంతువులు త్వరగా చనిపోవటం క్రమమైన నిద్ర లేకపోవటంవల్లనే' అనీ, 'నిద్రావస్థలో కళా శాలా యువకులు ముప్పదిఎనిమిది మార్లూ, మధ్యవయస్కు వారు ఏబదిమూడు మార్లూ, మధ్యవయస్క స్త్రీలు ఇరువది ఎనిమిదిమార్లూ కదులుతారు' అనేవి ఆయనపరి శోధితాంశాలలో కొన్ని.

తల్పంమీద చేరి సున్నితంగా సుఖనిద్రపోవటం కంటే అదృష్టవంతుడికి మరో సుఖక్షణం ఉండదు. క్రమంగా అలసిపోయిన అవయవాలు ఇక కష్టపడ టానికి ఇష్టపడలేక విశ్రాంతిపుచ్చుకునే యత్నం ప్రారంభిస్తవి. మొదట ఘ్రాణశక్తి, తరవాత రసనా లుప్తమౌతవి. పిమ్మట స్పర్శజ్ఞానం నశిస్తుంది. దిక్జ్ఞానం తప్పిన మరుపటిదశలో మనస్సు పనిచేయటం మాని వేస్తుంది. జోషువాలోపెట్ అనే విజ్ఞాని నిద్రారంభ దశలో జీవితాంశాలు జ్ఞప్తికి రావటమూ, తరువాత కొన్ని కోరికలు కలిగి సౌందర్యాకాంక్ష, సుఖాభి లాషలు జనించటమూ, పిమ్మట భ్రమలు కొన్ని పుట్టి నిద్రముంపూ, తరువాత స్వప్నావస్థా ఏర్పడుతవని నిరూ పించినాడు. అయితే నిద్ర అందరికీ ఒకేరీతిగా కలగదు. కళాశాలవిద్యార్థులకు ఇరువదిఎనిమిదినిమిషాలూ, మధ్య వయస్సులోని పురుషులకు ఇరువదిఐదునిమిషాలూ కావాలట! స్త్రీలకు పదిమొదలు పదిహేనునిమిషాలు చాలునట! నిద్రలో కదిలితే కలతనిద్ర అనుకోటం భ్రమ. పసిబిడ్డలా నిద్రపోవటం పరమప్రయోజనకారి. 'మొద్దులా నిద్రపోతే ఎద్దులా పనిచేస్తాడు' అన్న సామెత విమర్శనపాలైంది.

వ్రతవిధానాలల్లో ఏకాదశినాడు పూర్ణజాగరం చెయ్యాలి మన్నట్లు కనిపిస్తుంది. దశమి ఏకభుక్తము, ద్వాదశి పూర్ణభోజనము — ఈ దినద్వయానికి మధ్య మాత్రమే పూర్ణజాగరణం చెల్లుతుంది. 'దివా సుప్తి ర్నకార్యాం తు జాగరా దతిమైథునాత్, బహుసంక్ర మణం నిత్యం రోధామూత్రపురీషయోః...' ఇత్యాది యోగకుండల్యుపనిషద్వాక్యాలవల్ల దివానిద్ర యోగ భంజక మని వ్యక్తమౌతున్నది. పాశ్చాత్యలోకంలో పూర్వరాత్రినిద్ర సౌందర్యసంవర్ధకమనే ప్రథ విని పిస్తుంది. అయితే కొన్నాళ్ల క్రితం టర్కీదేశంలోని అంకారావిశ్వవిద్యాలయవిద్యార్థిలోకం పగటినిద్రలో కొన్ని పరిశోధనలు సాగించి దానివల్ల విశేషప్రయో

జబా ఉన్నదని వెల్లడించారు. రాత్రినిద్ర మానవునికి పనికిరాదనీ, దీర్ఘనిద్ర నిష్ప్రయోజకమైందనీ వారి నిశ్చయం. పగలు ఒకమాటు మూడుగంటలూ, మరొకమాటు రెండుగంటలూ నిద్రకు అలవాటుపడితే మిగిలిన కాలమంతా శ్రమలేకుండా పనిచెయ్యవచ్చునని వారు సిద్ధాంతీకరించారు. వారి పరిశోధనలవల్ల రాత్రి పన్నెండుగంటలూ నిద్రపోయేవారికంటే పైవిధంగా నిద్రకు అలవాటుపడ్డవాళ్లకే ఎక్కువ విశ్రాంతి లభించిందట. పరీక్షాఫలితాలల్లోనూ 'పగటి నిద్రగాళ్ల'దే విశేషవిజయం! దివానిద్రవల్ల గర్భధారణం జరుగదు కనుక ఇది ఒక సంతాననిరోధకమార్గమని వారు మరొక ఉపపత్తికూడా చూపించారు. అయితే వీరి పరిశోధనాఫలితాలు ప్రకృతికీ, వైద్యశాస్త్రానికీ వ్యతిరేకంగా ఉన్నవి. వీరికి 'ఉలూకాలనే పేరు ప్రచురమైంది.

'నిద్ర సుఖ మెరుగదు; ఆకలి రుచి ఎరుగదు' అనే ఒకసామెత ఉంది లోకంలో. కాని శుభశయ్యకూ, సుఖనిద్రకూ సన్నిహితమైన సంబంధం ఉంది. అందుకోసమనే శయ్యాసౌఖ్యం మెరిగిన నెపోలియను 'జగత్తులోని సమస్తసింహాసనాలిచ్చినా ప్రతిగా నా శయ్యను విడిచిపెట్టలే' నన్నాడట! 'మనం శయ్యలో జన్మించాము, శయ్యలోనే రోదించాము, శయ్యలో సుఖించాము, శయ్యలో మరణిస్తున్నాము. మానవుని సుఖదుఃఖాలకూ శయ్యకూ ఇంత సన్నిహితసంబంధం. సమయాసమయాల్లో శయ్యావిధానం మార్పుపొందినా శయ్య అనేది తప్పదు. ఉత్క్రాంతిసమయంలో భీష్ములవారికీ అంపశయ్య ఉండనే ఉంది. జగత్కారణుడు 'వటపత్రశాయి.' భారతీయచక్రవర్తులు 'సౌవర్ణ పట్టజ, కీటజ, అండజశయ్యలను' నిర్మించుకున్నది శయ్యాప్రాధాన్యాన్ని గుర్తించినవారు కావటంవల్లనే. నేటి ఛేంబర్లీనవంటి సౌఖశాయనికులను, వైతాళికులను వారు సృజించుకున్నారు.

నిద్రకు కొన్ని నియమాలు కనిపిస్తున్నవి మన వైద్యశాస్త్రాల్లో 'భుక్త్వా శతపదం గచ్ఛేత్ వామపార్శ్వేన సంవిశేత్' అనిసుశ్రుతము. దక్షిణపు తలాపి ఒక ధర్మం. నిద్రారంభదశలో సుఖశాయులైన అగస్త్య, కపిల, ఆస్తీకాది మహాపురుషుల స్మరణ ఆత్మాకర్షకమని మన నమ్మకం. ఆంజనేయమంత్రపఠనం చేస్తూ నిద్రపట్టించుకునే ఆంధ్రులు ఇంకా ఈనాడూ కనిపిస్తారు. కొందరు ప్రహ్లాదనారదపరాశరపుండరీకాదిచిరంజీవుల స్మరణ చేసి నిద్రిస్తారు. ఇందుకు కారణం అది మృత్యుతుల్యం కావటమే. అందువల్ల పాశ్చాత్యులలో కాలల్లోనూ థామస్ ప్రౌన్ వంటి ఆస్తికుడు 'భగవత్ప్రార్థన లేకుండానే నెప్పుడూ నిద్రపోను' అని పలుకుతాడు. నిద్రమేల్కొనేటప్పుడు 'వామనస్తుతి' పఠనము చేయటం రాయలనాటినుంచో, అంతకు పూర్వంనుంచో వస్తూవున్న అనూచానమైన ఆచారం. 'ఇంతింతై వటు డింతయై మరియు దా నింతై' త్రిజగాలు నిండినవాడు వామనుడు. అయనను స్తుతించటం మానవుడూ అలా పెరుగుతాడనే నమ్మకంవల్ల కావచ్చు. పొడుగెదుగటానికీ, నిద్రకూ సన్నిహితసంబంధ మున్నదని శాస్త్రజ్ఞులు అంగీకరించారు. ఆర్థరు రేనాల్డు—ఒక పరిశోధకుడు నూరు దినాలు నిద్రపోకుండా విద్యార్థులను నిలపటంవల్ల వారు అరఅంగుళం తగ్గిపోయినారని ఒకచోట వ్రాశాడు. సీల్ ఓహోర్ అనే శాస్త్రజ్ఞుడు 'నిద్రాసమయంలో మెదడు చిన్నదౌతుంది, శరీరం పెద్దదౌతుంది' అని వ్రాశాడు. నిద్రలేచేటప్పుడు ఆవలిస్తూ చిటిక వేయటమూ ఆర్యసంప్రదాయము.

కళాకారులను నిద్రాసౌందర్యము ఆకర్షించింది. శిల్పులు నిద్రాముద్రితులైన దంపతులలో కానీ, యోగనిద్రాముద్రితులైన మహామూర్తులనూ శిల్పించారు. లిచ్ ఫీల్డు కెతిడ్రల్ లోని 'నిద్రాదంపతుల' శిల్పఖండమూ, 'ధ్యానబుద్ధ' ప్రజ్ఞాపారమిత ప్రతిమాశిల్పములూ ఇందుకు జగద్విఖ్యాతి నిదర్శనాలు. మహాకవులు ఎందరెందరు నిద్రాసుందరులను వర్ణించినారు. విఖ్యాతరచయితల అమూల్యకల్పనావిన్యాసాలకు నిద్రావస్థ ఉపోద్బలకమైంది. ఆస్థితిలో మనోవయవాలతో దర్శించిన అనేక సంఘటనలనే వారు కావ్యోక్తం చేశారు. పురాణకవుల కృతిపతులలోని దేవతామూర్తులు వారికి నిద్రాసమయంలోనే దర్శన మిచ్చి కావ్యకన్యకలను అర్థించారు. 'జోల', 'లాలి' ఇత్యాది నిద్రాసాహిత్యశాఖ వృద్ధిపొందింది. వైతాళికగీతికాసాహిత్యంమాట చెప్ప

# సాంధ్యరాగం

(ఏకాంకిక)

'కుమారదేవ'

[తోట—ఒక గది.

అందలి పరికరాలు—సోఫా, ఈజీచేర్, ఒక టేబిలు, కుర్చీ.

సమయము—సాయంవేళ, లేక ఏదో ఒక వేళ.

—అతను, ఆమె చాలరోజులు గృహస్థాశ్రమంలో సంతోషంగా కాలక్షేపం చేసినవారు. అతనికి నలభై ఏండ్లుంటుంది. అందగాడే. బాగా ఆటపాటలలో ఆరితేరినవాడుగా కనబడతాడు. ఆమె కూడ చక్కని సుందరి. కొంచెం ముక్కుమీద కోపం గలదనిపించినా నవ్వితే వెన్నెల కాచినంత సొగసున్నది.

గదిలో ఇటునటు ఆలోచనానిమగ్నుడై అతను పచారుచేస్తుంటాడు. తన ప్రపంచం భగ్నమైపోగా స్తబ్ధుడై గుండెబరువుతో వెలవెలబారిన మొగంతో ఉన్నాడు. ఇంతటి మహాకష్టము తనకు వస్తుందని అనుకోలేదాయన. వచ్చిందింత కష్టము. సిగరెట్టు ముట్టించేదానికి యత్నిస్తాడు......అవనీ తనచేత కాలేదు......మాట్లాడబోతాడు......మూకీభావం పైకొంటుంది. ఆమెవైపు భయంతో చూస్తాడు...

ఆమె సోఫాలో కూర్చొని, కాలిమీద కాలేసుకొని వేళ్ళను రెండుచేతుల్లో చేర్చిపట్టుకొని ఎక్కడో దూరంలో చూస్తూఉన్నది. ఆమెలో అందగత్తెలకందరికీ మామూలుగా ఉన్న లక్షణాలన్నీ ఉన్నవి. గోరంతల్ని కొండంతలుగా చేసి చెప్పే లక్షణం ఆమెలో ఉన్నట్లు స్పష్టంగా తెలుస్తుంది. "అయ్యో, దైవమా!" అని ఏదో అనబోతూంటే తెర తీయబడుతుంది.]

అతను—(ఆమెదగ్గరికి వెళ్ళి) నిజంగా పోతావా!

ఆమె—(పండ్లు అదిమిపెట్టి) పోతాను, తప్పకుండా పోతాను.

అతను—(జంకుతో) పదైదేండ్లు నాతో కాపురంచేసి కూడా—

ఆమె—(నోరు చప్పరిస్తూ) ఔను. పదైదేండ్ల జీవితమంతా నన్ను పాడుచేసినావు. పదైదేండ్లపాటిగా నాపైన ఇసుమంత ప్రేమకూడా లేని మగవానితో కాపురం—!

అతను—(గిరుక్కున తిరిగి, వినయంతో) అదిగో, మళ్లా ఆమాటనొద్దు. అంటే అది కల్లమాట. ఆత్మసాక్షిగా నిన్ను ప్రేమించినట్లు లోకంలో నేనెవ్వర్నీ కూడ ప్రేమించి యెరగను.

ఆమె—అదిగో, అదే, అమాటే. ఆత్మసాక్షిగానే నన్ను ప్రేమించినావు. (పెదవులు వణకుతుంది.) ఊఁ!... నేను లేదన్నా. నిజమే. అడిగింది స్త్రీని. ఎంతో నయంగా నాయందు వదచుకొన్నావు. అంతమాత్రంతోనే నది ప్రేమ చూపినట్లు...

అతను—(ఒకడుగు ముందుకువచ్చి) ఛీ, నిన్ను తిట్టుతూ కొట్టుతూ ఉండలేదనా నీ యభిప్రాయం!

ఆమె—అవును. స్త్రీలకందరికీ అవి అప్పుడప్పుడూ ఉండవలసిందే అని నా యభిప్రాయం. అడిగిందంతా, అడిగినంతా, అడిగినప్పుడంతా ఇస్తే దానిలో రుచి లేదు. అన్నిటికీ మీరు నన్నప్పుడప్పుడు

తిట్టుతూ కొట్టుకూవుండాలనే నా యభిప్రాయం. అడిగినవానిని ఇవ్వనంటూ ఏదో కలహం పెంచి నా మాట బూడిదైతేకి ఆపైనే మీరు ఇవ్వాలని నా యభిప్రాయం. ఇదే మీపై నాకు కోపం. ఇన్నేండ్లకూ నా కంఠమాత్రం అవకాశంకూడా ఇచ్చి నేను మీపై ఎప్పైనా కసితీర్చుకొనేదానికి చోటివ్వకుండా ఉండింది నాకు మీపై ఒకవిధంగా విసుగుపుట్టిందానికి కారణం అయ్యిందనుకుంటాను. మీరు ఆదర్శప్రాయులైన ప్రాణనాయకులని నేను ఒప్పుకొంటాను. అదే నా జీవితంలో చీదర కలిగించింది.

అతడు—(సంకటంతో ఆమెను చూస్తూ) నీకేదో కుటిలప్రకృతి కలదని నేను సందేహిస్తూ ఉండింది నిజమయ్యింది.

ఆమె—అయ్యో దేవుడా, ఇట్లకూడా నన్నన మంటారా! నాది విచిత్రప్రకృతి, పైశాచప్రకృతి! ఎన్నో ప్రకృతు లున్నాయి నాలో! అందుకే నన్ను సాంత్వనం చేయమంటాను. బుజ్జగింపు మంటాను! అంతే కాదు. నాపై అధికారం చేయమంటాను. యాజమాన్యం చూపుమంటాను. ప్రతివిషయంలోను నాచేతుల్ని కట్టేయమంటాను. అంటే అర్థమయ్యిందా—ప్రతివిషయంలోనూ నాకు స్వేచ్ఛ ఇవ్వకుండా అడ్డంకులు పెట్టూఉండవలెను. అట్టిపని మీరు చేయవలెను.

అతడు—(కోపంతో) నీ వేదో ఈ రోతకాలపు గయ్యాళిగంపలాగ మాట్లాడుతున్నావు.

ఆమె—(టోను మార్చి) నే నీకాలందాన్నే. ఈకాలంపడుచులంతా పిండి, నూరి, వెడిపి చేసిన రూపెత్తినదాన్ని. నాకు జీవితంలో ఉద్రేకం, ఉత్సాహం కావాలంటాను. ఒక్క నిమిషంకూడా విరామంలేని పను లుండాలంటాను నాకు. మూడు పూటలూ సినిమాలో, పాటకచేరీలో, నాటకాలో, నాట్యాలో కావాలంటాను. నాకూ అని చెప్పే ఒక్క గడియకూడా ఉండరాదు. (సోఫాలో ఇంకొకవైపు జరిగి, చిరునవ్వుతో) అంటే నేను చదివేటప్పుడు తప్ప—నా డైరీ రాస్తూంటేటప్పుడు తప్ప.

అతడు—అట్టి స్త్రీల ధర్మం దుస్థితి ఇప్పుడిప్పుడే నా కర్థమవుతున్నది. (సిగరెట్టుపెట్టె తీసి ఒక పెట్టుకుంటాడు.)

ఆమె—మీరు తిట్లాడుతారు. కళ్ళల్లో సరిపా లాడుకుంటారు. ఇష్టమొచ్చినచోట్లకు పోయివస్తారు. ఇరుగింటమ్మో పొరుగింటమ్మో కొత్తరకం చీర కట్టిందంటే ఆవైపు మహా పరిశీలనాదృష్టితో కండ్లు పెద్దవి చేస్తారు. కానీ, నే నెంత మంచిచీర కట్టినా, ఎట్టి దుస్తులు వేసుకొన్నా, ఏ స్నోలు పూసుకొన్నా, ఏ పూలు పెట్టుకొన్నా—చివరికి నోటికి లిప్‌స్టిక్కూ కండ్లకు కూలింగ్‌గ్లాసులూ వేసికొన్నా ఒక్కసారయినా మీరు మీభార్య అందచందాలు గమనించినారా? ఒక్క ప్రేమవాక్కు ఉచ్చరించినారా? ఊహూఁ—అసలు మనం వాస్తవపరిస్థితులు పరిశీలించి ఏదో తేల్చాల్సిఉంది. మనం జీవాత్మపరమాత్మలం కాము. మన జీవాత్మలకు ఐక్యం లేదు. ఎప్పుడూ ఉన్నదికూడా లేదు, ఇకపైకూడ ఉండదు. ఇది ఎంత తొరగా గుర్తిస్తే అంత తొరగా మన ఉభయులకూ మేలు.

అతడు—(చేతి నుండిన సిగరెట్టు మరల నోటలోనే ఉంచి, విచారంతో) ఇది నిజంగా నా దురదృష్టమే. (ఆమెను ఆర్తిగా చూస్తూ) ఏమి చేస్తావంటావు?

ఆమె—తీర్మానమంతా నాచేతేమీ లేదు... దైవికమాయావాయువృత్తములో తగుల్కొన్న శుష్కపత్రప్రాయులమైన మన జీవితాలు అన్నీ మన చేతుల్లో లేవు. విధి బలీయము.

అతడు—ఈనగరంలో అంతా తారురోడ్డే. సుడిగాలివీస్తే వృత్తాలు తెలియవు.

ఆమె—ఛ, ఛ! మీ రెంత పామరత్వంతో మాట్లాడుతున్నారు! నా యభిప్రాయాలు మీ కర్థం కాలేదు.

అతడు—(సోఫాపీటపై కూర్చొని ఆమెకు మూరుమొగము వేసి) ఆ తారును నేను పన్ను చెల్లించి నాను.

ఆమె—ఇదిగో, చివరేమి! (తిరిగి అతని చేతిపై తన చేతి నుంచి) ఈనడుమ నేను నా చేతిరేఖలను ఒక సాముద్రికశాస్త్రికి పంపినాను.

అతడు—(తిరిగి చూడక) సంతానం ఉందా లేదా అని తెలుసుకోవడానికేనా?

ఆమె—కాదు... అదివా క్లుప్తంగా అవనే చేస్తారు. ఈదినం ఆ శాస్త్రి నా భూతభవిష్యత్తులు వ్రాసిపంపినాడు. (ప్రక్కనున్న హాండ్ బాగ్ నుండి జాబు లాగి) నేను నన్ను పూర్తిగా తెలిసికోలేనివాణ్ణి పెండ్లాడినానట. జీవితమాధుర్యాల తీపెఱుంగని వట్టి—ఆ మాటలు నేను చదవకుంటే మంచిది. కాని మిమ్ముల్ను చూచినట్లు సంపూర్ణంగా వర్ణించినాడు.

ఆయన—(లేచి) సరే, బాగానే ఉంది.

ఆమె—ఆయనకి మీపైన ఏమీ ద్వేషం లేదు. చూడండి, నా జీవితం, జీవితసౌభాగ్యాలు బాగుపడాలంటే నాకోసం ఇంకా కాచియున్నట్టి ఒక 'శ్రీయుత కుల మును రూపును ప్రాయము శుభలక్షణంబు బాంధవ విద్యాశ్రేయములు' గలవాడు ఆత్మస్నేహితుడున్నాడట. ఒక సాయంవేళ - సంధ్యారాగవేళ అతన్ని నేను కలుసుకోవడం కలుగుతుందట.

అతడు—ఆ శాస్త్రి వాని ఉనికిమనుకుల విలాసం వ్రాసియున్నాడా?

ఆమె—లేదు......

(ఆయన లేచి సిగరెట్టందుకొంటాడు.)

ఎక్కడికి పోతున్నారు?

అతడు—కొరడా పట్టుకొని ఆ సంధ్యారాగములో ఒకసారి పరిభ్రమించివస్తా.

ఆమె—అంటే నా దెవడో దొరికితే కొట్టా మనా?

అతడు—ఆ నీ ఆత్మస్నేహితుణ్ణి ఒకసారి చూచివస్తామనే ఉన్నది. (జబర్దస్తీతో సిగరెట్టు ముట్టిస్తాడు.)

ఆమె—మీకు భావనాశక్తి లేదు.

అతడు—(కిటికీ తెరచి) నిజమే. నేను సత్యాన్వేషకుణ్ణి.

ఆమె—ఇదిగో, ఏ కొంత సంతోషమైనా నా జీవితంలో ఉండకూడదనేనా మీ యభిప్రాయం?

అతడు—(ఆమెవైపు చూస్తూ) నే నంత స్వార్థత్యాగమూర్తిని కాను. నా హక్కులను వదలను.

ఆమె—అవే. మగడనగా అతనికి భార్య సర్వ స్వామ్యసంకలితమైన వస్తువు, ఆస్తి. నేను మీ యింటికి అలంకరించుకొన్న ఒక వస్తువు నయినాను.

అతడు—అలంకారవస్తువంటే నే నెఱుగను.

ఆమె—(తియ్యని కంఠంతో) ఇదో చూడండి. మొన్న పార్లమెంటులో పాసయిన బిల్లుననుసరించి—నేను మిమ్ముల్ని ప్రేమింపలేదని రూఢిగా చెప్పి—ఇంకొకర్ని ప్రేమిస్తున్నానని మీకు ఋజువుచేస్తే నాకు విడాకు లిస్తారా?

అతడు—(ఖండితముగా) ఊహూం.

ఆమె—ఏల?

అతడు—ఈ కసుమాలపు చట్టాలు నే నేమాత్రం ఒప్పను. నేను పూర్వకాలపు పద్ధతులే మంచి వనేవాణ్ణి. ఈ విడాకులచట్టం తుక్కు అబద్ధమని చేయిస్తుందనే నా పూర్ణ విశ్వాసం. దైవికంగా జరిగే వివాహబంధాన్ని మానవులు విచ్ఛేదం చేసేవిధానం దేవతాపచారమే. (అటూ ఇటూ పచారుచేస్తాడు.)

ఆమె—దేవతాపచారమా! ఏదో కృతయుగం మాటలు. ఇది ఇరవయ్యోశతాబ్దంమధ్యకాలమనీ, మనకు సర్వస్వాతంత్ర్యాలు కలిగి దాస్యవిమోచన మయిన కాలమనీ ఎరగరు.

అతడు—మెళ్లో లుంగగట్టిన ఎద్దులా నుంటే వాడు పందెపుగుఱ్ఱాలతో పరుగులెత్తితే ఏం ప్రయోజనం?

ఆమె—అంటే నే నంత ముసలిదాన్నయినా నా క్రొత్తపెండ్లికి? మీ కొక పిచ్చి. అదుదానికి వయస్సెక్కడ కానుకాను ప్రేమబొమ్మలు చిక్కనవు తుంది క్రొత్తచోట. పదారేండ్ల పడుచుగోలకు బద్ధ లయ్యే గుండె కాఠిన్యం ఉంటుందా? పెండ్లయినాక పదేండ్లు కాపురంచేసి గంటకట్టిన గానుగెద్దులాగ

సంసారం గానుగను చుట్టిచుట్టి వస్తూ రోజురోజూ కూడు వండిపెడుతూ గుడ్డలు గుంజిస్తూ ఈజీవితంలో ఉంటే శృంగారమంతా వదులుకొన్న అడదా న్నడ గండి—ఎంత విసుక్కొంటుందో ఈలాంటి సంసార జీవాన్ని.

అతడు—(ఆమెను పరిహసించి) చూడు. ఒక సారి యాత్రపేరంతో ఊళ్లు తిరిగివస్తాం, రా. ఒక నెలపాటు తిరిగివస్తే నీ కీవగటు పోతుంది. పూర్వ లంతా అలాగే చేస్తూ యాత్రల పేరుతో సంతోషం పొందేవారు.

ఆమె—(నిర్వేదం చూపుతూ) బిడ్డలేరని రామే శ్వరమూ కాశీ క్షేత్రాలకు వెళ్లే పాతరికం సంపుల్లాగ నన్ను చేయాలంటారా ? ఇంత చేదస్తున్నా నేను పెండ్లాడినాను ?

అతడు—(మనస్సు చాల నొచ్చుకొంటూ, తీవ్రంగా) కొంచెం నీ వాగు దాగవా ?

ఆమె—స్త్రీ ఎదురుతిరిగి వగాకత్తి పైబడబోతుం దనే సంగతి తెల్లేమూ?

అతడు—నేను చేదస్తున్నా...(కండ్లుమూసుకొంటూ) అట్లాంటి ప్రేలుళ్లు......!

ఆమె—అమాటకేనా మీకొచ్చిం దింతరోషం?

అతడు—ఇంకా చెప్పు మరి...నీ...అ సాము ద్రికశాస్త్రవర్తకుడు ఇంకేం వాసినాడు?(ఇంకొక సిగరె ట్టెత్తుకుంటాడు)

ఆమె—ఇంకొంత: (చదువుతుంది) నీ భవిష్యత్తు ఇంక సంపూర్ణంగా మారిపోతుంది.నిన్ను ప్రేమించే వారిలోనూ సంపూర్ణంగా పరివర్తనం కలుగుతుంది. నీజీవితంపైన నీకుండిన విసుగు యావత్తూ పోతుంది. నీప్రేమనాయకుడు నీ కీనాటినుండి ఎంతో అనుకూల జీవితం కలిగిస్తాడు. (కాగితం మడిచి)......ఇంకా ఎన్నో ఆరీతిగా నా భవిష్యత్తు......

అతడు—(నిదానంగా) చెప్పు-చెప్పు-నీభవిష్యత్ భర్త వర్తమానవర్తనం బలేమాది రుంది.నా స్థనంగా నీకాలాటి మగ దుండాల్సిందిగా నేనూ ఒప్పుకొంటాను.

ఆమె—(అసహనంతో మంగా)నిజంగా నాకు మీరు విడాకు లిస్తారా?నన్నువదనాకలో,అ శృంగార సాంస్కృరాగంలో తేలిపోనిస్తారా?

అతడు—అ సాంస్కృరాగంలో నే నాతో నే నీకేల తెప్పతేలరాదు?

ఆమె—నేను నాజీవితంలో మీతో విసుగెత్తి నానని అప్పుడే చెప్పలేదూ?(చిరునవ్వుతో) అంతే కాదు. మీరు నేర్పలేని సరంగు.మీతో కూడ తెప్పలో రాలేను.

అతడు—(సిగరెట్టు ముట్టించి )ఎంతో దీర్ఘాలో చన చేయవలసిఉంది.

ఆమె— (ఈసడింపుతో) నే నన్నది అర్థ మయిందా?

అతడు—ఊ. ఒక తీరుగా అర్థమయ్యింది. నీ వన్నందులో తప్పులేదు. నీవన్నట్లు నాలో నీకు కావల సిన భావనాశక్తులు లేవని నాకు తెలుసు. కాని (కోపంతో) నన్ను చేదస్తునంటేమాత్రం సరిపోదు.

ఆమె—అది ఉపమానంకోసరం అన్నది.

అతడు—అవమానంకోసం.

ఆమె—అదంతా విడువండి. నేం చెప్పేది వినండి. మీరు మీక్లబ్బుల్లోనే రాత్రింబగళ్లు గడపండి. ఇంట్లో ఒక మలయాళంవాణ్ణి వంటకు కుదుర్చుకోండి. భార్య అంటే వండేందుకనే మీ అభిప్రాయంకదా! వండేందుకు, వడ్డించేందుకు ఒక మగవాడైతే క్షేమంగా ఉంటుంది. బాగా ఆలోచించండి. మీకు డబ్బూ మిగు ల్తుంది. నా బాధా పోతుంది. ఒకప్పుడెప్పుడైనా నేను జ్ఞాపకంవస్తే సిగరెట్లు కాలుస్తూ—'నేనే పోనిచ్చా నా పిల్లని. నేనే దాని జీవితంలో మార్పుపుట్టించి క్రొత్త జీవితం కల్గించినానని తలుస్తూ సంతోషించండి. ఎంత త్యాగంచేసిన ట్లౌను! పూర్వంలో భర్తల్ని పతివ్రతా మతల్లులు ఈలాగ పోనిచ్చేవారట. నే డీకాలానికి తగినట్లు భార్యల్ని పోనిచ్చే పుణ్యాత్ముల్లో మీరొకర్ల రౌతారు.

అతడు—(బాగా సుందెల్లోకి ఊపిరిపీల్చుకొని) అదా సంగతి! సరే, నీ ప్రోగ్రాములో నేను నిన్ను తలుస్తూ బోధిస్తుండాలనేనా?

ఆమె—వాస్తవంగా నన్ను మీరు పూర్తిగా మరువగలరా?

అతడు—ఆడవాళ్లకు—పెండ్లాలకు—సమత్వం ఇచ్చే మగళ్లకు ఆతిక్కడలో లేదాటుందు భార్యల్ని కొంతకొంత మరవాల—కొంతకొంత జ్ఞాపకం పెట్టుకోవాలనేనా? దానికి వాళ్లతో ప్రతీకారం చెయ్యాలా?

ఆమె—మీరనేది నాకు బోధపడలేదు.

అతడు—అంటే నిన్ను నీవడిగిన స్వేచ్ఛతో వదిలేస్తే నా జీవితంలో నిన్ను సంపూర్ణంగా తలతన్నడం వదిలేయవలసిందని.

ఆమె—(నిటారుగా నిలిచి) తలోదకాలా! మీకు నాపై నుంటే గాఢాంధ ప్రేమ మిమ్మల్ని ల్నాపని చేయనిస్తుందా! ఏ గడకీ లేక నన్ను పోనిస్తే ఒకవేళ తప్పుడు లేకుండా నేను మళ్లా వచ్చేస్తానేమో! మీ కోపం ఎంతసేపు! ఒళ్లో పండుకొంటాను, క్షమార్పణం చేసుకొంటాను. ఆవ్యాళ్లు నన్ను వదలి విరహవేదన పొందిన మీకు, ఆకాలవర్షం ఎండిన చేలకులాగా, ఎంతో మరిసిపోతారు!

అతడు—నీమాటే నీకు పరిపోతుం దనకుంటా. నేనుకూడ జీవితంలో కలిగిన విసుగువల్ల కొంచెం శృంగారం ఎక్కువ చేసుకుంటాను. నేనుకూడా ఆ సాంధ్యరాగంలో నాకాయాత్ర సాగించి క్రొత్త విశేషాలను కనిపెట్టి వస్తా. (ఆమె ముఖంలో వచ్చే మార్పులను చూస్తూ విడ్డూరంగా నవ్వును.)

ఆమె—(అతని చేతిని పట్టుకొని) పనికిమాలిన విడ్డూరం మానండి. ఈ వలపైనేండ్లవాణ్ణి ఏపిల్ల మెచ్చుకొని ప్రేమిస్తుంది?

అతడు—(పంతోపంతో బుజా లెగుర వేస్తూ) ఆసంగతి నాకేమీ బాగా తెలీయదు.

ఆమె—(పరామని) నిజం చెప్పండి, మీతో ఏ పడుచు లేచివస్తుందో?

అతడు—లేచివస్తుందని నే చెప్పలేదు, కాని...

ఆమె—(పెదవు లదిమి, లేచినిలిచి) ఎవ్వతది!

అతడు—(లేచి, వికటంగా) నీ కొత్తనా దెవదని నే నడిగినానా? ఊరకుండు.

ఆమె—వేళాకోళం చెయ్యొద్దండి. నిజం చెప్పండి. పోనీ, నే నెరిగిందేనా ఆ మనిషి?

అతడు—నీ కెందు కింత ఆత్రం? (లేచి బల్లపై ఫ్లాస్కులో నుండిన కాఫీ కప్పులో పోసుకొని నెమ్మదిగా త్రాగును)

ఆమె—నాకేమీ ఆత్రం లేదు. కాని, తెలుసుకొందామనే అడిగినాను. దాని వయ సెంతుంటుంది!

అతడు—(సోఫాలో కూర్చొని) ఈకాలంలో ఈ సొసైటీలో ఉండే ఆడువాని వయస్సు చెప్పడం నేర్చిన మగవాడే గొప్పవాడనుకుంటాను. వాటి మాటల చాకచక్యాన్ని బట్టి, నడవడిని మాటి, కనబడే అందచందాల ననుసరించి వయ స్సెంతని చెప్పలేను.

ఆమె—(ఆలోచనలో పడి) మీరు పనిచేసే ఆఫీసులో నుండే ఆ టైపిస్టుపిల్ల కాదు. అది చాలా లావు. పీపాలాగున్నది. లక్ష్మీకాంతమ్మ...! ఉండదు. అది బిడ్డల్ని విడిచి రాదు. మిమ్మల్ని కోరకునే ఆడది ఎవనీ నాకు తలంపుకు రాలేదు. మీవయస్సుకు తగిందీ ఏదీ కనబడదే?

అతడు—(సోఫాలో కాళ్లు చాచి పిరకంటితో ఆమెను చూస్తూ చిరునవ్వుతో) నే నెంత చాదస్తుడైనా, కావాలంటే ఆడవాళ్లు లేకపోలేదు.

ఆమె—(గిరుక్కున తిరిగి చూస్తూ) దయచేసి చెప్పండి. (బతిమాలుతుంది)

అతడు—చాదస్తుణ్ణయినాక ఇంకేమాటా నాకు సరిపడదు. పోనీ, కనుక్కొని స్టవరాదా?

ఆమె—దాని పేరు చెప్పరా!

అతడు—నేను చెప్పను. ఆపిల్లను మెచ్చుకొనే వాళ్లలో నే నొక్కణ్ణయి ఉండవచ్చును. కాని, నేను మాత్రం పరాయివాణ్ణి కా వాలిమను.

ఆమె—మీరు! నట్టి......

అతడు— (నవ్వుతు, న్యూస్ పేపరెత్తుకొని) ఉండవచ్చును. కాని నా కా నాటకం ఆ పేరెందుకు బాగా నచ్చును.

ఆమె—నా జీవితంలో చక్కని పరువమంతా మీ సేవలోనే వ్యర్థంచేసినానుకదా, మీ సౌకర్యాలు గమనిస్తూ! మీగృహాన్ని ఏచిక్కూ లేకుండా నడిపించి నానుకదా! ఈ పదిపదిహేనేండ్లకాలం మీ అనుకూలవతియైన పతివ్రతగా ఉండలేదా!

అతడు—అవును, ఉంటివి! ఈ ఉద్యోగానికివచ్చి బాగానే పనిచేస్తివి, నేను లేదన్లేదే!

ఆమె—అందుకేనా ఇన్నేండ్లయినపిమ్మట, నెమ్మదిగా, సిగ్గూ ఎగ్గూ లేకుండా, నెవరూ నీతీ లేకుండా—మీగుండె రాతిగుండెనుకుంటీ—ఈవయస్సులో మీ రింకొక ఆడదాన్ని ప్రేమిస్తానంటున్నారా? అబ్బా, ఇంత ద్రోహమా? ఇంత కృతఘ్నులా, మీరు! దేవుడంటూడా లేడా?

అతడు—సాముద్రికశాస్త్రానికి కర్మంతయింది!

ఆమె—(కోపంతో) అనవసరప్రసక్తి ఇప్పుడు మాట్లాడొద్దండి.

అతడు— (నవ్వుతూ, వికటంగా) అనవసర ప్రసక్తియా ఇది?

ఆమె—చెప్పండి. నా కిప్పుడయినా ద్రోహం చేసినారా లేదా?

అతడు—నీవిషయం అంత నీకు తెలియవలసి వచ్చిందా?

ఆమె—నే నడిగింది చెప్పండి! నాకు ద్రోహం చేసినారా లేదా?

అతడు—నీ హస్తసాముద్రికశాస్త్రపండితుడు వ్రాయలేదా నీ కాసంగతి?

ఆమె—లేదు. నే నంత సంకుచితహృదయం కల దాన్ని కాను. మరల అతనికి వ్రాసి దాని పేరు అడుగవలసిన పని నాకేమీ పట్టలేదు. (కొంచెం గద్గదిక స్వరంతో) అయినా మీరు నన్నీరీతి జారవిడుస్తారా? మిమ్మల్ని నేనెంతో శుద్ధచారిత్రులని గౌరవిస్తూండే దాన్ని. ఏకపత్నీవ్రతులని పూజించుకుంటూండే దాన్ని. నేను మీకు కళత్రమయినందుకు మాపుట్టిల్లు భాగ్యవంతమయ్యిందని గర్విస్తూండే దాన్ని. క్లబ్బుల్లో మీ పేరుంచి నన్ను ఫలానావారి సతిగారని పిలుస్తుంటే నా పేరే నేను మరచిపోయియుండిన దాన్ని. అట్టిసౌఖ్యం, గౌరవం ఇంకేమవుతుందో కదా (కన్నీరు విడుస్తుంది).

అతడు—(సిగపీల్చి నిదానముగా పలుకుచు) స్త్రీహృదయాన్ని గాని, దాని లోతుగాని తెలిసినవారే లేరన్నారు. కాని, మగవాడు ఒక్కమాటతో సాధించే అర్థాన్ని ఆడది రెండుమాటలతైనా తీసికుంటుం దా అర్థానికే.

ఆమె—ఇది బాగానే ఉంది. అనండి. అనండి. వట్టి మాటలతోరుకుని నన్నపహాస్యం చెయ్యండి. వద్దన లేదు (పరాముని తిరిగి అతన్ని చూస్తూ) మీ ప్రేమపాత్రమయిన ఆ మహా వనితారత్నం గారి పవిత్రమయిన నామాక్షరాలు ఒకసారి చెప్పి నన్ను ధన్యురాలినిగా చేయరా?

అతడు—ఊ......చెప్తాను. ఎప్పుడైనా ఒక దినం చెపితే పోతుంది. నీకు తెలియకుండా ఎట్లు పోతుందిలే!

ఆమె—(ఇంకా అతనిదగ్గరకు వచ్చి) పడుచు ప్రాయం దేనా, అది?

అతడు—నా కిప్పుడూ అట్లే కనపడుతుంటుంది.

ఆమె—అందంగానే ఉంటుందా!

అతడు—అంతకంటె అందకత్తె మరెవ్వరూ నాకంటికి కనబడింది లేదు.

ఆమె—బోసీ, బాగా చీరెపారెలు కట్టుతుందా?

అతడు—రమణీయంగా.

ఆమె—మిమ్మల్ని సంపూర్ణంగా ప్రేమిస్తుందా?

అతడు—ఆసంగతి మగవాని కెట్లు తెలుస్తుంది!

ఆమె—మీ రనుకొంటారా, ప్రేమిస్తుందనే?

అతడు—అట్లే అనుకొంటున్నాను, కొన్ని కొన్ని అవకాశాలు నాకు కలిగించాన్ని బట్టి.

అతడు—(బాగా గుండెల్లోకి ఊపిరిపీల్చుకొని) అదా సంగతి! సరే, నీ ప్రోగ్రాములో నేను నిన్ను కలుస్తూ పోవిడుస్తుండాలనేనా?

ఆమె—వాస్తవంగా నన్ను మీరు పూర్తిగా మరువగలరా?

అతడు—ఆడవాళ్లకు—పెండ్లాలకు—సమత్వం ఇచ్చే మగళ్లకు అతిక్కడలో తేడానుండు భార్యల్ని కొంతకొంత మరవాల—కొంతకొంత జ్ఞాపకం పెట్టుకోవాలనేనా? దానికి వాళ్లేదో ప్రతీకారం చెయ్యాలా?

ఆమె—మీరనేది నాకు బోధపడలేదు.

అతడు—అంటే నిన్ను నీవడిగిన స్వేచ్ఛతో వదిలేస్తే నా జీవితంలో నిన్ను సంపూర్ణంగా తిలతర్పణం వదిలేయవలసిందని.

ఆమె—(నిటారుగా నిలిచి) తిలోదకాలా! మీకు నాపై నుండే గాఢాంధప్రేమ మిమ్మల్నలా పని చేయనిస్తుందా! ఏ గడబిడీ లేక నన్ను పోనిస్తే ఒకవేళ చప్పుడు లేకుండా నేను మళ్లా వచ్చేస్తానేమో! మీ కోపం ఎంతసేపు! ఒళ్లో పండుకొంటాను, క్షమార్పణం చేసుకొంటాను. అన్నాళ్లు నన్ను వదలి విరహవేదన పొందిన మీరు, అకాలవర్షం ఎండిన చేనులాగా, ఎంతో మురిసిపోతారు!

అతడు—నీమాటే నీకు పరిపోతుం దనకుంటా. నేనూ నా జీవితంలో కలిగిన విసుగువల్ల కొంచెం శృంగారం ఎక్కువ చేసుకుంటాను. నేనుకూడా ఆ సాంధ్యరాగంలో నా కాలయాత్ర సాగించి క్రొత్త విశేషాలను కనిపెట్టి వస్తా. (ఆమె మొగంలో వచ్చే మార్పులను చూస్తూ విడ్డూరంగా నవ్వును.)

ఆమె—(అతని చేతిని పట్టుకొని) పనికిమాలిన విడ్డూరం మానండి. ఈ నలభైయేండ్లవాణ్ణి ఏపిల్ల మెచ్చుకొని ప్రేమిస్తుంది?

అతడు—(సంతోషంతో బుజా లెగురవేస్తూ) ఆసంగతి నాకేమీ బాగా తెలియదు.

ఆమె—(సరాసరి)నిజం చెప్పండి, మీతో ఏ పడుచు లేచివస్తుందో?

అతడు—లేచివస్తుందని నే చెప్పలేదు, కాని...

ఆమె—(చెవులు అదిమి, లేచినిలిచి) ఎవ్వతది?

అతడు—(లేచి, వికటంగా)నీ కొత్తదానెవడని నే నడిగినానా? ఊరకుండు.

ఆమె—వేళాకోళం చెయ్యొద్దండి. నిజం చెప్పండి. పోనీ, నే నెరిగిందేనా ఆ మనిషి?

అతడు—నీ కెందు కింత ఆత్రం? (లేచి బల్లపై ఫ్లాస్కులో నుండిన కాఫీ కప్పులో పోసుకొని నెమ్మదిగా త్రాగును)

ఆమె—నాకేమీ ఆత్రం లేదు. కాని, తెలుసుకొందామనే అడిగినాను. దాని వయ స్సెంతుంటుంది?

అతడు—(సోఫాలో కూర్చొని) ఈకాలంలో ఈ పౌడర్లలో ఉండే ఆడుదాని వయస్సు చెప్పనం చెప్పిన మగవాడే గొప్పవాడనుకుంటాను. వారి మాటల చాకచక్యాన్ని బట్టి, నడవడిని చూచి, కనబడే అందచందాల ననుసరించీ వయస్సింతని చెప్పలేను.

ఆమె—(ఆలోచనలో పడి) మీరు పనిచేసే ఆఫీసులోనుండే ఆ టైపిస్టుపిల్ల కాదు. అది చాలా లావు. పీపాలాగున్నది. లక్ష్మీకాంతమ్మా...! ఉండదు. అది పిల్లల్ని విడిచి రాదు. మిమ్మల్ని కోరకునే ఆడది ఎవరో నాకు తలంపుకు రాలేదు. మీవయస్సుకు తగింది ఏదీ కనబడదే?

అతడు—(సోఫాలో కాళ్లు చాచి కొరకంటితో ఆమెను చూస్తూ చిరునవ్వుతో) నీ వెంత భావస్తురాలైనా, కావాలంటే అనవాళ్లు లేకపోలేదు.

ఆమె—(గిరుక్కున తిరిగి చూస్తూ) దయచేసి చెప్పండి. (బతిమాలుతుంది)

అతడు—చాదస్తుణ్ణయినాక ఇంకేమాటా నాకు పరిపడదు. పోనీ, కనుక్కొని స్టనరాదా!

ఆమె—దాని పేరు చెప్పరా!

అతడు—నేను చెప్పను, ఆపిల్లను మెచ్చుకొనే వాళ్లలో నే నొక్కణ్ణయి ఉండవచ్చును. కాని, నేను మాత్రం పరాయివాణ్ణి కా నాబిడను.

ఆమె—మీరన్నట్టి......

ఆమె—(కోపంతో) అవకాశాలుకూడ దొరికిందా?

అతడు—కాను... నే నెప్పుడూ బడాయి కొట్టుకునేవాడను కానని నీ కెఱుంగవా?

ఆమె—మీ చరిత్రను కళంకితంచేసుకోవడం మీకు పరవాలే దనుకొంటూరా?

అతడు—ఆమె సంతోషానికై ఎన్నో విషయాలు త్యాగం చేస్తాను.

ఆమె—మీరెప్పుడూ నాతో అంత ప్రేమ సల్లాపాలు చేసినది లేదేం?

అతడు—నీ వెప్పుడూ నా కాయవకాశం ఇచ్చి చూచిందే లేదు.

ఆమె—(సోఫాపై కూలబడి ముఖం మూసికొని వెక్కి వెక్కి) నే నీవయస్సులో, ఈ సమయాల్లో కావాలనకుంటే మీ రట్లుండ గలరా!...ఎవ్వతో ఆ పాడుది, సంసారాల్ని నాశనంచేసేది!

అతడు—దాంతో పనేముంది? నీ శాస్త్రిగారు విడాకుల్లో ఉండే సంతోషాన్ని వ్రాసినాడు కదా?

ఆమె—(కోపంతో) ఏడ్చినాడులే. పోనీ, నన్ను మీ రెందుకు ఏదో ఇచ్చి చంపేసి దానితో సుఖంగా ఉండరాదు?

అతడు—ఆపని నే నెందుకు చెయ్యాలి! నీకు కావలసినది విడాకులు.

ఆమె—నిలపండి, మీ దప్పులు!

అతడు—ఆ పుణ్యాత్ముడు ఆ సౌంధ్యరాగంలో నీవు వస్తావని కాచుకొని ఉంటాడు.

ఆమె—నన్ను ట్లువ్యాసం చేయించి మీ రా అందకత్తెతో సుఖిస్తామని ఎత్తువేసినారా?

అతడు—ఆత్మలు కలిసే ఆకుది దొరికిందానికి నీ వేల కోప్పడతావు?

ఆమె—లేదు. కోపం లేదు. మిమ్మల్ని అని లాభంలేదు. నేనే ఇందు దోషిని. నేనే మిమ్మల్ని సంతోషపెట్టకుండ ఇంకొకదాని కాలవకాశం వదలేస్తిని. నేనే నాస్వార్థాన్ని ముందుంచుకొని ఏదయినా ఉద్వేగం కలిగించే విషయాల్లకై దేవులాడి మిమ్మల్ని మెప్పించలేకుండా ద్రోహంచేస్తిని.—ఇది ఆలోచిస్తే నాతప్పు పూర్తిగా కాదను కుంటాను. మీరే నన్ను ఇంటి వంటలక్కగా నుంచి అక్కడే వదిలేసినారు. నేను ఇరుగుపొరుగులతో కూడి సినీమాలకు పోతానంటే నన్ను వదిలేసినారు. వాళ్ళ సావాసం ఒకప్రక్క, ఆ పాడుసినీమా లొకప్రక్క స్త్రీలహృదయాల్ని పాడుచేస్తున్నవి. అవినీతికరంగా ఉండేవి నీతి నిచ్చేవని భ్రమ చూపిస్తూ అందు అవినీతికే ప్రాధాన్యం ఇచ్చి ఉంటారు. ఎందుకో, మీరుమాత్రం నన్ను ఒంటిగా పోనిచ్చి ఉండరాదు. మీరుకూడ నాతో వస్తుంటే ఆవిషయాల్ని అప్పుడప్పుడే విశదం చేస్తూ ఉండియుంటారు. నాకీ తప్పుడు తెలివి వచ్చి యుండదేమో!

అతడు—అప్పు డీశాస్త్రివి గాని—

ఆమె—ఆశాస్త్రి.. ఈ సాంకత్రిప్పి పత్రికల్లో ప్రకటనల్లో చూసి...

అతడు—ఆ నూతనవరమోవిలాసుని తలంపవల సిన పని...

ఆమె—ఆపాపిష్టిని నేను చూచిందిలేదు. ఆ పోకిరిశాస్త్రి నేడు నాకు వ్రాసినదానిలో చదివించే కాని మరేపాపం నే నెరగను.

అతడు—ఆ కాగితం తే.

ఆమె—(ఇచ్చి) ఇంక నే నీశాస్త్రిలుగాని, ఆపత్రికల్లో ప్రకటనలుగానీ చదవను.

అతడు—విడాకులో?

ఆమె—(ఏడుస్తూ) వద్దు. వద్దు. మీరే నాకు చాలు. ఇంకెవ్వరూ నాజీవితంలో ప్రవేశింపరు. నే నిక్కడే ఉండి మీ ప్రేమపాత్రురాలిని గమనించి ఆమె పద్ధతులనే నేనూ అవలంబించి మిమ్మల్ని నా ప్రేమ పాశాలతో కట్టివేస్తా.

అతడు—(నవ్వుతూ) నీ తెలివి తేటలలో ఉండే గొప్పని కేమం చెప్పుతుంటావా?

ఆమె—ఊ.

అతడు—ఆ మహిళారత్నం ఎవ్వరో గ్రహించ లేకపోయినావే, అదే విశేషం. స్త్రీలకు బుద్ధి పురుషులకంటే నాలుగింతలన్నారు. సమయానికి పనికి రాదేమో అది.

ఆమె—(మోకరించి, అతని పాదా లంటి) చెప్పండి మరి. చెప్పండి, ఎవ్వరా స్త్రీ! చెప్పండి. ఈహృదయవేదనలన్నీ పోతుంది.

అతడు—చెపితే ఇకమీద ఆదరిద్రపు పత్రికలూ, ఆ కసుమాలపు సినీమాలూ—ఆ ప్రకటనల్లో ఉంటే...

ఆమె—ప్రమాణంచేస్తాను మీపాదా లంటి.

అతడు—సరే,కూర్చో చెప్తా.

ఆమె—(కూర్చుంటుంది) చెప్పండి. ఆమె ఎక్కడుంటుంది?

అతడు—ఇక్కడే వస్తుంటుంది.

ఆమె—ఆఁ! ఇక్కడే వస్తుంటుందా? ఇక్కడేనా, నాయింటికేనా! నా మగన్ని వల్లో వేసి నాకు ద్రోహంచేసింది! పిల్లిముండ!!

అతడు—ఎన్ని పాట్లు చేస్తుంటావే. కాని, నాక అసు ఆమె నిజంగా, హృదయపూర్వకంగా, జగత్తులో లేనిదే అనుకుంటాను. నే నెవ్వరినైనా ప్రేమించి ఉంటే ఆ వ్యక్తి ఆమెతప్ప ఇంకొకరు కారు.

ఆమె—(ఆప్యాయంగా, అతని మెడను రెండు చేతులతో కలిపిపట్టుకొని) దాని పేరు చెప్పండి,చాలు.

అతడు—(ఆశ్చర్యముతో) ఇంకా నీకు తెలియ లేదూ?

ఆమె—ఆఁ! ఆఁ!! అంటే ఆ వ్యక్తి... నేనే అంటారా!!

అతడు—(ఆమె బుజాలపై చేతులు వేసి) ప్రమాణపూర్వకంగా.

ఆమె—(చేతులు వదలుకొని గబగబ పోయి సోఫాలో కూర్చొని అక్కడే ఆలోచనలో మునిగి ఉంటుంది కొంతసేపు.)

అతడు—(నెమ్మదిగా సమీపించును.)

ఆమె—(గంభీరంగా) మీ తెలివి బట్టే మగవారండీ!

అతడు—(ఆశ్చర్యముతో) ఏమీ కొత్తరకం!

ఆమె—(వికటముగా) మీరు చెప్పినట్లు మీకు నాపై అంత నమ్మకమూ, ప్రేమా ఉంటే నే నింక నిశ్చింతగా నాసంగతి, నాసంతోషం బాగా చూచుకోవచ్చును.

అతడు—(అట్టే స్తబ్ధుడై) ఆఁ! (నోరు మూయక కొంతసేపు దిక్కరిమాపులు చూచును.)

ఆమె—ఈ విషయం నాకు బాగా తెలియాలనే మిమ్మల్నింత పరీక్షించడానికి ఆ స్త్రీ సమాచారం చెప్పినాను. సాంఖ్యరాగం ప్రసక్తి, అందు తెప్ప లేదే సంతోషం చెప్పినాను.

అతడు—అంటే, నన్ను కుంతగా చేసినా వింత నేర్పా!

ఆమె—మగవాణ్ణి కొంచెంకొంచెం సతాయించకుంటే ఆడదానికి అతనిపై విసుగొస్తుంది.

అతడు—అబ్బ!! ఏడిపించేసినావే!

ఆమె—నేనా ఏడిపించినా? సరే, వేళయింది, క్లబ్బుకు. లేడీ మహిళాసభలో ధర్త్యతీకరణము అనే విషయం చర్చిస్తారు. పోతున్నా. (అతని దగ్గరకి వచ్చి చెంప కొంచెం పుణికి) కోపించుకోవకండి. అదో మీ సాయంకాలం పేపరు, అదిగో మీ సిగరెట్లు!! నేను లేనని మీరు అసలో చేఅసుకోరు. (వెళ్లును.)

అతడు—ఇదా, సాంఖ్యరాగం! (అట్టే చూస్తూ మెడ గోక్కుంటూ నిలుచుండును)

(తెర)

# సర్వస్వాతంత్ర్యము

శ్రీ గర్భాం అప్పారావు

సర్వస్వతంత్రుడు దేవుడు. సర్వస్వతంత్రదేశము త్రిగుణాతీతమై నిరంజనమై లోకాతీతమై ప్రకాశించు ప్రదేశము. ఈ రెండును మన భౌతికశరీరమునకు దుర్గమములు. కలుషితముకాని యాత్మయే యా రెంటితో సైక్యమొందగలదు. స్వాతంత్ర్యమని చెప్పుకొనదగిన దీలోకమున దుర్లభము. సర్వస్వతంత్రుడగు దేవుని సేవించుట సర్వస్వాతంత్ర్యమునకు మూలము. మానవసేవయే దేవుని సేవ. మానవసేవ చేయుటకు సంఘమున కలిసియుండవలెను. ఎప్పుడు మనము సంఘమున చేరితిమో అప్పుడే స్వేచ్ఛకు సంతరాయము కలుగును. సంఘమే కాదు, ఒక్క వ్యక్తితోనైన చేరినచో స్వేచ్ఛకు భంగము కలుగును.

స్వతంత్రు డెట్టివాడు? స్వాతంత్ర్య మన నేమి? ఈ పదనిర్వచన మసాధ్యము. దీని పర్యాయపదములు కూడ దీని భావమును వ్యక్తీకరింపజాలవు.

"స్వతన్త్రోஉపావృతః స్వైరీ స్వచ్ఛన్దో నిరవగ్రహః" అని అమరము. స్వతంత్రః = తానే ప్రధానముగా గలవాడు; స్వైరీ=స్వేచ్ఛావిహారి; స్వచ్ఛందః= స్వకీయమైన అభిప్రాయము గలవాడు; నిష్క్రాంతః = అడ్డుపాటునుండి దూరమైనవాడు. స్వతంత్రశబ్దమునకు గల పర్యాయపదము లిన్నియు పరిశీలింపగా ఇతరుల యొత్తిడి యేమియు లేక ఎవని కిష్టము వచ్చునట్లు వాడు ప్రవర్తించుటకు గల శక్తియే స్వేచ్ఛ యని తేలుచున్నది. స్వతంత్రుడనని చెప్పుకొనెడి ప్రతివ్యక్తియం దీభావమే నెలకొనియున్నది. 'గాలి స్వేచ్ఛగా విహరించుచున్నది. అట్లే నేనును స్వేచ్ఛావిహారినే' యని యొకడు పలుకవచ్చును. కాని గాలియొక్క విహారము కూడ సూర్యుడు, సముద్రము, ఎడారులు, శీతోష్ణస్థితి మున్నగువానిపై నాధారపడియున్నది. ఇట్టి స్వేచ్ఛ సంఘమునకు దూరమై పర్వతారణ్యవాసము చేయుటచే ననుభవింపవచ్చును. కౌపరు (*Cowper*) పండితుడు రాబిన్‌సన్ క్రూసోచే—

*"I am monarch of all I survey*
*My right there is none to dispute*
*From the centre all round to the sea*
*I am lord of the fowl and the brute."*

—'నా దృక్పథమందుండు సర్వమునకు నేను ప్రభువును. నా సర్వస్వామ్యమునకడ్డుతగులువాడు లేడు. కేంద్రమునుండి సాగరపర్యంతము పశుపక్ష్యాదులకు నేను ప్రభువును.' అని పలికించెను. కాని రాజ్యపరిపాలన చేయు రాజున కెంత బాధ్యత కలదో శ్రమ యెంతయో, తాను పరిపాలించు ప్రజలపై నెంత యాధారపడవలెనో గుర్తింపలేదు.

*'Uneasy lies the head that wears a crown.'*

—కిరీటము ధరించిన ఉత్తమాంగమునకు శాంతి లేదు అని షేక్స్పియరు మహాకవి నుడివెను. అయితే క్రూసో మానవులకు ప్రభువుగా చెప్పుకొనలేదు. పశుపక్ష్యాదిజంతువులకు ప్రభువు. అప్పటకూడ క్రూర జంతుభయ మతని కుండకపోదు. స్వేచ్ఛావిహారమునకు భంగకరమే. ఇతరుల యొత్తిడి లేనప్పుడే తన కిష్టము వచ్చినట్లు ప్రవర్తింపవచ్చును. ఇట్టి యేకాంతజీవితము సాంఘిక బలముపై నాధారపడవలసివచ్చును. అదియు గాక ఏవ్యక్తి కావ్యక్తి స్వతంత్రజీవితమునకై యొకరి కొకరు దూరముగా నివాస మేర్పాటుచేసికొన్నచో నీ భూతలప్రదేశమున తావు చాలదు. ఇట్టి స్వేచ్ఛ స్వాతంత్ర్య మనిపించుకొనదు. స్వేచ్ఛావిహారి, సర్వేంద్రియములకు బానిస.

వీరు స్వతంత్రులు, వీరు పరతంత్రులు అను పలుకులు సంఘమందలి వ్యక్తులనుగూర్చియే వచ్చును కాని ఏకాంతవాసులగూర్చి చెప్పనవసరము లేదు. ఒకని సౌశీల్యము, సద్గుణములు సంఘమందే ఎన్నబడునుగాని ఏకాంతవాసునియం దెన్నబడవు. 'ఒకడు మంచివాడో, చెడ్డవాడో సంఘమందున్నప్పుడే తేటపడును. విశ్వామిత్రుడు ఏకాంతవాసియై యున్నప్పుడే యింద్రియనిగ్రహము, ఏకాగ్రతయు సాతనియం దుండెనేమో· మేనక ప్రత్యక్షమగునపటికి అవి సడలిపోయెను. బలి శిబి, కర్ణాదుల దానగుణము సంఘవ్యక్తులయందు వినియోగింపబడుటచే ప్రకటితమైనవి కాని ఏ పర్వతారణ్యములందో వారు నివసించియున్నచో నెవరికి నుపకరింపక యట్లే జీర్ణింపబడియుండును. సంఘమందున్నప్పుడే ధనము—కాంత—అధికారము మున్నగు వానిచే నాకర్షింపబడక ఋజుమార్గమున ప్రవర్తించుచు పరోపకారధురీణుడై యున్నవాడే సత్పురుషుడును, స్వతంత్రుడును. ఏకాంతజీవి స్వేచ్ఛావిహారియే. స్వతంత్రుడు కాడు. అట్టి స్వేచ్ఛకు ప్రాకులాడుట స్వాతంత్ర్యమును పోగొట్టుకొనుటయే. శాస్త్రవిరుద్ధమైన స్వేచ్ఛ విసుగుదలను కలిగించును. పారతంత్ర్యమున్నప్పుడే స్వాతంత్ర్యము ప్రకటితమగును. సాంఘిక నిబంధనాతిక్రమణ చేయు జీవనము విసుగుదలయు, చులకదనమును కలిగించును.

ఇక రూసో (*Rousseau*) అను ఫ్రెంచిపండితుడు 'మానవుడు జన్మతః స్వతంత్రుడు కాని తరువాత సర్వత్ర శృంఖలాబద్ధుడే' అని వ్రాసెను. కాని మానవుడు జన్మతః శృంఖలాబద్ధుడు. 'కొన్ని చోటులను క్రమేణ స్వతంత్రత నొందుచున్నాడు' అని చెప్పవచ్చును. ఏజంతువైన జన్మింపగానే దానిని ప్రమాదమునుండి కాపాడు శక్తి తల్లికిని, కొంతవఱకు తండ్రికిని కలదు. ఈవిషయము ముఖ్యముగా పశుపక్ష్యాదులందు గమనింపవచ్చును. చీమలు మొదలగు పిపీలికములు సంఘములే యేర్పాటుచేసికొన్నవి. మొదట మానవులలో తల్లిదండ్రులందే యధికారోత్పత్తి కలిగినది. పిల్లల పోషణ, రక్షణ తల్లిదండ్రుల యధీనమై యుండుటచే పిల్లలు వారికి విధేయులై యుండుట సంఘవించినది. ఒకవేళ బిడ్డ స్వేచ్ఛగా ప్రవర్తించునట్లు కనబడినచో నట్టి స్వేచ్ఛనుండి తల్లిదండ్రులు మరలించుటయు అప్పటికిని మరలనిచో దండించుటయు కలదు. రక్షణపోషణలకై తల్లిదండ్రులపై నాధారపడుటయు తటస్థించును.

'పుత్త్రభావ మస్వాతంత్ర్యమునకు నెలవు' అని భారతము. కాలక్రమమున కుటుంబములు విస్తరించి చిన్నచిన్న సంఘము లేర్పడి, శరీరబుద్ధిబలములు కలవాడు శత్రుభయమునుండి సంఘమును కాపాడుటకు సంఘనాయకుడుగా నెన్నుకొనబడుచుండెను. ఎప్పుడైన ఆ నాయకుడు పరిసరప్రాంతసంఘములవారినుండి కాపాడి శత్రువును పారద్రోలినచో వాని సత్యధిక గౌరవముతో జూచి వాని కనంతాధికారము లిచ్చివేయుచుండిరి. అట్లే రాజత్వము జనించినది. ఇట్టి యుత్కృష్టాధికారము రాగానే రాజు స్వతంత్రత వహించి రాజ్యము, ప్రజలు తనసొత్తుగా భావించెను. తానే రాజ్యమని పలికెను. ధైర్యసాహసములు గల వ్యక్తియు రాజునెదుట సాష్టాంగపడెడివాడు. రాజును ప్రత్యక్షముగా చూడరాదు. పరిపాలన ప్రజాంగీకారము లేనిదయ్యెను. బానిసరిక మన ప్రజాంగీకారము లేని పరిపాలనయే. ఇట్లు రాజులు నిరంకుశులగుట పాశ్చాత్యరాజ్యముల గుర్తింపబడినది. రాజులు స్వతంత్రముకాని స్వాతంత్ర్యము పతితముగా ప్రదర్శించి తమ స్వాతంత్ర్యములు కోల్పోయిరి. అచట మూడునాలుగు దేశముల రాజులు ప్రాణములనే కోలుపోయిరి. ఇటీవల రుమేనియా, ఇటలీ, యుగోస్లావియా, అల్బేనియా రాజులు పదచ్యుతులైరి. ఒకరాజు వైవాహిక స్వాతంత్ర్యమునకై రాజ్యము వదలుకొనెను. కాని ఆసియాఖండవాసు లిట్టి దాస్యవిముక్తికి విముఖులై జీవయాత్ర గడుపుచుండిరి. ప్రపంచమందలి ముఖ్యమతత్రయమునకు జన్మస్థాన మిదియే. ఇంతే ఎత్తైన పర్వతశ్రేణులు, మహానదులు, విశాలములగు సారవంతప్రదేశములు—ఇవి యవియననేల, ప్రకృతియొసగు సౌకర్యములలో ప్రధానస్థానము వహించియున్నదీ ఆసియాఖండము. అట్టి ఖండము నాటికి నేటికి ఒక్కతీరుగానే యున్నది.

నైపెప్పు పరదేశప్రభువులకు లోనగుటయేకాక ఇందలి కొన్ని దేశముల వా పరదేశప్రభువులు వేల కొలదిమైళ్ల దూరమం దున్న దేశములందుండి అనాయాసముగా పరిపాలింపగలిగిరి. దీనికి కారణము కష్టము లేని యుదరపోషణ. ఇది శీతోష్ణస్థితియను ప్రకృతి యొక్కయు లక్షణము. కాని యిపుడిపుడు పాశ్చాత్య ప్రజలవలె రాజ్యస్వాతంత్ర్యమునకు ఆసియావాసులు కూడ పాటుపడుచున్నారు. రాజ్యస్వాతంత్ర్యములు పొందుచున్నారు. అయితే రాజ్యాంతరంగిక స్వాతంత్ర్య మెంతవరకు వర్ధిల్లునో గమనింపవలెను.

పరస్పరాకర్షణశక్తి యొకటి కలదు. ఆ శక్తియే ప్రకృతియందలి ప్రతివస్తువునకు పరస్పరాధారమునకు హేతువు. గ్రహములు, నక్షత్రములు ఈయాకర్షణమాత్రముల ననుసరించియే తిరుగుచున్నవి. కవి నక్షత్రములను గాంచి "సర్వస్వాతంత్ర్యము గలిగి ప్రకాశించుచున్న"దని వర్ణించును. దానికి కారణము అవి ప్రకృతిమాత్రములకు విధేయత గలిగియుండుటయే. ఒక సభామంటప మున్నది. దాని మీది పంజరము స్తంభములపై నాధారపడియుండును. స్తంభములు దృఢముగా నిలిచియుండుటకుపై పంజరము యొక్క భారమే కారణము. అనగా పంజరమునకు స్తంభము లాధారము; స్తంభముల నిలుకడకు పంజర మాధారము. ఇది ఐకమత్యమువలన కలుగు బలమును సూచించును. పరస్పరసాహాయ్యము లేక మానవజీవితము దుర్లభము. కావున ప్రపంచోద్ధరణకు మానవుడు సంఘనియమములకు విధేయుడై సత్కర్మ నాచరించి మానవసేవ చేయవలెను. ఇందువలన తన విధి నెరవేర్చుటయు, తన జీవితయాత్ర సాగించుటయు జరుగును.

'నియతం కురు కర్మ త్వం
కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాపి చ తే
న ప్రసిద్ధ్యేదకర్మణః' (భ. గీత.)

—నీవు నియతమైన పని (కర్మ) నాచరింపుము. కర్మ చేయకుండుటకంటె చేయుటయే మంచిది. కర్మ చేయనిచో శరీరరక్షణ జరుగదు.

ఇదియే స్వాతంత్ర్యము. స్వార్జితాధికారము. ఈ విషయమే ఆంగ్లకవి టెన్నిసన్ (*Tennyson*) స్పష్టపఱచెను.

*'Self reverence, self knowledge, self control*
*These three alone lead life to sovereign power*
*Yet not for power (power of herself would come uncall'd for) but to live by law,*
*Acting the law we live by without fear;*
*And, because right is right, to follow right*
*were wisdom in the scorn of consequence.'*

పాదచారికాని బండికాని యింకెట్టి వాహనము కాని సర్వజనాదరణీయమగు బాటామార్గమున పోవుచో నష్టము చెప్పవా రెవరుండరు. ప్రయాణసౌకర్య ముండును. అదియే స్వతంత్రమార్గము. అది చుట్టు త్రోవ యని యొకడైన స్వతంత్రించి యింకొకత్రోవ త్రొక్కుచో నష్టము చెప్పవా రుందురు. ఒకనొకడుండు లుంకనే. వ్యక్తిస్వాతంత్ర్యముకాని, స్త్రీస్వాతంత్ర్యముకాని, దేశస్వాతంత్ర్యముకాని సెమకూడవలె నవిన నాయాసంస్థల నుండు తదితరుల ఆశయములతో పాటు అనుకూలప్రవర్తనమున నడుచుటయే ప్రధానము కాని ఒక బండికి కట్టబడిన ఎద్దును ఎనుబోతును వలె నుండరాదు. ఎద్దు ఎండకు లాగిన, ఎనుబోతు నీడకు లాగుచుండును. ప్రయాణాంతమువరకు రెండును పెనగులాడుచుండును. స్వతంత్రయాత్ర దీనికిని తటస్థింపదు.

దేవుడు మానవునికి బుద్ధి ప్రసాదించెను. కావున ప్రపంచస్థితి సరిగముగా నుండుటకై యాతడు బుద్ధి వినియోగించి కార్యాకార్యముల నెఱిగి యింద్రియనిగ్రహము గావించుకొని సత్ప్రవర్తనముల దగులొక్కనక బాటామార్గమున పోవుచు సర్వజనోపకారములగు కార్యము లాచరించుటయే దేవుని సేవ చేయుట. ఏపని చేయదగినది, యేది కూడదు అని తెలిసికొనుటకు సామాన్యమార్గ మొకటి గమనింపవలెను.

'ఒరు లేయువి రొనరించిన,
వరవర ! యప్రియములు తన మనంబున కగు శా
నొరులకు నవి సేయకునికి
పరాయణమ్ము పరమధర్మపథముల కెల్లన్.'

(భారతము)

ధర్మము, దానము, సత్యము, శౌచము, అహింస, శాంతి మున్నగు ధర్మములు పాటించుచు సత్కార్య మాచరించుటయే సర్వజనోపకారి యగును గదా. నిజమే. కాని ఇవి యాచరించుటలో పరిమితి యుండవలెను. మానవుడు మానవుడే, దేవుడు దేవుడే. మానవాతీతములగు కార్యము లొనర్చునా డీలోకముండే యుండదు. 'అతి సర్వత్ర వర్జయేత్' అను వాక్యము పాటింపవలెను. సత్యవాక్పరిపాలనకు, దానశీలమునకు, నహింసాతత్త్వాచరణకు పరిమితులు గలవు. సత్యపరిపాలనయం దతీతుడైన హరిశ్చంద్రునకు అతీతదానశీలమున బలిశిబికర్ణులకు అపజయమే కలిగినది. రాజ్యతంత్రవేది ధర్మరాజు ధర్మము సత్యము శౌచము అహింస మున్నగు ధర్మము లాచరించుటలో తులాదండ మువయోగించినట్లే యున్నది. అందుచేతనే జయశీలుడయ్యెను. రాజ్యప్రవృత్తి కదియే మార్గము. మఱియు సద్ధర్మములగు ధర్మమునకు అధర్మము, సత్యమునకు అసత్యము, శౌచమునకు అశౌచము అను విరుద్ధపదము లున్నవి. ఈ విరుద్ధపదము లన్నియు వ్యతిరేక పదములు (*negative terms*). అట్లుకాక హింస యను పదము ప్రధానపదము. తద్వ్యతిరేకము అహింస. దీనినిబట్టి చూడ హింస మొదటిది. అది సర్వత్ర వ్యాపించి యున్నదన్న మాట. శారీరకముగానో, మానసికముగానో హింసపొందనివాడు లేడు.

'హింస సేయనివాడు లే డీజగమున
నొక్కడైనను దమతము రొపేవట్లు
హింసతెరువున కడగల్గి యేగవలయు
నదియు చూపె యహింసనా నతిశయిల్లు.' (భార)

కావున దాని నేవ్యక్తికి చేయకుండుట అహింస. ఇట్టి యహింసాతత్త్వాచరణకు మితి బుద్ధిచే నిర్ణయించు కొనవలెను. అహింసాతత్త్వప్రచారమునకై సర్వము త్యజించి దేశదేశములకు భిక్షువులను పంపి ప్రజల నసంఖ్యాకములుగా తన మత మవలంబింపజేసిన బుద్ధభగవానుడుకూడ హింసాహారియే. (బుద్ధుని యవసాన కాలమం దీమాంసాహారాతీతమే యాతని మృతికొక కారణమైనది.) ఇట్లు దేనియందును అతీతము చూపరాదు. మహాత్ముని అతిఅహింసాతత్త్వాచరణయే యాతని హత్యకు కారణము. అవతారపురుషులగు శ్రీరాముడు, శ్రీకృష్ణుడు లోకహింసాకరు లగు రాక్షససంహార మునకు వెనుదీయలేదు.

శ్రీకృష్ణుడు అర్జునితో—
'పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే.'

అని పలికెను. దుష్టసంహారము హింస యని తలచి అహింసాతత్త్వమే మననము చేయుచో అమాయకులగు సత్పురుషులకు హింస కలిగించుటకు కారకులై యెక్కువ లోకాపకారము కలిగించినవార మగుదుము. మనము ఈ యహింసాతత్త్వమే పైకి ప్రదర్శించుచు శాంతిస్వభావము వహించుటయే మునిలి ముల కటికితనమునకు కారణ మయినది. 'అత్యధిక జ్ఞానం కంఠగతప్రాయం' బైబిలులో ఏడం ఈవులను (*Adam and Eve*) సృజించినతరువాత 'జ్ఞానవృక్షఫలము' తినగూడ దని ఆజ్ఞ అయినది. అది భుజించిన వారికి జరామరణములు కలుగుననియు సూచింపబడినది. సైతానుచే ప్రోత్సహింపబడి ఫలము భుజించిరి. తత్ఫల మనుభవించిరి. అని చెప్పబడెను. ఇట్టి జ్ఞాన మతీతమైతే మానవసంహారమరణము ధ్రువము. శాస్త్రజ్ఞా నెక్కువై ఆ జ్ఞానప్రదర్శన మొకరిని మించి యొకరు చేయుచున్నారు. అణువిచ్ఛేదనవలన కలుగు శక్తిచే బాంబు లుపయోగించి నగరముల నాశనము, ఉదజని బాంబులచే దేశముల నాశనము. ఇంకను ఈతరు (*Ether*) బాంబులచే బ్రహ్మాండము బద్దలై ప్రపంచకనాశనము కలుగకతీరదు. కావున ఏకార్యమందును అతీతము హానికరము. అహింస

పరమధర్మమే. కాని అతీతమగు అహింసను చూపిన నదియే హానికరము.

ఒక వ్యక్తి కానిసత్వమునుండి విడుదల పొంది నూతనవిగ్రహములు చేస్తుకొని వేషభాషలను సంస్కరించుకొన్నంతలో వానికి స్వాతంత్ర్యము వచ్చిపడదు. పరోపకారపరత్వము గలిగి సత్కార్యాచరణలో గలుగు నిడుములను ధైర్యముతో నెదుర్కొని జీవితము సాగించుట స్వాతంత్ర్య మనిపించుకొనును. అట్లే ఒక దేశము దాస్యవిముక్తి పొందగానే దేశనామము, నగరనామములు సంస్కరించుకొని వేషభాషలు మార్చి తనకు చేతనైన చట్టములు తోచినట్లు సృష్టించి నూతనవికాసము పొందితినని భావించుట స్వతంత్రభావము కాదు. దేశనాయకులందరు స్వాతంత్ర్యము సార్థకత నొందింపవలెను. వారు ధైర్యస్థైర్యములు కలిగియుండవలెను. రాష్ట్రపరిపాలకుల నిరంకుశత్వము, స్వార్థగుణము రూపుమాపవలెను. మోమోటమి పక్షపాతము ఎప్పుడు నిరూపింపబడునో అపుడే స్వాతంత్ర్య భంగము. నాయకుడు స్వార్థత్యాగి కావలెను. ప్రజాక్షేమము కోరువాడై ప్రజలకోరికలు తీర్చదలచువాడై తే ఆశ్రితులయందును, సహకారులయందును పక్షపాతము విడువవలెను. ఇట్టి ధీరుడై నాయకుడు ప్రవర్తించుటయే కష్టతరమే. అతడు విశ్వాసార్హుడైనను సహకారులు స్వార్థపరులై యాతనియందు విశ్వాస రాహిత్య మారోపింతురు. కావున దేశస్వాతంత్ర్యము నిజస్థితి పొందవలెనని ప్రభుత్వము నడుపువా రందరు స్వార్థత్యాగులై యుండవలెను. ఒకే నేరము చేసిన రాజకీయాపరాధులకు శిక్ష విధించుటలో తరగతులు పరిగణింపబడుచుండెను. మనువుకూడ తన ధర్మశాస్త్రములో ఒకే నేర మొనర్చిన బ్రాహ్మణునకు, క్షత్రియునకు, వైశ్యునకు, శూద్రునకు దండనవిర్ణయములో అగ్రవర్ణమువానికి స్వల్పశిక్షయు, శూద్రునకు అధికశిక్షయు శాసించెను. నిజముగా యుక్తాయుక్తజ్ఞాన మెఱిగి విద్యాజ్ఞానము కలిగినవానికే అధిక దండన యుండవలసినది. ఇట్టి వ్యత్యాసములు చూపక ప్రజలందఱికి సమానస్వాతంత్ర్యము, సమానహక్కులు కలుగునట్లు చేయు ప్రభుత్వమే దేశమునకు సర్వస్వాతంత్ర్య మాపాదింపగలదు. మోమోటమి, పక్షపాతము కూడదని కేవలము నిరంకుశత్వ మవలంబింప హానికరము. హిట్లరు యొక్క అతిస్వాతంత్ర్యభావము, యుద్ధము కూడదని మందలించుటకు వాని యనుచరులకు గల అతిభయము వారి ఘోరాపజయమునకు మూలమైనది. దుర్యోధనాదులను భీష్మాదులు మందలింప వెనుదీయుటయే వారి యపజయమునకు మూలము.

భీష్మాదులు ద్రౌపదీవస్త్రాపహరణమున—

"అభిజాత్యము గల్గి చావ, సతి, యం
తైయుండగా దుర్మదా
రభటిన్ గొల్చిన కీచ్చి తెచ్చి కటిక
స్త్రం బూడ్చి యొకానియా
సభలో నందు వసింపు మంచు దొడ యా
స్ఫాలింపగా జూచి, రా
జభయంబుం దిగ్రావి చూంకిదిదు
స్సార్థ్యం బనంజాలిరే?"

(పాండవోద్యోగము, తి. వేం.)

ఇట్లు ప్రజాశేయములకు విరుద్ధముగ దేశనాయకులు సహకారులయెడ ననుచరులయెడ మోమోటమి, పక్షపాతము చూపుటయు, ఆసహకారులాయాత్మజ్ఞులు బట్టి సర్వస్వతంత్రత ప్రకటించుటయు నాలోచింప వారు స్వతంత్రులు కాకపోవుటయే కాక యింద్రియములకు బానిసలని విదిత మగుచున్నది. 'రాజ్యాన్తే నరకం ధ్రువం' అను వాక్యము సార్థకమగును.

'పాడిగల్గిన నిహాలోకఫలము లెల్ల
జేకుటయు కాదు కీర్తియు జెందు బురుషు
ధరణి బొగడిత రెయింకాక బరగు నంత
కాలమును బుణ్యలోకంబు గల్గు సంద్రుం'

(భారతము)

దాస్యవిముక్తి పొందితిమని చెప్పుకొనుటకై దేశమందలి ప్రతివ్యక్తికి సర్వజనశ్రేయము ప్రధానలక్ష్యమై యుండవలెను. ఇది గుర్తించి ధర్మాధర్మ నిర్ణయము చేయవలెను. ఇట్టి ధర్మము ఇంటివద్ద ప్రారంభము కావలెను. కుటుంబస్వాతంత్ర్యమునకు వ్యక్తి

త్యాగము కుదురవలెను. వ్యక్తికి క్రమేణ స్వార్థత్యాగబుద్ధి వృద్ధిచెంది స్థిరమైనచో శాంతి నెలకొల్పినవారై దేశస్వాతంత్ర్యము చేకూర్చినవారగుదురు. ఇట్టి త్యాగబుద్ధి కలవానికి ఆత్మస్వాతంత్ర్యము కలిగి భగవదైక్యభావ్యత కలుగును. అతడే సర్వస్వతంత్రుడు.

'నిఃశుతితపమును నింద్రియనిగ్రహంబు
భూరివిద్యయును శాంతికి కారణములు
వాని యన్నింటికంటె మేలైన శాంతి
కారణము బోధ మెఱుగుట కారకేంద్ర.'

ఇట్టి శాంతి దేశమందు కలుగవలెననిన సర్వజన హృదయములందు స్వార్థత్యాగబుద్ధి కొలదియో, గొప్పయో యుండవలెను. అపుడు రక్షకభటులను, సైన్యమును, ఆయుధములను విసర్జింపవచ్చును. భద్రత నీయుజాలిన భద్రతాసంఘముల యవసరమే యుండదు. ఇట్టి భద్రతాసంఘములు అదివఱకుండిన స్వాతంత్ర్యమునకు భంగకరములు కాగలవు. ఏయతిక్రమణకారణమున ఒడంబడికలు, భద్రతాసంఘములు ఏర్పడినవో అట్టి యతిక్రమణ పూర్తిగా నశించునట్లు అలవాటుపడిన స్వాతంత్ర్యముయొక్క నిజతత్త్వము తేటపడును. దేవుని సేవయే సర్వస్వాతంత్ర్యమునకు మూలమనియు, మానవసేవయే దేవుని సేవ యనియు తెలుపబడెను. మానవశ్రేయముకొఱకు మన మొక సత్కార్యము చేసితి మనుకొందము. ఇట్లు చేయుటలో దేవునాజ్ఞ శిరసావహించితి మనియు, దేవు నను గ్రహము కలుగు ననియు, నసత్కార్యమొనర్చినచో దేవునికి కోపము కలుగుననియు భావ మిండవచ్చును. దేవు డొకడు పై అధికారిగా నున్నట్లు భావము కలదు కావున నిదియు నొకని సేవ చేయుటయే కనుక స్వాతంత్ర్యముగా పరిగణింపబోకపోవచ్చును. కాని యిట్టి సత్కార్యాచరణమున కలవాటుపడినచో కాలక్రమేణ దేవునధికారము భావింపబడక యంత్రరూపమున సత్కార్యాచరణ కుదురును. ఇందు బాహ్యాధికారము, కార్యాకార్యనిర్ణయము, కార్యాచరణాపేక్షము వికసము చెందిన వగును. ఇచట దేవుని ప్రభుత్వము నిరంకుశప్రభుత్వముకంటెను. కాని ప్రేమపూరితము. నిరంకుశప్రభుత్వము కాదు ఆత్మప్రభుత్వమునకు దారితీయును. ప్రతివ్యక్తియు సామూహాగ్రము, అనగా క్రిందినుండి మీదివఱకు నిరంకుశాధికారి కటాక్షబాణమునకు గురియై యుండును. ఆ బాణము మలికియే కానిండు, పుష్పమే కానిండు, ఏవ్యక్తి చేసిన పని కావ్యక్తియే పూచీ. కనుక వ్యక్తియందు సంచలనము కలిగి వ్యక్తిత్వము కుదురును. ఒక సత్కార్యము చేయ యాచరింపవలెననిన "అది సత్కార్య"మనుకొను బుద్ధి స్థిరము కావలెను. అదియే నిష్కామకర్మ. అట్టి బుద్ధి ప్రతివ్యక్తియందును గలిగినచో సర్వజనశ్రేయము కలుగును. దేశమంతట శాంతియు, స్వాతంత్ర్యమును పాదుకొనును.

ప్రతివ్యక్తియు వ్యక్తిగతస్వతంత్రుడగుచో -అనగా తానే స్వతంత్రుడ ననుకొనుట- నేరములకు తావు కలిగించుకొనును. ఇట్టి స్వతంత్రులకు సప్తవ్యసనములలోని పలుకుప్రల్లదనము, అనగా ప్రల్లదపుమాటలాడుట—ఆవేశించియుండును. ఇట్టివారిలో బలవంతుడెక్కువ నేరములు, బలహీనుడు తక్కువ నేరములు చేయును. ఇట్టి స్వాతంత్ర్యమునకు పెనగులాడుట స్వాతంత్ర్యము కోలుపోవుటయే. ఇట్లు స్వతంత్రుడనని భావించువాడు బానిస.

మనలను మనముపరిపాలించుకొను విధానము శ్రేష్ఠ ప్రభుత్వమే ప్రభుత్వము. ప్రజాసమ్మతి లేనిది బానిస ప్రభుత్వము. వారివారి విద్యాబలముచేతను, బుద్ధిబలము చేతను తాము ఆక్రమించు స్థానములలో భేద మున్నను జన్మహక్కులు అందరికి నేకరీతిగా ప్రవర్తింప జేయు ప్రభుత్వమే ప్రభుత్వము. అదియే సర్వస్వతంత్రప్రభుత్వము. ఆత్మసామ్రాజ్యమే సామ్రాజ్యము.

గౌతమబుద్ధుడు సంబోధిపడసినతరువాత సారనాథునకడ్డ మృగవనమున కేగి అచట తన దివ్యసందేశము మొదట బోధించెను. ఈ యమ్మతధర్మమును బౌద్ధులు ధర్మచక్రప్రవర్తన మన్నారు. దీని సూచనగా శిల్పులు చక్రచిహ్నమును చిత్రించిరి.

ఇట్టి ధర్మచక్రచిహ్నితమైన త్రివర్ణపతాకము త్రికూరాత్మిత్రకుండవలె సూర్యభగవానుని కాంతిసప్తవర్ణాత్మకమయ్యు నిర్మలమగు తేజస్సుచే ప్రకాశించు రీతి దివ్యజ్యోతియై వెలుగుగాక. ఇట్లు వెలుగుటకు ధర్మప్రవర్తనము దేశమున సాగుచుండుగాక.

# గ్రీష్మము

●

శ్రీ సామవేదం జానకిరామశర్మ

చిఱుచేప వెండిగా మెఱసి నట్టువలాడె ననఁగంటు కొలని తోయముల నడుమ
తల్లిప్రాణము, ఱెక్కఁదాగిన పసిపిట్టఁ గావుగొన్నది వడగాలిపొగరు
పొరలాడె గుహను నిశ్వాసలు చెఱంగిన రొంప నెలమోయు నలయు బెబ్బులి నెలంత
అడుగుఁదామర లెఱ్ఱవడి పొక్క నేడిచె, నడువీథి నడుబగల్ నడచు బిడ్డ
ఒక మహాశక్తి తనయంత నొదిగివచ్చి-వేఁడివెలుఁగున లీనమై చూడరాని
దివ్యతేజమ్ము నొసఁగ నుద్విగ్నసర్వ-జీవగణమయ్యె ధాత్రి విశిష్టవృత్తి!

పొదుపుకొండ నినుండు బాడసూపకయు తిను తరవాణిబోనమ్ము తల్లివోలె
దాపమ్మపో నొడల్ దాపిన మలయజ మ్మతిసౌఖ్యదాత్రి యర్ధాంగిరీతి
తాళవృంతమ్ము నరతలనైజకరచాలిత మ్మెన్న ప్రాణమిత్రమ్ముపగిది
తీయతీయనివి పానీయమ్ము లతిశీతలమ్ములు సంతానలాభ మట్లు
దుర్నిరీక్ష్యుండు నయ్యు నత్యున్నతుండు-ధర్మసంరక్షణవ్యగ్రతను వహించి
ఇనుఁడు సంసారసౌఖ్యమ్ము నేర్పఱించె-దాపబాధార్తమనుజసంతతుల కెల్ల!

ధావత్పిపాసావ్యథాసంభ్రమజ్జంతునికరమ్మునకు మరీచికలఁ జూపి
దీవ్యత్ప్రతాపప్రదీప్తాత్మతేజమ్ము నిడుదగాఁ బవళులఁ బొడవుసలిపి
కూలంకషోత్తాలకీలాలములు నిజకరముల నానాఁట దఱుఁగఁజేసి
శీతర్తురిపుమహాశిపిహాసువులను మంత్రతేజమ్మున మాయఁజేసి
తన మహామోఘసత్త్వప్రతాపకల్పి-తాఖిలజగద్భయంకరతాప్తి కూడ,
మధురమధురాతిభావనోన్నమతఁ బెంచి-భాస్కరుం డైంద్రజాలికుపగిది నొప్పె!

కుండలోపలి నీటికొఱకు వేడిరి రజతాదిపాత్రల జలమ్మానలేక,
పూరిపాక వసింపఁ గోరిరి సౌధాంతరముల వేడిమికిఁ దాళగనులేక,
సన్నని చిన్నివస్త్రమ్ము లెంచిరి ముదుకలు గూర్చు చిత్తడి కాఁగలేక,
తాటిముంజలకు నారాటమందిరి ఘనమగు వంటకములపై నాసలేక,

ఏమొ కోటికి పడగల నెత్తినట్టి-భాగ్యవంతులు వేసవివాసరములఁ
గోరి దారిద్ర్యమున కనుకూలురైరి ;-ఇనుఁడు తలఁచినఁ జేయని దేమి కలదు!

చదల చిన్నరిమబ్బు కదలులాడినయంత, వడగండ్లవాన యేర్పడిన వింత
విద్యుత్తుతో గర్జ వినవచ్చి గుండియల్ ఝల్లనఁ జేసిన పెల్లు భయము,
లోతైన కూపమ్ము లోని శీతజలమ్ము తానమ్ము లాడిన మేనిహాయి,
చినుకులుపడి గాలి కనరాక ఉక్క-పోసిన రేయి కలిగిన చీదరింపు
లొక్క-టొకటిగ మనమున కెక్కి- గ్రీష్మ-మద్భుతమ్ము, భయావహ, మతులసౌఖ్య
యుతము, సంభ్రమకలితమై యొప్పె నింద్ర-ధనువులో నున్న వర్ణచిత్రముల పగిది.

తమ హృదయమ్ము మెత్తన, మాట తీపియుఁ దనరు చిన్నరసాలు తినుట గలిగి
తమ మనఃకర్క-శతాసుగమత్వము లలమిన పనసల నారగించి
తమ రసార్ద్రిస్వాంతసమమయి యింపగు బత్తాయితోన యనుభవతఁ గూర్చి
తమ మనస్సు ప్రసన్నతయు, శాంతమునుఁ దోచు హిమవారిఁ గ్రోలు మహిమ
స్వీయభాగ్యప్రభావవిశిష్టసుఖము-లాచికొన భోగులల్పులు నాతపమున [వహించి
వలసి పాలసిరి సృష్టిరహస్యములగు-వెలుఁగుచీఁకటులను విధి తెలిపినట్లు!





కథానిక :

# 'మీ అన్నయ్యను ఏమిచేశావ్?'

శ్రీ జనస్వామి కోదండరామశాస్త్రి

ముప్పదిఅయిదుసంవత్సరముల వయసువరకూ దీక్షితులు ఎట్టి దుర్వ్యసనములకునూ వశుడు కాలేదు. ఉత్తమమానవుడనీ, కరుణకోమలహృదయుడనీ ఆగ్రామంలో అశేషప్రజానీకంలో అశేషప్రజానీకంచే స్తుతింపబడుతూండేవాడు. కాని యీ నాడు వారందరూ అతనిసందర్భం వచ్చేసరికి కొంచెం నీరసంగా నాలుక చప్పరిస్తున్నారు.

దీక్షితుల తమ్ముడు హరినారాయణకు పెండ్లై సుమారు పదిసంవత్సరములు కావస్తున్నప్పటికీ అన్నగారి అడుగుజాడలలోనే మెలుగుతూవచ్చాడు. గృహబాధ్యతలూ, సంసారపు చిక్కులూ, ఏవీ తెలియకుండా ఆ చల్లనినీడలో సుఖంగా విశ్రమించాడు. భోగసంపిరీతివిషయం ఎన్నడైనా ఊహాపథములో మెదిలినప్పుడు అతని తనువు భయకంపితమయ్యేది. పురాణగ్రంథముల్లోని సజ్జనత్వమును కొంతవరకూ తన అన్నగారిలోను, వదినగారిలోనూ కాంచగలిగి ధన్యుడనైనానని ఉవ్విళ్లూరుతున్నాడు.

నారాయణ తన తండ్రిని ఎఱుగడు. తన జన్మనక్షత్రపు అమంగళఫలితముగ తనకు మూడోయేడు దాటీ దాటకముందే పొట్టనపెట్టుకొన్నాడని ఎవరో చెప్పగా విన్నాడు. ఇక, తల్లిని బాగానే ఎఱిగున్నప్పటికీ ఆమె తనకు తల్లి అనే భావన అతనికి ఎక్కువగ వుండేది గాదు. అతని బాల్యదశ అంతా వదినగారు చూపిన గారాబములోనూ, వాత్సల్యములోనూ గడచిపోయినది. వాత్సల్యరస ముప్పొంగిపోతున్న హృదయంతో వాని సన్నని బుగ్గలను అప్యాయంగా ముద్దిడుకొనేది. ఆ లేతపెదవులనుండి వెలువడే ముసిముసినవ్వులు ఆమె హృదయపులోతులలో నవ్వులపొటలంగా సుమధురమంజులగానమును పలుకుతూ వుండేవి. సంతానప్రాప్తికి నోచుకోనని అవదినగారికి కరువుతీరినది. వచ్చీరాని వంకరటింకరమాటల్లో 'అమ్మా' అని సంబోధించేవాడు ఆమెను. అంతట ఆమె హృదయమును ఒక విధమైన చల్లదనమూ, సంతోషమూ, సంతృప్తీ ఆవహించేవి. 'నాకు సంతానభాగ్యము లేదనిన బాధలేదు. ఇతను బ్రతికి బట్టకడితే నా కదే పదివేలు. దేవీ! ఇతని ఆయురారోగ్యములను కరుణతో కాపాడు' అని అంటూ తమ కులదేవతను ప్రార్థిస్తూవుండేది ఆమె. నారాయణ పెద్దవాడైన తరువాతకూడ 'అమ్మా' అని అనవచ్చి వెంటనే ఆమాట సగంలో ఆపుకుని 'వదినా' అని పిలిచేవాడు. అన్నగార్నీ, వదినగార్నీ చూపించి 'వీరిద్దరూ నీ శ్రేయోభిలాషులు. యీలోకంలో వీరిద్దరి కంటే నీ కితరులైనా లున్నారని నీవు ఎన్నటికీ నమ్మవలదు.' అని అంటూ చరమదశలో వున్న తల్లి ప్రబోధించిన గాంభీర్యవచనములు అతని మనసులో మణిదీపాలై నిలిచిపోయినవి.

తల్లిదండ్రులు లేని లోపము అతని కెన్నడూ తలపునకు రాలేదు. ఆ స్థానములు రెంటినీ వారిరువురూ ఆక్రమించుకుని ప్రేమగా పెంచి పెద్దవాణ్ణి చేశారు. తరువాతకూడా ఆ స్థానములనుండి తప్పుకుని పోవాలన్న కోరిక అతనికి కలుగనేలేదు. ఆస్థానములలో ఏదైనా ఒకటి విధిప్రతికూలతచే ఖాళీపడితే తన గతి ఏమికాను అని బాధపడుతూండేవాడు. ఆ అన్నగారి ఛాయలో అతను సుఖమయమైన విశ్రాంతిమందిరమును నిర్మించుకున్నాడు. అది అగ్నిపాలు గాకుండా సహృదయతతో, శాంతచిత్తముతో, భక్తిభావంతో దానిని జాగ్రత్తగా కాపాడుకుంటున్నాడు. కాని దానికే యీనాడు ఒక తూటు పడినది. ధైర్యచిత్తముతో ఆవిషాద సంఘటనను ఎదుర్కొనినాడు. కాని వెంటవెంటనే తూట్లు కల్పించి కుటీరపుగోడలు కూలిపోవుటకు సిద్ధంగా వున్నవి.

ప్రపంచంలో ఎందరు ఎన్నిమాటలు చెప్పి తనను నమ్మించలేకపోయినారు. కండ్లారా అనుభవాలకమును చూచికూడా అది మధ్యపానఫలితమేనని ఎందుకు భావించుకోవాలీ అని తర్కవాదనలో దాన్ని

కొట్టివేశాడు. ప్రతిరోజూ తన భార్య ఊపిరి త్రిప్పకో కుండా వాగుతున్న మాటలను చెవిచెవిన పెట్టినాడు. కాని ఈనాడు తాను తన అన్నగారి గదిలో మేజాపై డజను బ్రాందీసీసా కాయలను చూడగలిగినాడు! తన అన్నగారి సంతకముతో వుండిన పదివేల రూపాయల ప్రామిసరీనోట్లను పెద్ద షావుకారువద్ద తను స్వయంగా చదివినాడు! ఇంకనూ మరి అయిదు వేలకు గ్రామంలో ఎవరెవరికో వ్రాసిచ్చిన్న సంగతి మాట విశ్వసించకుండా వుండుట ఎలాగూ?

ఆరాత్రి శయనాగారములో కదుగికుతూనే కొంచెం తీవ్రంగా అడిగింది రాధాదేవి తన భర్తను: "సాయంకాలం కిటికీసందుల్లోనుంచి బావగారి గదిలోకి తదేకదీక్షగా చూస్తున్నా రెందుకండీ? మీ కెప్పుడూ అలాంటి అలవాటు లేదే!"

అనేక జటిలసమస్యలలో చిక్కుకుని మూగగా బాధపడుతూండిన అతని మనసుకు ఆ గడుసుమాటలు కోపావేశమును కలిగించినవి.

"చూడవలసిన అవుసరం కలిగింది; చూశాను."

కంఠస్వరమును బట్టి అతనిలోని ఉడుకుబోతు తనమును గ్రహించి దానిని వృద్ధిపరచుటకు పూనుకున్నది రాధాదేవి.

"ఆఁ. అవునులెండి. దానికి కాదు లేనిన్నది. అన్నగారి గది తమ్ముడూ, తమ్ముడి గది అన్నగారూ చూచుటలో విడ్డూర్యం ఏమి వున్నది లెండి? మీరిద్దరూ సహోదరులాయె! వారి బాగోగులకు మీరూ మీ బాగోగులకు వారూ కాకపోతే మరెవరవుతారు గనక!"

"రాధా! నాగుండెలు దహించుకుని పోతున్నయి. ఇక మరి మాట్లాడకు" అని నారాయణ మరింత చిట్లిస్తూ ప్రక్కకు పొర్లగిలినాడు.

మర్నాటి సాయంకాలం నాలుగుగంటలకు తమ కుటుంబమునకు ప్రస్తుతం పదిహేను వేల రూపాయల ఋణమున్నదని తెల్పుకున్నాడు నారాయణ. "ఇప్పటికైనా నువ్వు మేలుకొని బయటపడకుంటే కొంతవరకూ బాగుపడలేవు. లేకపోతే మీరిద్దరూకూడా సర్వనాశనమైపోగలరు" అన్న పెద్ద షావుకారుగారి సుభాషితాలు అతని మనసుకు సూటిగా తగిలినవి. కొంచెంసేపు ఆలోచించుకున్న పిమ్మట అది సత్యమే ననిపించింది.

ఆయాసంగా, అలసటగా, శ్వాసవాయువులు బరువుగా ఎగ పీల్చుకుంటూ లోపలకు వచ్చుచున్న నారాయణను చూచి ధారాళ్ళ పట్టా అల్లుతూ కూర్చొని వున్న ఒదినగారు లేచి నిలబడి "నారాయణా! ఇంతసేపు ఎక్కడికి వెళ్లావ్? నీదేహావ్యాపారములకు తిరుగుడు సరిపడదు నాయనా" అని అంటూ లోపలికి వెళ్లి గాజులోటాతో మజ్జిగనీళ్లు తీసుకొనివచ్చింది.

"ఇటువంటి దయామయితో మరియొక నిమిషమునకు శాశ్వతమైన విరోధమా?" అతని నేత్రముల నుండి వేడికన్నీటిబొట్టు ఒకటి దగ్గరగానే నిల్చొని వున్న ఒదినగారి పాదముపై చిటిక్కుమని వాలినది. వెంటనే అతని కపోలములపై కన్నీటిధారలు తళతళ లాడుట ఆమె గమనించినది.

"పిచ్చి నాయనా! నీకు విచారం ఎందులకూ? నే నుండగా..." అతని శిరమును తన హస్తములలోకి తీసికొని ఒంకులు ఒంకులుగా తిరిగి తైలస్పర్శచే బంగారు రేకులవలె మిలమిలలాడుతున్న ఆ క్రాపింగుజుట్టును సావరంగా, వాత్సల్యంగా, దయగా నిమురుతున్నది.

"నీవు వుండి ఆపలేవు తల్లీ యీ కాబోతున్న సర్వనాశనమును. ఆపగలిగితే అన్నగారిముందు ఏమాత్రమూ పిరికిపడకుండా వుండగలిగితే నా పెర్రిహృదయమే కొంతవరకైనా ఆపగలుగును..." అని మనసులో వాపోయినాడు.

ఇంతలో కిఱ్ఱుచెప్పుల చప్పుడు వినిపించినది. "మీ అన్నయ్య వస్తున్నారు..." అని లేచి ఒదినెగారు తలుపు రెక్కల చాటుకు తొలిగింది.

ముళ్లకఱ్ఱ గోడకు అనించి ఎదుటి అరుగుపై కూలబడుతూ "అలసిన ట్లున్నావేరా నాయనా?" అని ప్రేమగా ప్రశ్నించాడు దీక్షితులు.

లలాటభాగమున ఉద్భవిల్లే స్వేదజలబిందువులను తుడుచుకుంటూ ముఖం కొంచెం ప్రక్కకు ఒంచుకుని కల్పితమైన చిరునగవుతో నారాయణ అన్నాడు: "ఆఁ, ఏమీ లేదు అన్నయ్యా... ఒక క్షణకాలంపాటు అలా ఎండలోకి వెళ్లివచ్చాను......" వారిరువురి మధ్యనా అయిదునిముషముల కాలము మౌనము పరువులీసినది.

"మన కుటుంబపు ఆస్తి భాగపంపిణీ చేసుకుంటే బాగుంటుందేమోనని..." అన్న మాటలు నారాయణ అస్ఫుటకంఠస్వరాన వెలువడినవి.

దీక్షితులు శిరం పైకి ఎత్తి శూన్యంవేపు మనోవికారంగా వీక్షించుచూ శాంతంగా, నిశ్చలంగా,

నెమ్మదిగా అన్నాడు: "బాగుంటుందని ఎవరన్నారూ......"

నారాయణమనసులో కొంచెంగా కోపాగ్ని జ్వాల రగిలినది.

"ఎవరైనా చెప్పవలసిన వయసా యిప్పుడు..." అతని కంఠనాదమునందు కించిత్ కాఠిన్యత కూడి వున్నది.

దీక్షితులు అవనతశిరస్కులై నాలుగుక్షణముల పాటు ఏదో ఆలోచించుకుని జవాబుచెప్పబోతుండగా లోపలినుంచి ఆ స్త్రీకంఠస్వరం వినిపించింది.

"అతని కోరికను మీరు ఆమోదించండి. నిష్కారణ ప్రసంగములకు అవకాశము కలిగించి కుటుంబప్రతిష్ఠను బూడిదపాలు కానీకండి."

"ఇంకేం! అప్రకారమే చేద్దాం. మీఒదినె చెప్పేసిందికదా! రేపే పూర్తిచేసుకుందాం."

"వుండుకున్న ఋణములో కూడ సగముపాలు నేను పంచుకుంటాను. అసలు నేను ఆ ఋణములోను నేను ఒక్క రాగిదమ్మిడీ అయినా ఎరక్కపోయినప్పటికీ ఇంత ఋణభారం నీఒక్కడిమైనే మోపట మనేది నాకు భావ్యంగా తోచుటలేదు."

"ఆఋణంతో నీకు నిమిత్తములేదు. దాని కర్త నేనుకదా!"

"అయినప్పటికీ ఆఋణభారమంతా నీఒక్కని పైనే మోపుట నాకు ఇష్టములేదు. లోకం నుడిది..."

"దాని కర్తను నేను హరీ! నీవు నాసోదరుడ వైనంతమాత్రమున నేను సలిపిన పాపంలో నీకు భాగము పాలు పంచి యిమ్మంటావా? ఇది సబబైన మాట కాదు."

"ఇంకను ఇప్పటికికూడా జ్ఞానసూర్యుడు నీలో ప్రచండకాంతులతో ప్రకాశిస్తూనే వున్నాడే అన్నయ్యా! ఈ నీ అధోగతికి మరి కారకు లెవరు!" అని నారాయణమనసు తీవ్రముగ ఆవేదన చెందినది.

దీక్షితులు కొంచెంసేపు మౌనంగా మనసులో ఏదో ఆలోచించుకుంటూ కూర్చుని ఇత్తిపుట్టినవాని వలె అకస్మాత్తుగా గుబులుగా లేచి నిలబడి "ఏమోరా హరీ! అవిభాజ్యంగా వుండుట మంచి దనుకున్నంత కాలం అవిభాజ్యంగానే వున్నాం. ఇప్పుడు మంచిది గాదని తోస్తే నాఅడ్డు ఏమీ లేదు" అని అంటూ బయటకు వెళ్లిపోయినాడు.

"ఇదా నీవిచారం హరీ! ......" అని చిరునవ్వుతో పలుకుతూ ఒదినెగారు తలుపుచెక్కల చాటునుంచి వచ్చి తన మజిలీప్రక్కనే కూర్చున్నది.

"అన్నయ్య అనవసరంగా దబ్బు తగలేసు న్నాడు ఒదినా! నువ్వయినా చెప్పి చూడకూడదూ!" అని అన్నాడు అతను చింతాక్రాంతంగా.

ఒదినెగారు తేలిగ్గా నవ్వి అన్నది: "ఓరీ పిచ్చిహరీ! మీఅన్నయ్యకు హితబోధ చేయగలిగిన వారంటూ ఒకరున్నారా? ఎన్నెలహోయలో లోకాన్ని ఆనందకౌముదికల పూరింపజేసే శీతలకరుడు అంధకారశర్వరిలో అంతమైపోతున్నప్పుడు అతనికి ఎవరు జ్ఞానబోధ చేయగలరు?"

"ఇంత మంచివాళ్లూ, జ్ఞానవంతులూ దుష్టచరితులుగా మారిపోవుట నేను ఎక్కడా చూడలేదమ్మా!"

"పిచ్చితండ్రీ! పిడుగుపడి నెత్తిమీద వ్రాల బోతుంటే, వలదని వారి స్తోత్రం వ్రాసుకుంటుందా!"

"ఆగకపోయినప్పటికీ ఏదో ఒక ప్రయత్నమంటూ చేయవలెగదమ్మా?"

"క్షణకాలములో మంచుకొచ్చేదానిని నీప్రయత్నము లేమి అడ్డగింపగలవు! తప్పనిసరిగ దానికి బలికావలసినదే."

"ఏమో! నీవాదన నాకు నచ్చలేదమ్మా!"

"పిచ్చివాడా! నేను నిన్ను కఠినముగ శాసింప గలను. మూర్ఖంగా ప్రేమింపగలను. నీవే ఒక తెబ్బలి నోట పడి హతమైపోతున్నప్పుడు నా శాసనములూ, నాప్రేమలూ నిన్ను ఏమాత్రం కాపాడగలవు? ప్రపంచంలో పండితుడే మూర్ఖుడై పోతున్నప్పుడు వానికి బుద్ధిలోప మెక్కడ వున్నది? మూర్ఖుడే పండితుడుగ నటిస్తున్నప్పుడు వానికి బుద్ధికుశలత ఎచటనుండి లభిస్తున్నది?............ ఈమాటలు పలుకుతూన్నప్పుడు ఆమెనయనములు దివ్యకాంతులతో మెరిసినవి. కంఠస్వరమునందు మానవత్వమునకు మించిన ఒకవిధమైన అసాధారణప్రజ్ఞా, కేనిలోనూ చలించని నమ్మకమూ, ఆశనిరాశల కందని బలీయసంకల్పమూ ద్యోతకమౌతున్నవి. నుదుటిరేఖల్లో త్యాగశీలత పాయలై ప్రవహిస్తున్నది. తన ఒదినగారు విషయ విమర్శనయందు ఎంత గొప్పబుద్ధి ప్రదర్శింపగల ఈ త్తమురాలో అతను గ్రహించుకున్నాడు. అందువల్లనే అనాయాసకురాలు, ముక్కోపి, కఠినురాలు,

పార్థివచింతనాభిలాషి, అయిన రాధాదేవి ఆజీవితకర వాలమును ఇంతకాలమూ దొక్కల్లో వుంచుకుని అరమరలు లేకుండా కాపురం చేయగలుగుతున్నదని అనుకున్నాడు నారాయణ.

ఆరాత్రి శయనాగారమందు భర్తకు ఎదురుగా ఆసీనురాలై రాధాదేవి కించిత్ ఉత్సాహంగానూ, కొంటెతనంగానూ అన్నది: "ఇప్పటికైనా మేల్కొన్నారు. సంతోషం."

ఎదుటి తెల్లగోడపై వ్రేలాడుతుండిన చిత్రములో పిల్లవాయువుల నైర్మల్యతతో దోబూచులాడుతూండిన రమణభగవానుని నయనపుంజములపైపు తదేకంగా దృష్టిబఱపుతూ నారాయణ అన్నాడు, ఇసుమంతైనా కాఠిన్యత చూపే కంఠస్వరంతో: "నాకు సంతోషంగా లేదు. మేల్కొనవలసిన దశ పట్టిందిగదా అని ఏడుస్తున్నాను."

"అటువంటప్పుడు మానేస్తే పోయేదిగదా!" అని కొంచెం వెటకారంగా ధ్వనించింది ఆమె కంఠస్వరం.

అతని మనసు అగ్నిముఖమున వుంచిన వెన్నముద్దవలె కరిగిపోయినది. శ్రవణపుటములను సూదిమొనలతో గుచ్చినట్లయినది. రోషమూ, దుఃఖమూ ఏకమై గుండెల్ని మండింపజేసినవి. పసిబాలునివలె ఎక్కి ఎక్కి ఏడ్చుచు మాటలు కంఠపుతడిలో నలిగిపోతూండగా కంపితస్వరాన ఇలా అన్నాడు: "ఎల్లా మానేసేది? ఇదివఱకు ధూర్తనదీతరంగములు ఎచటనో దూరముగ ప్రవహిస్తూండేవి. ఆ కలుషితప్రవాహమును కన్ను విప్పి అయినా వీక్షించుటకు అనుమతించేవాణ్ని గాను. ఆ ప్రవాహమున ఒక్క ప్రక్క లభించే శుభ్ర జలమునైనా మాత్రమే నేత్రముల కద్దుకుని భక్తితో సేవించి సేదతీర్చుకొనేవాణ్ని. అపవిత్రసలిలములపై కదిలే కమ్మతెమ్మెరలకు నాప్రాణం ఎంతో హాయినిపొందేది. ఆ పుణ్యపులినసీమలపై పరుండి నాజీవితం ధన్యత చెందినదని ఆనందించేవాణ్ని. ఆతరంగముల మధురగానస్మృతి కేతములకు పరవశత చెందేవాణ్ని. నా బ్రతుకంతా అవిఘ్నముగానే సంతోషితముగ గడిచిపోగలదని ఆశించాను... కాని అలా జరుగలేదు. అవిమలసలిలప్రవాహం నేడు నా పాదముల అడుక్కి నెట్టుకువచ్చినది. దాన్ని అడ్డగింపగల బలం నాలో నీరసించిపోయింది..."

తీవ్రముగ తపించిపోతూన్న హృదయాంతరాళముల నుండి వెలువడిన ఆ విషాదగీతమును వ్యర్థప్రలాపముల క్రింద జమచేసి రాధాదేవి నిర్లక్ష్యముగా నవ్వేసి ఇలా అన్నది:

"ఆహా! హా! ఆయనగారి ప్రవర్తనగురించి ఎంత హృదయమూ వేదనతో విలపించిపోతున్నారండీ!"

భగవానుని పటంలోకి దీనదృష్టిని బంపుతూనే పెదిమలు కదిలించాడు నారాయణ.

"సత్యం. నాహృదయం తీవ్రావేదనతో కాలిపోతోంది. ఈదుర్దశను కండ్లారా చూడకుండా రోజులు త్వరగా ముగించుకొని పోయిన నాతల్లిదండ్రుల అదృష్టఫలములో సగముపాలైనా నాకు లభింపకపోయెనే అని నామనసు బాధతో అలమటించిపోతోంది."

ఆ విషాదాగ్నికి ఇక మరి సమిధలు కూర్చుట వలన నష్టం సంభవింపగలదని భావించి రాధాదేవి ఇంకొకరకంగా సంభాషణ మార్చినది.

"అయితే, ఇందాక ఆమెతో అంతసేపు వాదన పెట్టుకున్నారెందుకూ? మాటల కేమి తక్కువా! ఆమెకు నోటినిండా మాటలూ, వళ్లూ కొల్లలుగా వున్నాయి. మనుష్యుల్ని మంచితనంగా బోల్తా కొట్టించడము ఆమె బాగా నేర్చుకుంది."

తుపాకిదెబ్బ తిన్న లేడిపిల్లవలెనే నారాయణ మనసు వేదనతో గిలగిలా తన్నుకున్నది. "వదినె స్వభావమును నీవు చాలా పొరబాటుగ గ్రహించావు. నీ అల్పబుద్ధికి ఆమెలోని గొప్పతనము గోచరించదు."

రాధాదేవి లోలోపల ఉక్రోషంతో కాలిపోతున్నప్పటికీ పైకిమాత్రం వెకిలిగా నవ్వుతూ అన్నది: "అదేమిటండోయ్! మీవదినగారు దేవతాస్త్రీయా ఏమిటి?"

"మావదినగారు దేవతాస్త్రీకంటెకూడ ఉత్తమురాలు. దేవతాస్త్రీల చరిత్రల్లోనైనా ఏదో ఒక నల్లచార కానవస్తూనేవుంటుంది. కాని మావదినగారి జీవితములో వేలువంచి చూపదగిన ఘట్టము ఒక్కటీ లేదు. కాగా సమస్తమానవులకు యుగయుగములవఱకూ ఆదర్శముగ వుంచుకోదగిన పరమ పావనజీవితము ఆమెది. కరుణ, క్షమ, శాంతమూ— ఇవి ఆమె భగవంతునినుండి పొందిన వరఫలితములు. మంచిచెడ్డలను సహించుటలో ఆమె వాయుపుత్రుకంటెకూడ గొప్పది. ఆమె అధరములనుండి వెలువడే ప్రతిమాటా ఒక సుమధుర భావగీతం. ఆమె విశ్వప్రేమను సదా గానం సలిపే ఒక విపంచి......"

రాధాదేవి భయ్యన విరగబడి నవ్వుతూ అన్నది: "మీరనుకూనా రామనాటకములోని లక్ష్మణపాత్రను ఏమాత్రం తీసిపోరని నేను యీయింట్లో అడుగుపెట్టిన మరురోజునే గ్రహించాను. అవును. మూర్ఖుల మనసు ఎన్నటికైనా మూర్ఖులే మార్చుకోవాలి. ఒకరు చెపితే వినరు."

ఈమాటలతో నారాయణహృదయంలో రోషము, కోపము పట్టపగ్గాలు లేకుండా, విజృంభించుకునిపోయినవి. భయ్యన కుర్చీలోనుంచి లేచి నిలబడి చింతనిప్పులవలె కోపముతో ఎఱ్ఱనైన నేత్రములతో ఆమెను పరికిస్తూ "నేను మూర్ఖుడినా? నా వదినగారు దలారిమనిషా?" అని గర్జిస్తూ వడిగా వడిచివెళ్లి బయటి సావిడిలో ఒకమూల కూర్చుని కన్నీటిధారలతో వెన్నెల్లోకి చూస్తూ 'ఓవదినా!' అని దీనస్వరంతో పిలిచాడు. ప్రక్కగదిలో పరుండి జాగృతిలోనే వున్న ఇంటి పెద్దకోడలు వరలక్ష్మమ్మకు యీ దంపతుల సంభాషణ వినిపించకపోలేదు. ఆమె నెమ్మదిగా వచ్చి నారాయణవద్దగా కూర్చున్నది. వదినగారిని చూచి నారాయణ పసిబాలునివలె ఆవురుమంటూ "వదినా! నాకీపెళ్లి ఎందుకు చేశావమ్మా? నీ పుట్టింటిబాపతుసంబంధంకదా అని నీవంటిదే అయి వుంటుందని తలిచానుగాని ఇంత............"

వరలక్ష్మమ్మ ఇంకా కొంచెందగ్గరకు జరిగి అతని మాటలకు అడ్డుతగిలి "నాయనా! అది అబల. స్త్రీసహజమైన వాక్ బలహీనత రాధాదేవిలో కన్పించుట ఏమంత ఆశ్చర్యకరమైన విషయం కాదు. అదీగాక దాని వయసు ఏపాటిదే? ఇంకా చిన్నగా ముక్కుపచ్చలారలేదు సుమా!" అని అన్నది శాంతరసముట్టి పడుతూండగా.

"దాన్ని పసిబాల అని తేలిగ్గా చెప్తున్నావ్? అది ఎంత ధూర్తురాలో నీకు తెలుసునా?"

"దాంపత్యం అని అన్నప్పుడు అప్పుడపుడు ఏవేవో కొద్ది పొరపొచ్చెలు వస్తూంటవి. అటువంటి వాటిని సహృదయంతో సర్దుకుపోవాలిగాని ఇంత కోపం తెచ్చుకుని......"

"అది గాదు వదినా! ఆ నీచురాలు మా అన్నయ్యనూ, నిన్నూ..........." వరలక్ష్మమ్మ తన కోమల హస్తము అతని పెదవులకు అడ్డుగా వుంచి శాంతమైన చిరునగవుతో అన్నది:

"నేను విన్నాను. దాని మాటల్లో తప్పేమీ లేదని నాకు తోచింది. దుష్ప్రవర్తకులైన మీ అన్నయ్యను తీవ్రంగా అసహ్యించుకుంటుంది. మహాప్రళయాలు వచ్చి మీద ప్రాణపోతూన్నప్పటికీ చలించని ధైర్య సంపత్తుతో, గాఢవిశ్వాసంతో ప్రేమింపగల శక్తి, భక్తితో సేవింపగల ఓపికా, నీలోవలెనే అందరికీ వుండాలని నీవు కోరటం పొరబాటు. నీభావనకు నేను ఒక ఉత్తమస్త్రీనిగా తోచవచ్చు. అంతకు కొంచెం తక్కువతరగతికి చెందినదాన్నిగా రాధాదేవి భావింపవచ్చు. నీదృష్టియే దాని కలవడాలని పంతంపట్టి కోపగించుకుని అబలయైన దానను రచ్చలోకి యీడ్చి అల్లరిపెట్టడం నీకు భావ్యమా నాయనా? ఆలోచించుకో............"

"నీది ఎంత ధీరచిత్తమమ్మా వదినా?......" అతనిలోని దుఃఖప్రవాహమునకు కట్టలు తెగినవి. కల్లోలితతరంగములతో విజృంభించినది. దీనముగ విలపిస్తూ ఆమెఒడిలోనికి పసిబాలునివలె ఒరిగినాడు. వరలక్ష్మి నారాయణశిరసును అనునయముగ నిమురుతూ, సమస్త ప్రజాహృదయభావములను సానుభూతితో పరికించుచు నీలిమబ్బుల నింగిలో వడివడిగ పరుగులిడుతూండిన రోహిణీరమణునిపై ఏకాగ్రంగా దృష్టినిలిపి బరువైన హృదయంతో నెమ్మదిగా అస్ఫుటకంఠస్వరాన అన్నది: "నాదుర్గతికై విలపించుచున్నావా నాయనా? నరజన్మకు నూరుదశలు గడవాలన్నారు."

* * * *

మర్నాటి ఉషఃకాలమునకే ఆ గ్రామంలోని పెద్దలు కొందరు భాగపంపిణీ చేయుటకొఱకై దీక్షితుల ఇంటియందు సమావేశమైనారు. వారందరికీ దీక్షితులు ప్రారంభంలో ఒక్కతిరిగిన నమస్కరించి అచంచలవిశ్వాసంతో యీవిధంగా పలికాడు: "ఇది నా సమ్మతిపై జరుగుతున్నది. ఇందులో బలవంతమేమీ లేదు. వాడు నా తమ్ముడు. నన్ను అమాయక హృదయంతో ప్రేమిస్తున్నాడు. భక్తితో సేవిస్తున్నాడు. స్వర్గంలో వున్న మా అమ్మ, సర్వాంతర్యామియైన ఆభగవంతుడూ కూడా వాడి భారం మా భార్యాభర్తలపై వుంచారు...వాడు చిన్నవాడు. భద్రమైన వస్తువులను, మంచివాటిని సమకూర్చుకోవటం వాడికి తెలీదు.........." ఋణభారంలో సగంవాటా తనకొక్కడా పంచియివ్వాల్సినదిగా నారాయణ పెద్దలను కోరగా, అందుకు జవాబుగా "ఆ ఋణభారవాహన క్లేశము వాడికి పంచియిచ్చుటకు వీలులేదు"అని ఖండి

తముగ చెప్పారు. ధూపములలోనూ, వస్తువాహనముల లోనూ మంచివన్నీ నారాయణభాగమునకు దీక్షితుల బలవంతముపైననే కేటాయించనైనది. తమ్ముడియెడల చాలా ఉదారబుద్ధితో ప్రవర్తించాడని అందరూ సంతోషిస్తున్నారు. ఒకమూల నిలబడి జరుగుచున్న దావ్నంతా చేవిసగా పరికించుచున్న నారాయణ మాత్రము ఖేదముతో క్రుంగిపోతున్నాడు. "ఇంత కంటే అన్యాయమనేది ఇంకొకటి లేదు. అన్నయ్యకు చాలా ద్రోహం జరిగింది" అని గొణుక్కున్నాడు. భాగపంపిణీప్రకారం నారాయణనంటుకు పైబజార్లోని డాబాఇల్లు ఏర్పాటయింది. గృహప్రవేశమునకుకూడా అదే తగిన శుభదినమని పెద్దలు సలహా యిచ్చారు. ఇంటి చిన్నకోడలి ఆనందమునకు అంతు లేదు. రాధాదేవి జంటనే సమ్మం దాటినది. సామాన్లు బండ్లపై చేరుతూన్నవి. శుభనిమిషములు సమీపించు చున్నవని నారాయణను పెద్దలు తొందరిస్తున్నారు. గౌరవగర్వాంకితములైన అతని నయనములనుండి కన్నీటి కాల్వలు అపరిమిత వేగంతో ప్రవహించుచున్నవి. సుఖులాగా తల త్రిప్పుకుంటూ 'వదిన ఏదీ?' అని అంటూ ఇల్లంతా కలయదిరిగినాడు. వంటయింటి దొడ్డిగుమ్మంలో యోదాలాపంగా నిల్చునివుండి ప్రచండమైన వేదనతో పచ్చగా కాలిపున్న అంబరవీధిలోకి అవలోకిస్తూవున్న వదినగారు అతని కంటబడినది. వడి వడిగా పరుగిడివెళ్లి ఆమెపాదములపై వ్రాలి వలవలా విలపిస్తూ అన్నాడు నారాయణ: "నీఒడిలో పెరిగాను. నీ స్తన్యం త్రాగి బ్రతికాను. నీభుజములపై ఎక్కి కులికాను. నీవే తల్లివనీ దైవమనీ భావించాను. కాని ఒకానొక దుష్టక్షణమున నీ యిల్లు వదలి ఎడబాయవలసిన దుర్గతి రాగలదని సూచనగానైనా తోచివుంటే భక్తిశ్రద్ధలతో ప్రేమించి వుండేవాణ్ని కాదేమో వమ్మా!"

ఆమెగంభీరవాక్కులు యీవిధంగా ధ్వనించినవి: "పిచ్చి నాయనా! ఎంత ఆత్మీయులైనప్పటికీ, పూజనీయులైనప్పటికీ, కాలప్రవాహవేగములో గడ్డిపోచలై కొట్టుకుపోతున్న వారిని అనుసరింపగోరుట తగనిపని. అది దుస్సాధ్యమని తెలిసికూడా కాలచక్రపు పందుల్లో యిరుక్కుని పిప్పిపిప్పిగా నలిగిపోతూండిన అభాగ్యజీవులను అనుసరింపగోరుటగాని, రక్షింపగోరుటగాని వ్యక్తిత్వమును చిచ్చుపెట్టుకోవడమే కాగలదు. అది త్యాగధర్మమూ గాదు. ఆత్మబలమునకు నిదర్శనమూ గాదు. అట్టివారియెడ తన శక్తి కలిత ముగానట్టి రీతిలో సానుభూతి ప్రకటింపగలిగియుండు టయే మానవధర్మం..."

"ఈకింకరుడు నీదయాభిక్షకై వేచుకుంటున్నా డమ్మా!"

తన హస్తములతో పాదములపై వ్రాలివున్న నారాయణను పైకి లేవదీసి అతని శిరమును సాదరముగ, వాత్సల్యముగ నిమురుతూ వరలక్ష్మమ్మ అన్నది: "నాయనా! అంతకంతకు పసిపిల్లవాడివై పోతున్నావేం? ఇంత అధైర్యం దేనికి..."

కాలప్రవాహపు లోతుల్లో రెండు పంచాంగములు లీనమైపోయినవి. ఈలోపున దీక్షితుల కుటుంబంలో చాలామార్పులు జరిగినవి. ఈమధ్యనే రూపసియగు ఒక వేశ్యనొకదానిని తీసికొనివచ్చి తన ఇంటి ఎదురుగా ఒక గృహమును నిర్మించి అందుంచినారు. ఆవేశ్యఇంట విందులు, నృత్యములు, పాటకచ్చేరీలు— ఆ వినోదకాలక్షేపము అన్నిటికీ శ్రోతలుగాను, విలాసపురుషులూ, రౌడీజనమూ హాజరు కావడం, దినమునకు కనీసం రెండుడజన్లు బ్రాండీసీసాలు ఖర్చు పడటం పరిపాటీఅయిపోయింది. ఇదివరకు ఆయన కంట పడుటాకే భీతితో వణికిపోయెడి నీచపురుషులు యీనాడాయనకు ఆప్తమిత్రులైనారు. బుగ్గలపైకి కటింగు, ఎగదువ్విన క్రాఫూ, చారల అంగీవుడ్డతో నూనెకట్టూ, వ్రేళ్లలో యిరికివుండే ఆరిపోయిన బీడీ పీకా— ఈ ఆకారంలో ఆయన బజారువెంట నడచి పోతూవుంటే, 'ఈయనేనా భాగవతులవారి దీక్షితులు గారు!' అని విస్తుపోయి చూస్తూవుండేవారు ఆ గ్రామీయులు.

ఈమధ్యలో నారాయణ తన అన్నగార్ని గురించీ, వదినగార్ని గురించీ అనేకవిషయాలు విన్నాడు. అతని మనసు ఎల్లప్పుడూ విషాదమేఘములతో కప్పబడి చింతాక్రాంతమై వుంటోంది. ఏపని చేయాలన్నా అతని కేమీ తోచుటలేదు. ఎప్పుడూ ఏదో సుఖంగా వుంటుంది.

వరలక్ష్మమ్మ తమ్ముడు జిల్లాకలెక్టర్ యీమధ్య వచ్చాడట. భార్యాభర్తలిద్దర్నీ వచ్చి తనయింట కొంతకాలం వుండిపోవలసినదిగా కోరినాడట. అందుకు ఇద్దరూ మూకీభావం వహించివూరుకున్నారట. అంతట ఆయన అప్పగారిని ఇవతలకు పిలిచి యీవిషమపరిస్థితు లలో నీవు యిక్కడ వుండవలసినదానివి కావు. అవ మానమును భరింపలేక ప్రాణమునకు ముప్పు తెచ్చిపెట్టు

కోగలవేమో? అంతగా మంచి పరిస్థితులు కల్పించిన పుడు, అప్పుడే తిరిగివత్తువుగాని, రమ్మనమని బ్రతిమాలి నాడట! అందు కామె సుతరామూ అనుమతింపలేదట.

తరువాత ఒకనాటి సాయంకాలమున, ఆ వేశ్యవనిత ఆహ్వానమును మన్నించి వరలక్ష్మమ్మ ఆమెయింటికి వెళ్లినందుకుగాను దీక్షితులు ఆగ్రహుడై ఆమెశరీరమును రుధిరప్రవాహముతో నింపినాడట!

ఒంటిపైని నగలన్నీ వల్లకాడైనవట! మెడలో ఒక సన్నని కాడలాంటి ఒంటిపరుస గొలుసే మైత్రేలాడు తూన్న దేమో! అదికూడా అనుమానాస్పదమే! "ఆయ నకు బుద్ధి లేదే అంట! అదిచక్కగా వుంచేదా? ఒక చెంప అన్నం లేని కాలం రాబోతుంటే, తన పేరిట వున్న భూమినీ, నగలనూ ఏమని ఒదులుకోవడం? ఇది పతివ్రతాలక్షణమని ఎవ రంటారూ" ఇది నారాయణకు యీవార్తలన్నిటినీ వినిపించిన నిశితవిమర్శన చిలుకు.

ఆమె అవమానదుఃఖములతో కృశించిపోతూ గుమ్మం దాటి బయటికి రావడములేదట. ఉదయం పూట ఒక్క తడవమాత్రం కాలువకు నీటికై వచ్చినా బిందె చంకనిడుకుని వెంటనే వెళ్లిపోతుందట. ఆ కాసే పటిలోనే ఆమె రాధాదేవినోటినుంచి వెంటవెంటనే ఎన్నో విధములైన సూటిపోటీలకు గురికావలసివస్తున్నదట!

ఇవన్నీ ఇలా వుండగా, తన బావగారు చెడిపో వడానికి వరలక్ష్మమ్మే చాలావరకు కారణమని రాధా దేవి ఒక విచిత్రప్రచారం గ్రామంలోని అమ్మలక్క లందరివద్ద ప్రారంభించింది. యీవిషయం విని నారా యణ రాధాదేవిని కొంచెం మందలించబోయేసరికి కుటుంబపరువుప్రతిష్ఠలు మండినట్లే వున్నవి అని అంటూ నాలుగుకేకలు విసిరింది.

ఈ వార్తలన్నీ నారాయణమనసును అపరి మితముగ కలవరపెట్టుచున్నవి. ఈపరిస్థితులలో తన వది నగారిని ఒక్కతడవ చూడాలనిపించింది. ఆమెదగ్గిఱ కూర్చొని కండ్లనిండా నీరు కారుస్తేగాని యీదుఃఖా వేశము కొంతవరకైనా శమింప దనుకున్నాడు. కాని ఆమెదర్శనం ఏవిధంగా వీలవుతుంది? అది దుస్సాధ్యం. వరలక్ష్మమ్మనుగురించి గ్రామంలో రాధాదేవిచల్లు చున్న విషప్రచారంవలన చాలాకాలంనుంచీ నారా యణ సిగ్గుచెంది మొహంచెల్లక అన్నగారింటికి వెళ్లటమే మానివేశాడు. పైవార్తలతో చిత్రింపబడివున్న తన వదిన గారి స్వరూపమును చూడలేకపోవుటకూడ ఒక కార ణమే! కాని అన్నగారుమాత్రము ఏబజారుమలుపు లోనో నలుగురు నీచస్నేహితులతోనో కలసిపోతూ కని పించి "ఏరా నారూ! ఒంట్లో కులాసాగా వుంటు న్నదా?" అని అంటూ ఎంతో ఆప్యాయంగా పలకరి స్తాడు. జవాబుగా, అయన్ను కొంచెం ఇవతలకు పిలిచి తన శిరమును ఆయనవక్షంలో దాచుకుని కొంచెంసేపు కన్నీరు కార్చాలనిపిస్తుంది. కాని వెంటనే ఆ భావ నను స్వస్తిచెప్పి "కులాసాగానే వున్నాను అన్నయ్యా!" అంటాడు. అశ్రుపులూరిన నేత్రాలతో తన అన్నగారిని కనుమేర దాటిపోయేంతవరకూ అవలోకిస్తూ అప్రదేశమందే నిలబడివుంటాడు.

* * *

ఎంతోకాలముగ ప్రయత్నించినపిమ్మట నారా యణమనోరథ మీాడేరినది. కృష్ణసర్పంవలె స్వచ్ఛజల ప్రవాహం ఒంపులుఒంపులు తిరిగి సాయార్కకిరణపు ధగధగకాంతులకు బంగారు మెరుగులు దిద్దుకుంటూ ముందుకు సాగిపోతున్నది. రేవులో వరలక్ష్మమ్మతప్ప మరెవ్వ రునూ లేరు. నారాయణ కొలదిదూరమున వున్న వంతెన దిమ్మెపై ఆసీనుడై దిగులుగా, తదేకంగా ఆమెవైపు పరికించుచున్నాడు. తన వదినగారి దేహము పాండుర చ్ఛాయగా పాలిపోయి పాటవముతప్పి నీరసముగ కనబడు చున్నది. ఆ మెలలాటభాగమున జరత్వము బహిరంతముగ బయటపడుచున్నది. ఆ నేత్రముల లోతులలో దావాన లం ప్రజ్వరిల్లుతూన్నదనీ, ఆమె హృదయం అంతులేని వ్యాకులతతో కుంగి కృశించిపోతోందనీ అతను గ్రహిం చాడు. వరలక్ష్మమ్మ జలపాత్రను చంక నిడుకుని మెట్లు ఎక్కుతున్నది. నారాయణ గజగజ కంపించిపోతూ ఎదురుగా వెళ్లి ఆమెకు కొంచెం సమీపమున నిలబడి 'వదినా...' అని సంబోధించాడు ఆవేశహృదయంతో. 'నారూ'...... అని శిరము పైకెత్తి చూచినది నారా యణవంక. ఆ ఇరువురి దృష్టులూ ఒక త్రుటికాలము పాటు నాకలోకమునకు చెందిన దివ్యత్వమును స్మరించు కున్నవి.

వరలక్ష్మమ్మ నీరసంగా నవ్వి "నారూ! నీర సంగా కన్పిస్తున్నావేం? సుఖంగా వున్నావా?" అని అడిగింది. ఆ మందహాసములో వెనుకటి ప్రకాశంలేదు. బలీయమైన భావపొంగుమునుండి వెలువడినట్లుగ లేదు. విధిలేక కుంటోగి వచ్చినట్లుగ, ఆ మందస్మితము తెల్లగా పాలిపోయిన అధరముల ఒంపుల్లోనుంచి జారు తున్నది.

నారాయణ దుఃఖభారమును సహింపలేక కన్నీ టిధారలు ప్రవహింపజేయుచు దీనంగా అన్నాడు: "నీకంటే నీరసంగా కనిపిస్తున్నానా వదినా? మా

మాష్టాల్లో పెరిగి, పెద్దవాడినై మనిషిగా తయారైన నేను మీ ఇక్కట్లకు కల్లారా గాంచుచు ఇంకనూ బ్రతికే యున్నాను. మిమ్మల్ని గూర్చిన దూషణవాక్యములను ఆలకించుచూ చిల్లులుపడినకర్ణములతో, పరితాపాగ్నిలో మండిపోతూన్న హృదయంతో ఇంకనూ మనిషిలాగా తిరుగుతూనే వున్నాను. జ్ఞానచిత్తంలో విషతుపాను రేగినది. ఆ తెరువరి హృదయంలో అగ్నిగుండం భగ్గున మండుచున్నది. ఇది ఊరకనే సంభవించలేదు. దీని ప్రభావము సత్తించిన నా గుండెలు తరుక్కుపోతున్నవి. ఆ దయామయుడైన భగవంతుడు ఇంకనూ నన్ను ఎందుకు జీవించమని శాసిస్తున్నాడో తెలియదు .........."

"వత్సతండ్రీ! ఈ రెండు సంవత్సరములలోనూ యింత పిచ్చిగా మారిపోయినా వేం? నిష్కారణంగా మనసులో కలతపెట్టుకోవకు..." అని అంటూ వరలక్ష్మమ్మ ముందడుగు వేసింది.

వరలక్ష్మమ్మకు అకస్మికంగా పెద్ద జబ్బు చేసినది. అందరూ ఆశ్చర్యాన్వితులైనారు. కాని నారాయణమాత్రం విస్మయమందలేదు. దావాగ్ని వేడిమిచే వాడిపోయిన ఆ మెసుకుమారహృదయపుష్పం ఇంకనూ ఎంతో కాలం సువాసనలు వెదజల్లుతూ వుండ గలదని అతను తలచలేదు. శీతలకంపనములతో దుర్బలములైపోయిన ఆ మెగుండెలు ఏ అపుంగోకునుగాయునో మానభావం వహించగలవని ఎంతో కాలంనుంచీ ఆదుర్దాపడుతూనే వున్నాడు.

తాను అకాలమృత్యువును చేరిపోనుండగా వరలక్ష్మమ్మ నారాయణకు కబురంపి పిల్పించి 'నాయనా! దేనిని నీవు ఇంతకాలమూ కల్పతరువని భావించావో అది యీనాడు యీనాళ్లో కొన్నింటి లేవుపైకోనవున్నది. కాని ఆ వృక్షం తన బహిఃప్రాణములనుమాత్రము నీచేతిలో వుంచిపోతున్నది. దాని శాశ్వత నీది......' అని చెప్తూనూ వరలక్ష్మమ్మ ప్రాణసమీరములను ఒదిలినది. ఆ బహిఃప్రాణము అన్నయ్య అని అతనికి తెలియకపోలేదు!

కుటుంబపు హోదాకు తగినట్టుగా ధనమును వెచ్చించి శ్రాద్ధకర్మలన్నింటినీ తృప్తిగా జరిపించాడు నారాయణ. నారాయణ శ్రాద్ధాంత్యదినమున దీక్షితుల పాదములను గట్టిగా స్పృశించి "అన్నయ్యా! అదృష్టవంతురాలుగనుకనే ఆ మహాతల్లి సువాసినీరూపంలో స్వర్గలోకమునకు చేరుకున్నది. నీవు ఇక ఎక్కడికీ నీ వెళ్లవద్దు. ఈనాడు నీవు పేదవాడివని విచారింప వలదు. నా కున్నదంతా నీదే! నాదగ్గరనే వుండిపో. నీకు కోపం కలిగే పని దేనినీ నేను చెయ్యను!' అని ప్రతిమాలుకొన్నాడు. అందుకు దీక్షితుల ఆమోదము పొందాడు.

కాని మాసమదినములైనా గడవకమునుపే దీక్షితులు కన్పించకుండా వెళ్లిపోయినారు. నారాయణ ఎంతో వ్యయప్రయాసల కోర్చి ఎంత అన్వేషించినప్పటికీ ఫలితం శూన్యమైనది.

రెండుమాసములు గడిచినతరువాత డిసెంబరు ఆరవ తేదీ ఉదయకాలమందు నారాయణ వాలు కుర్చీలో పరుండి వార్తాపత్రిక గాంచుచుండగా ఒక ప్రక్కన చిన్న అచ్చులో యీవార్త కానవచ్చింది.

"దుర్మరణం"

నేటి వుదయం కృష్ణనదిలో ఒక మానవ కళేబరం తేలినది. బయటకు తీసిచూడగా కొందరు ఆయనను గుర్తుపట్టగలిగారు. పేరు దీక్షితులుగారనీ, ఇంటిపేరు భాగవతులవారనీ తెలిసినది......."

నారాయణనేత్రములనుంచి పత్రికపై రెండు కన్నీటికణములు పటపట మని ధ్వనించినవి. నారాయణ కంటతడితో గోడపై ఎదురుగా వ్రేలాడుతూ వున్న వదినగారిచిత్రంలోకి తదేకంగా ఉన్మాదుని వలె పరికించుచున్నాడు. ఆ చిత్రంలోని వదినగారు ఆతురతగా అడుగుతున్నది "నాయనా! ఆయనరక్షణభారం నీపై వుంచితినే! మీ అన్నయ్యను ఏమిచేశావ్?"

ఆ ప్రక్కనే వున్న చిత్రంలోనుంచి ఉగ్రురాలైన తల్లి ప్రశ్నిస్తుంది: "ఛీ! విశ్వాసఘాతకుడా! చివరకు వాడిని కృష్ణనదిపాలు చేసి వూరుకుంటావా?"

వెనకవైపున వున్న చిత్రంలోనుంచి అన్నగారి కంఠస్వరం వాత్సల్యంగా ధ్వనిస్తోంది: "నాయనా! కులాసాగా వున్నావా?"

బయటనుంచి క్రమక్రమంగా దగ్గరగా వినిపిస్తూన్న రాధాదేవికంఠస్వరం యీవిధంగా వినిపిస్తున్నది: "నిజంగా భగవంతుడు దయామయుడు! అందుకనే మాకీ త్రాసుబోతు పీడ త్వరలో ఒదిలించాడు......"

# అమరావతీస్తూపము - దాని గొప్పదనము

(గత సంచిక తరువాయి)

శ్రీ ఆమంచర్ల గోపాలరావు

సర్వహైందవశిల్పకళ ఉత్తీర్ణత అమరావతీస్తూపశిల్పములందు కానవచ్చునని సర్వపాశ్చాత్యతత్త్వవేత్తలు ఏకగ్రీవముగా వక్కాణించిరి. నిజముగకూడ నంతియే. ఈ మహత్తరమయిన అమరావతీస్తూపశిల్పములు క్రీస్తుకు తరువాత రెండువందల సంవత్సరములనుంచి అయిదువందల సంవత్సరములలోపున రచనలయినవని బర్గెసు, ఫెర్గూసను మొదలయిన మహాపండితుల అభిప్రాయము. కాని ఈమధ్య కానుపించిన నాగార్జునకొండశిల్పసంపద ఈ భావమును చాల వేరుపరచినది. ఎటులనగా, నాగార్జునకొండశిల్పములతో సహా అనేక ప్రాచీనశాసనములు బయలుపడినవి. ఈ శాసనముల ననుసరించి, సర్వనాగార్జునకొండశిల్పములు క్రీస్తుకు తరువాత మూడువందల సంవత్సరములకు పూర్వమే రచనలయినవని పండితులు నిర్వచించిరి. ఈ నాగార్జునకొండశిల్పము లన్నియు అమరావతీశిల్పముల ప్రతులను మాటవేయుతము పండితవాక్యమే. అందుచేత నిజముగా అమరావతీశిల్పములన్నియు క్రీస్తుకుతర్వాత మూడువందల సంవత్సరములకు పూర్వమే పూర్తిఅయియుండవలెనని మనము ఊహింపవలెను.

అమరావతీశిల్పములకు ముందుకాని, తర్వాత కాని రచనఅయిన ఏ హైందవశిల్పమందుకూడ అమరావతీశిల్పములకు మించిన స్వచ్ఛత, శోభ, సొంపు కానరాదనికూడ పండితవాక్యమే. అమరావతీశిల్పములనాటి వరకు, క్రమముగా సౌందర్యశోభలను ఇనుమడించుకొనుచువచ్చిన ఆంధ్రశిల్పశైలి దాదాపు ఒకటి, ఒకటిన్నర శతాబ్దములమాత్రము ఆరీతినే ఉన్నతపథమున నిలిచి, తరువాత క్రమముగా నీరసింపసాగి, తొలి స్వచ్ఛత, పుష్టి, శోభ తొలగి, చివరకు స్వంతరూపమునే కోలుపోయినది.

ఇంతవరకు చర్చించిన ఆంధ్రశిల్పభాగమంతయు నిజఆంధ్రదేశమున ఏర్పడినది గాక విదేశములందే రచన అయి నిలిచియున్నది. అందుచేత ఈ దివ్యఆంధ్రశైలి తొల్లి ఆంధ్రదేశమందు ఎందును పొడమునక, వేయి మైళ్ల దూరమున, మాళవదేశమందు సాంచిన పుష్పించి పశ్చిమమున మహారాష్ట్రదేశమున పర్యటనమొనర్చుచు వర్ధిల్లి, చివరకు స్వంతనికేతనమయిన అమరావతికి వచ్చి ఫలించినట్లుగా తోచి, ఆశ్చర్యమునే గాక సందేహమునుకూడ కలిగించవచ్చును. కాని ఈ దివ్యశైలి తొల్లి ఆంధ్రదేశముననే జన్మించిన నిజఆంధ్రశైలి అనుటకు ఏ సందేహమూ లేదు.

అమరావతీస్తూపస్థలము ప్రస్తుతము గుంటూరుకు ఇరువదిమైళ్ల దూరమున కృష్ణానదీతీరమున ఉన్నది. ఈచుట్టుపట్ల, నాగార్జునకొండప్రాంతమందలి దివ్యశిల్పసంపద కనుగొనకపూర్వమే, మూడువందల ఏబదికి పైగా ఇతరస్తూపస్థలములను పండితులు గుర్తించిరి. కాని ఈ స్తూపములన్నియు అనేక కారణములవలన శిథిలములయి, నేడు కానరాని వయినవి. కాని భట్టిప్రోలు, గుడివాడ, ఘంటసాల, జగ్గయ్యపేట, గోలి మొదలయిన స్థలములందు ఇట్టి స్తూపశిల్పములకు చెందిన కొన్ని శిలాఖండములు దొరికినవి. ఈ శిలలందు ఆనాటి శిల్పరీతి కొంత గోచరించును. ఈస్తూపములకు చెందిన దివ్యశిల్పములు ధ్వంసమగుటకు మన పశ్చా

నాశనములు సయితము కొంత కారణభూతము లయిన మాట వాస్తవము. కాలువవంతెనలకు, రోడ్లకంకర కొరకు ఈస్తూపముల దివ్యశిలలు వినియోగించిరని ఫెర్గూసను మొదలయిన పాశ్చాత్యపండితులే ఏకకంఠమున వాపోయిరి. నిజము!

భట్టిప్రోలుస్తూపమునకు చెందిన కొన్ని శిలాఖండములే కాక, మూడు అస్థికపాత్రలుసయితము దొరకినవి. ఇందు ముఖ్యమయినది స్ఫటికమందు మలిచినది. ఈ స్ఫటికపాత్రపయిన ఒక శాసనము కలదు. ఈ శాసనము దాదాపు క్రీస్తుకుపూర్వము కనీసము రెండు వందలసంవత్సరముల నాటిదని పండిత భూలరుగారు సెలవిచ్చిరి. ఇంతే కాక ఘంటసాల స్తూపశిల్పములు అతిప్రాచీన మయినవని అచట కనుపించిన శిల్పఖండముల శైలీగతులనుంచి ఏకముగా తెలియుచున్నది. ఈ శిల్పముల శైలి సాంచీతోరణశిల్పములకన్న పురాతన మయినదని వాటిరూపములు గమనించినంతనే తెలియును. సాంచీస్తూపములందువలెనే ఆశిల్పులు సయితము బుద్ధు డుండవలసిన కల్పనలందు బుద్ధరూపమును రచింపక, వట్టి చిహ్నములనే వాడిరి. అందుచేత సాంచీతోరణములవాటికి పూర్వమే, ఆంధ్రదేశమందు స్తూపములు నిర్మించుట, వాటిని శిల్పములచే అలంకరించుట బాగుగ అలవాటయినట్లు స్పష్టమగుచున్నది.

ఇంతే కాక, భట్టిప్రోలు, గుడివాడ, ఘంటసాల శిల్పములను పరీక్షించిన రే పండితుడు, ఈశిల్పముల శైలి అంతయు అమరావతీశైలిని సంపూర్ణముగా పోలి ఉన్నదని చెప్పెను. నిజముగా మిగిలిన ఆ స్వల్పశిల్పములు తిలకించినంతనే, ఆ శిల్పశైలి నిజఆంధ్రశైలి అయిన అమరావతిశైలికి మాతృక యని వెంటనే తెలియగలదు. అందుచేత అతిప్రాచీనకాలమునందే ఆంధ్రశిల్పము ఉత్తమశైలి ననుకరించుచుండెడిదని అనకతప్పదు. ఈకారణముననే, ఆంధ్రులు సామ్రాజ్యము నేలు కాలమున, శాతకర్ణి చక్రవర్తులు, దేశశిల్పశైలు లన్నియు గమనించి, ఆంధ్రశిల్పశైలియే ఉత్తమ మని గుర్తించి, సాంచియందు వాటికే నిలిచి ఉన్న స్తూపములను దివ్యశిల్పములచే నలంకరించుటకు తమ శిల్పులందు ఒకడయిన ఆనందుని స్థపతి (chief architect) గా చేసి, ఇతరశిల్పులను సయితము పంపియుండెను. ఈవిషయము సాంచీతోరణశాసనముల వలననే విదితమగుచున్నది. ఆనాటినుంచి ఉత్తమశిల్పగతిని ప్రదర్శించుటకయి, శాతకర్ణి సామ్రాజ్యము అంతరించిన తర్వాత సయితము ఆరేడువందల సంవత్సరములవరకు మన ఆంధ్రశిల్పులు దేశదేశముల కరిగి, దివ్యశిల్పసౌధములను నిర్మించు అలవాటు కలిగియుండిరి. నాడు ఆంధ్రులు మహాశిల్పగతిని లోకమునకు ప్రసాదింప పూని సల్పిన మహాకృషి నేటికిని దేశదేశములందు మహాదివ్యశిల్పసౌధములుగ అలరారుచున్నది.

ఆంధ్రసామ్రాజ్య మంతరించు కాలమున, స్వదేశము కోలుపోవుచున్న సామ్రాజ్యసంపదే కాక, సర్వసామ్రాజ్యములకు మించిన అత్యద్భుతశిల్పసౌధమును ప్రాచీనాంధ్రశిల్పులు ఆంధ్రపీఠమయిన అమరావతీనగరమున, కాలపర్యంతము ఆదర్శప్రాయమగు నవ్యరీతిన, మహాస్తూపముగా నిర్మించిరి. కాని ఈనాడు ఆంధ్రుల దురదృష్టమో యన, అమరావతీశిల్పములు ఆంధ్రదేశమున కానము. అందు మిగిలిన కొలదిశిల్పసంపదసయితము నేడు లండనునగరమున దివ్యరాగముల నాలాపించుచున్నది.

మన మెరుగగలిగినంతవరకు, అమరావతీస్తూపమును తిలకించి, అచ్చెరువంది, ప్రథమమున వర్ణించినది చీనాయాత్రికుడు హియూన్‌త్సాంగు. ఇతడు క్రీస్తుకు తరువాత ఏడవ శతాబ్దమున హిందూదేశపర్యటన మొనరించెను. ఈ దివ్యస్తూపము సర్వస్తూపములకు మిన్న అయి, బాక్ట్రియా సౌధములవలె వర్ణములచే అలంకృతమయినదని యాతడు వర్ణించెను. అంతేకాక ఇతర చరిత్రాంశముల ననుసరించి, క్రీస్తుకు తర్వాత పన్నెండు శతాబ్దములవరకు ఈస్తూపమును బౌద్ధులు యాత్రాస్థలముగనే పరిగణించుచుండిరని ఫెర్గూసను మహాశయుడు వచించెను. అటుతర్వాత చాలకాలమునకు, అమరేశ్వరుని దేవాలయముకొరకయి, ధరణికోటగోపురమందలి కొన్ని శిలలు, ఈ దివ్యస్తూపమునకు చెందిన కొన్ని శిలలు, చింతపల్లి రాజాగా రయిన వెంకటాద్రినాయుడుగారు పదునెనిమిదవ శతాబ్దమున

వినియోగించినట్లు చరిత్రాంశము. అటుతర్వాత కొంత కాలమునకు మెకన్జీగారు ఈస్తూపమును కనుగొని, మిగిలిన భాగములను వర్ణించిరి. తర్వాత అనేకమంది పండితులు ఈ దివ్యస్తూపభాగములను పరీక్షించి, అనేక విషయములుగ వ్రాసిరి.

ఈనాడు ఈ అమూల్యఅమరావతీస్తూపరూపమును తెలిసికొనుటకు, ఆ స్తూపభాగములందు మిగిలిన కొన్ని శిలలపైన శిల్పములే ప్రమాణములు. ఆ మహాశిల్పులు స్తూపశిలలపైన అమరావతీస్తూపప్రతిమను అనేకములు మలిచిరి. ఇంతేగాక, ఈ దివ్యస్తూప ప్రాకారమునకు చెందిన అనేక ఇతరశిలలను సయితము పరీక్షించి మహాశయులయిన ఫెర్గూసనుగారు ఈ మహాస్తూపమును గూర్చిన అనేకవిషయములను తెలియజేసిరి.

ఈ స్తూపరూపమును చూచినంతనే ప్రాముఖ్యముగా కన్పించునవి ఆయక వేదిక- ఆయక స్తంభములు. ఈ ఆయక వేదిక, స్తంభముల నిర్మాణము ఆంధ్రస్తూపములకు ప్రత్యేకము. ఒక్కొక్కప్పుడు ఆంధ్రస్తూపములందు ఆయక స్తంభములు అగుపడకపోవచ్చును. కాని ఆయక వేదిక లేని ఆంధ్రస్తూపము లేదు.

పురాతన ఘంటసాలస్తూపశిల్పఖండములందు చిత్రితమయిన స్తూపరూపములందు సయితము స్తూపమునకు నలువయిపుల ఆయక వేదిక, స్తంభములు స్పష్టముగా తెలియనగును. ఈమధ్య నాగార్జునకొండ శిల్పములను వెలికి తీసినతర్వాత ఈ ఆయక వేదిక, స్తంభములు ఆంధ్రస్తూపములను అలంకరించు అలవాటు ఉండుట స్థిరపడినది. ఆయక స్తంభములుగాని, వేదికగాని ఆంధ్రస్తూపములనుకాక మరి ఏ ఇతరస్తూపములను అలంకరింపలేదు.

స్తూపపీఠమునకు చక్రాకారముగ ఏర్పడిన అరుగును నాలుగువయిపుల చతురస్రముగా కొంతముందుకు కట్టి ఆయక వేదికలను ఏర్పాటుచేయుచుండిరి. ఈ ఆయక వేదిక పయిన నిటారుగా అయిదు ఆయక స్తంభములను నిలుపుదురు. ఈ ఆయక స్తంభములందు మధ్యది మిగిలిన నాలుగింటికంటె కొంచెము ఎత్తయి, స్తూపచిహ్నమును, బోధివృక్షచిహ్నమును కలిగి ఏకముగా గౌతమబుద్ధుని




ఆంధ్రస్తూపరూపక్రమము

నిర్దేశించుచును. మిగిలిన నాలుగింటిపైన గౌతముని జీవిత
మందు అద్భుతఘట్టము లయిన జననము, సంబోధి, ధర్మ
చక్రప్రవర్తనము, మహాపరినిర్వాణము అను నాలుగు
ప్రధానఘట్టములను చిహ్నరూపములందు మలిచి ఆ
ఘట్టములను నిర్దేశించెడివారు. కాని విడువయిన ఆ స్తం
భముఖములందు అతిఇంపుగా ఈ చిత్రములను పొదిపిన
ఆ శిల్పుల కల్పనాచాతుర్యము మెచ్చుకొనక తప్పదు.
అడుగున బౌద్ధప్రాకారరూపమును పీఠముగా మలిచి,
దానిపయిన భద్రఘటమును ఏర్పరచి, ఈఘటమునుంచి
ఉద్భవించినరీతి నిలువుగా కల్పలత నొకదానిని
నిర్మించిరి. ఈ కల్పలత శిరస్సుమీద మరల కుంభజనిత
మయిన పూర్ణస్తంభమును నిలిపి, దానిపైన సింహమును
చిత్రించి, గౌతమజననమును నిర్దేశించిరి. సంబోధిని నిర్దే
శించునపుడు ప్రాకారరూపమయిన ఒక కుబ్జను నిలిపి, ఆ
కుబ్జ కల్పలతను రెండుచేతుల ఎత్తిపట్టుకొన్నరీతిన
చిత్రించి, ఈ కల్పలత పైభాగమున బౌద్ధప్రాకార
మందు గౌతముని బోధివృక్షమయిన అశ్వత్థమును ఇరు
వయిపుల కొమ్మలను ఏర్పరచి, చిత్రించిరి. ఈ
రావిచెట్టురూపశిల్పము ఒకటియున్నర అడుగుమించని నిడివి
కలదయినను, ప్రతిఆకును వేరుగా మనము గుర్తించగలము.
ధర్మచక్రప్రవర్తనమును నిర్దేశించునపుడు ప్రాకారపీఠ
ముపైన నిలిపిన కల్పలతరూపము వేరు. ఈ కల్పలత
యందు పద్మములు కాక, త్రిరత్నసూచక కల్పన స్పష్ట
ముగా కానవచ్చును. ఈ కల్పలతపైన చతురస్రప్రాకా
రముమధ్య స్తంభమును నిలిపి, ఆ స్తంభశిరోభాగమున
పద్మకొన్నరేఖల చిత్రించి వాటిపయిన ధర్మచక్రమును
నిలిపిరి. మహాపరినిర్వాణశిల్పము పయితము జననచిత్ర
మురీతినే కల్పలతను నిర్మించి, శిరోభాగమున ప్రాకార
మందు స్తూపమును ఏర్పరచిరి. పీటన్నిటిపైన అర్ధపద్మ
ములు బోర్లించినరీతి కానవచ్చును. ఈ అర్ధపద్మములు
విశ్వప్రచ్ఛాదన మయిన ఆకాశసూచకములు.

అమరావతీ స్తూపనిర్మాణక్రమము అన్ని స్తూపముల
వలెనే ఒక పీఠము, పీఠముపయిన స్తూపగోళము, చుట్టు
ప్రాకారము. ఇతరస్తూపములందు కొన్ని భాగములు
మాత్రమే శిల్పములచే నలంకృతము. భారతస్తూపప్రాకా
రమునుమాత్రమే శిల్పము అలంకరించినది. సాంచియందు
తోరణములమీదమాత్రమే శిల్పకల్పనలు కానవచ్చును.
అమరావతీస్తూపము యావత్తూ ప్రాకార, పీఠ, ద్వార
ములు, చివరకు ఆయక స్తంభములతో సహా సంపూర్ణ
ముగా దివ్యశిల్పములచే అలంకృతమయినది. ఒక దివ్య
శిల్పవర్షము దీనిమీద కురిసి నిలిచి ఘనీభవించినట్లుగా
ఈ స్తూపము కానవచ్చును.

ప్రథమమున, ఈ స్తూపమునకు చెందిన శిలాఖండ
ములను ఏరి, కూర్చి, కొంతవరకు తొలిరూపమును వెలి
యపరచిన మహాశయుడు ఫెర్గూసనుపండితుడు. ప్రథమ
మున స్తూపపీఠముచుట్టూ ఏర్పరచిన శిలల ఒక ప్రాకార
మని తలచి, ఈ స్తూపమునకు రెండుప్రాకారము లని
వర్ణించిరి. కాని తర్వాత అవన్నియు స్తూపపీఠమునకు
చెందినవని గుర్తించి, ఏకప్రాకారమును గూర్చియే
ప్రసంగించిరి.

ఈ మహాప్రాకారము భారతప్రాకారముకన్న
రెండింతలు పొడవయినదేకాక, ఇరువయిపుల సంపూర్ణ
ముగా దివ్యశిల్పములచే అలంకృతమయి, అత్యాశ్చర్య
కర మయినది. ఇంతేగాక భారత, సాంచి నిర్మాణ
క్రమములందు కానపించు కలపరీతి ఈ మహాప్రాకా
రమునందు ఇసుమంతయు కానరాక, సంపూర్ణశిలానిర్మా
ణక్రమము గోచరించును. ఇది దాదాపు పదునాలుగు
అడుగుల ఎత్తయి, ౧౯౨ అడుగుల వెడల్పు గల చక్రాకా
రమున నిర్మితమయినది. ఈ చక్రములోపల ౧౬౨ అడు
గుల వెడల్పయిన చక్రాకారమున స్తూపపీఠమును నిర్మిం
చిరి. ఈరెండింటికిని మధ్య, స్తూపప్రదక్షిణమున కేర్ప
డిన స్థలమంతయు పలనాటి చలువరాళ్లతో పరిచిరి.
ఈ పీఠముపయిన దాదాపు డెబ్బది అడుగుల ఎత్తున
గోళాకారముగ స్తూపమును నిర్మించిరి. ఈ స్తూపము
యావత్తూ చలువరాతితో కప్పి, అనేకదివ్యశిల్పములచే
అతివిరివిగా అలంకరించిరి.

అందుచేత నిజముగా పండితులు ఊహించిన
యట్లు, ఈ దివ్యస్తూపనిర్మాణాలంకారములు యావ
త్తూ దాదాపు రెండుమూడువందల సంవత్సరములు పట్టి
యుండవచ్చును. అందుచేత కాలానుగుణముగా ఈ
స్తూపశిల్పములశైలి అనేకరీతుల కానవచ్చుట సహజము.
అయినప్పటికి, ఈ స్తూపశిల్పములన్నియు సంపూర్ణ

ముగా దివ్యఆంధ్రశైలిని అనుసరించి, ఏకశిల్పినిర్మితము గానే కనుపించి, మహదాశ్చర్యకారణమయి ఉన్నవి. కొన్ని కల్పనలందు కానవచ్చు ఉత్కృష్టత కొన్నిటి యందు లేదని అతిసూక్ష్మపరీక్షచేకాని తెలియదు.

సాంచీశిల్పరీతిని పోలి, గౌతమబుద్ధుని రూపము లేక, చిహ్నముచేతనే అతని నెరుకపరచిన శిల్పమును ఫెర్గూసనుపండితుడు ఈశిల్పములందు చూచి, బహుశా సాంచివాటికి ఇచట ఒక చిన్నస్తూప ముండియుండ వలయుననియు, తర్వాత కొంతకాలమునకు ఆ స్థానమందే ఈ మహాస్తూపమును నిర్మించిరనియు అభిప్రాయమును సూచించిరి. అందుచేత ఆంధ్రగర్భమయిన అమరావతీప్రాంతమందు, సాంచివాటికే, శిల్పాలంకృతములయిన రాతిస్తూపములు నిర్మించుచుండిరని మరింత స్థిరమగుచున్నది. కాబట్టి చరిత్రాంశకముగా పయికను మన దివ్యఆంధ్రశిల్పశైలిజననము సాంచి యందు కాక ఆంధ్రగర్భమందయిన అమరావతీప్రాంతమందే అని ఘంటాపథముగా చెప్పవలయును.

ఇరువయిపుళా దివ్యశిల్పములచే అలంకృతమయి, మహత్తరమయి పండితు లందరిని ఏకముగా ఆశ్చర్యమున ముంచివేసిన ఈ అమరావతీప్రాకార నిర్మాణక్రమమును ఒకింత గమనింపవలసియున్నది. ప్రాకారముపొడుగునా నేలన పీఠభాగముగా రెండడుగుల ఎత్తున అడ్డపట్టికగా, ఒక శిలను ఏర్పరచిరి. దీని ముఖముపయిన వృషభము మొదలయిన జంతురూపములు అతివేగవంతముగా పరుగిడుచున్నయట్లు ఇంపుగా మలిచియున్నవి. ఈ వృషభరూపములందు వాటి సహజఅపారబలముతో సమకూడిన సంతోషము పూర్తిగా విదితమగుచున్నది. మధ్యమధ్య ఒక గొల్లడు ఆ ఎద్దుల తోకలు పట్టుక పరుగెడుతున్నట్లు చిత్రించిరి. ఇంత చిన్నవయినను, ఈ జంతురూపములు ప్రకృతిరూపతుల్యములయి, పరుగెడుతున్న వాటి వేగమును మనోల్లాసముతో సయితము స్పష్టముగా తెలుపునవయి, సంపూర్ణజీవయుక్తముగా ఉన్నవి. ఈ జంతురూపములందు కొన్ని చిత్రమయిన సింహరూపములు సయితము కలవు. ఈసింహముల భుజభాగములందు చిన్న రెక్కలను అతిఇంపుగా ఆ శిల్పులు అమర్చిరి.

ఈ రెక్కలు కల జంతురూపములు మన ప్రాచీనశిల్పములందు అక్కడక్కడ కానపించునని ఇదివరకే చెప్పనయినది. ఈరెక్కలు కల జంతురూపములు ప్రథమమున అసీరియా (ప్రాచీనపరిషియా) యందు వెలసిన మాట వాస్తవము. కాని అవి ఆ దేశీయుల దేవతాస్వరూపములు. మన దేశీయులు ప్రథమమున అసీరియావారిందే ఈరీతిశిల్పములను చూచి అలంకారార్థముయి మనదేశ శిల్పములందు చేర్చియుండవచ్చును. కాని కొందరు పాశ్చాత్యపండితు లన్నరీతి ఇటువంటి శిల్పరూపములు మన శిల్పులు వాడినందువల్ల విదేశీయశిల్పశైలిని మనవారు అలవరచుకొని, శిల్పమందు ప్రాచీన్యత గణించిరని అనుకొన నవసరము లేదు. నిజముగా అసీరియాశిల్పశైలియందు కానవచ్చు పుష్టి అతిబాహ్యపరమయి, మొరటుగకూడ కాన్పించును. మన దేశశైలియందలి పుష్టి అంతర్గతము. అపయిన మన దేశశైలియందు ఉండు ప్రధానగుణమయిన లావణ్యము అసీరియాశిల్పములందు ఎందునూ కానరాదు. అందుచేత మన శిల్పముల శైలియే వేరయి, అసీరియాశిల్పములను ఏమాత్రమూ పోలదు. కాని అసీరియాయందు మన దేశీయులు చూచిన కొన్ని శిల్పరూపములందలి నవీనత మన శిల్పులను ఆకర్షించి, అలంకారార్థముగా మన శిల్పములందు వినియోగించిరి.

ప్రాకారమునకు పీఠముగా అమర్చిన ఈ అడ్డశిలపయిన నిలువుగా దాదాపు మూడడుగుల లావయిన స్తంభములను మూడడుగుల కొకటిచొప్పున నిలువుగా నిర్మించిరి. ఈ స్తంభములు చతురస్రములు. ఈ స్తంభముల ముఖములంతయు శిల్పములచే నలంకరించిరి. మధ్య నొక పూర్ణచిత్రపద్మము, దానికి పైన, క్రింద రెండు అర్ధచిత్రపద్మములు అతిదీర్ఘముగా మలిచిరి. ఈ చిత్రపద్మములకు మధ్య ఏర్పడిన ఖాళీ భాగములందు అనేకదివ్యరూపశిల్పములను అమర్చిరి. ఈ రూపశిల్పములందు అనేకపడగలుకల నాగసర్పములు, మానవరూపములు, విడిగాకాని, సంకలన

యుక్తముగా కాని అనేకరీతుల కన్పించును. ఈ స్తంభములకు మధ్యను ఉన్న భాగములందు మూడు చతురస్రశిలలను అడ్డముగా పొదిగిరి. ఇవి కూడ మూడడుగుల వెడల్పు. వీటన్నిటి ముఖములు సయితము పూర్ణచిత్ర పద్మములచే నలంకరించిరి. ఇంతేకాక, అడ్డముగా నిర్మించిన శిలలు శ్రేణులుగా జరుపగా ఏర్పడి, ఒక్కొక్క శ్రేణి ఒక్కొక్క శిలగా కనుపించును.

వీటన్నిటికిపయిన ఒక శిలాపట్టికారూపమున ప్రాకారశిరోభాగముగా అమర్చిరి. దీని ముఖమంతయు ఏకముగా ఒక కల్పలతను అనేకమంది మోసుకపోవుచున్నట్లు అతినిపుణతతో ఆ శిల్పులు మలిచిరి. ఇతర నిలువుకల్పలతలవలె కాక, ఈ కల్పలత అతి చిత్రమయినది. దీనియందు ఫలపుష్పములు కానరావు. అనేక మణిమయసువర్ణాభరణములు ఈ లత ధరించుచుండును. ఈ లతసయితము ఒక పెద్ద ముత్యాల సరమువలె ఉండును. ఈ లతాశిల్పమందు మోసుకొని పోవువారి భంగిమయందు లతాభారము స్పష్టముగా తెలియవచ్చును. ఈలతనుంచి వ్రేలాడు ఇతరఆభరణముల రీతి ఆ మోసుకొనిపోవువారి ఉరవడి తెలుపును. శిల్పమందు వివిధభాగములను ఏర్పరచు రీతులు, కల్పనకంతయు అర్థము నిచ్చి సజీవము చేయగల పద్ధతులు, శిల్పులు అనాడు సంపూర్ణముగా ఎరిగియుండిరి. దివ్యముగా మలిచిన ఈ అమరావతీప్రాకారశిరోభాగముఖమును చూచినపుడు, ఈ స్తూపమును అలంకరించుటకే మహాదాభరణమును ఒకదానిని అనేకులు మోసుకొని పరువెడుచున్నట్లు తప్పక తోచును. ఈ మహాప్రాకారబాహ్యముఖశిల్పమంతయు కట్టి అలంకారయుతమని ఫెర్గూసను పండితుడనెను. ఈశిల్పము అలంకారయుతమే అయినప్పటికి సంపూర్ణ భావభరితమయిన అపూర్వ, అద్భుతాలంకారశిల్పమనిమాత్రము ఎరుగవలెను.

ఈ మహాప్రాకారమునకు లోపలి వయిపున, బయట పీఠభాగమందున అడ్డశిల కానుపించదు. ఎందుకనగా నేలపయిన, ప్రదక్షిణపథమునకును అంత యెత్తున చలువరాళ్లతో పరచిరి. ప్రదక్షిణముచేయు ఉపాసకుల మనస్సులు బౌద్ధమతతత్వగతిని పక్వమొనరించుటకు కాబోలు, ఇటువయిపున ప్రాకారముఖమంతయు బౌద్ధఇతిహాస, తత్వార్థచిత్రములచే అలంకరించిరి. అడ్డశిలలమీదను, నిలువుకంబములపైనను వెలివయిపున చిత్రపద్మములు అలంకరించిన చాలస్థానములందు పలుయుపతకములను ఏర్పరచి, ఈ పతకముల ముఖమంతయు బౌద్ధమతశిల్పములచే అలంకరించిరి. కొన్నికొన్ని చోట్ల వెలివయిపునవలెనే చిత్రపద్మములు కానవచ్చును.

ఈ కల్పనలందు ప్రకటితమయిన శిల్పచాతుర్యము అగణితము. ఈశిల్పములను పరీక్షించిన ఫెర్గూసనుపండితుడు ఇతరన్నియు రాతియందు మలిచిన శిల్పములవలె కాక, దంతపుపనిని స్మృతికి తెచ్చునవై, అతి సున్నితముగా ఏర్పడి, సొంపును అతిశయించుచున్నవని నుడివిరి. ప్రాకారము లోవయిపున మలిచిన పద్మములందు సయితము ఈ గుణము కనుపించి, వెలి పద్మములకన్న లావణ్యశోభలందు అతిశయించినవని చెప్పవలెను. బహుశా ప్రాకారము బయటివైపు మలిచిన కొంతకాలమునకు లోపలివయిపున శిల్పులు మలిచి అలంకరించియుండవచ్చును. ఏది ఎట్లయినను ఈ అమరావతీశిల్పములు సర్వశిలాశిల్పరహస్యములను ఎరిగిన తర్వాతనే ఆంధ్రశిల్పులు మలిచిరనుట స్పష్టము.

ఈ మహాప్రాకారశిల్పములందు గమనింపవలసిన ముఖ్యవిశేష మొకటి కలదు. ఈ దివ్యశిల్పములన్నియు వాస్తువును అలంకరించు ఆభరణములు మాత్రమే కాక, వాస్తుభాగము అయినవి. ప్రాకారముఖములందు రచనలయిన కల్పనలు అమర్చినచోట పూర్తిగా ఇమిడి పోయినవి. ఆయాస్థలములందు వేరువిధములయిన కల్పనలకు తావు లేదు. ప్రాకారశిరోభాగమందున శిలాముఖమున మలిచిన మహామాలవాహకుల కల్పన ఇతర భాగములందు ఇమడనేరదు. అంతేకాక మరొక స్థలమున వికృతముగ సయితే మది కల్పింపగలదు. మరియు ఆ శిల్పమందలి భావము సయితము మరొక చోట రాణించదు. ప్రాకారముఖమందున్న చిత్రపద్మములు సయితము ప్రాకారశిలలను బిగించు భాగములై

కప్పడి, అత్యంత సుందరవాస్తుభాగములుగా తోచును. ప్రాకారపీఠముపయిన చిత్రించిన జంతువుల వరుసనయితేను మరొకచోట ఇమడదు. జంతుసమూహము నేలపైననే విహరించుచు, స్తూపముచుట్టు అతివిలాసముగా ప్రదక్షిణము చేయగలవు. ప్రాకారఅంతర్ముఖమును పయిభాగము అలంకరించిన శిల్పము లన్నియు ఇదే రీతిగా వాస్తుభాగములే అయినవి. ఈ రచనలందు ఏది లోపించినను, ప్రాకారమందు వెల్తి తప్పక కానవచ్చును. అందుచేత ఇంత విరివిగా శిల్పములు అలంకరించినను, ప్రాకారమందు అలంకారభావము ఏ మాత్రము మించక భారము కాలేదు. ఇట్టి దివ్యమహాశిల్పనిధిగ తద్దివ్యప్రాకారనిర్మాతలయిన శిల్పులు బ్రహ్మసమానులేకాక బ్రహ్మలు అనే అనవలసియున్నది.

ప్రథమమున ద్వితీయప్రాకారభాగములని భ్రమ కలిగించిన, స్తూపపీఠముఖమును అలంకరించిన శిల్పములునయితేను తప్పక గమనించవలసినవి. ఏలనన, ఈ శిల్పములు రూపమునకేకాక, శిల్పోద్దేశమందునయితేను చాల ఘనమయినవి. ప్రాకారమునకు లోపలి ముఖమున రచనలయిన శిల్పములవలె ఇవికూడ ప్రదక్షిణము చేయు ఉపాసకుల దృష్టిని తప్పక ఆకర్షించును. అందుచేత నిర్వాణమును నపేక్షించు ఆ ఉపాసకుల మనస్సులను మరింత పక్వమొనరించుటకు తత్వశిల్పములనే ఇచట ఏర్పరచవలసియుండును. ఋషిసమానులయిన ఆనాటి ఆంధ్రశిల్పులు ఈ అవసరతను గుర్తించి గౌతమబుద్ధుని మహాపరినిర్వాణచిహ్నమయిన స్తూపరూపములను అనేకరీతుల ఈ పీఠభాగమందు అమర్చిరి. ఈ స్తూపరూపములన్నియు అమరావతీస్తూపరూపమునే అనుసరించినందువలన నాటి అమరావతీస్తూపరూపావగాహనమునకు ఈ శిల్పములు నేడు ప్రమాణములుకూడ అయినవి.

ఈ మహాపీఠము ఆరుఅడుగులు ఎత్తయి ౧౬౨ అడుగుల వెడల్పయిన చక్రాకారమున నిర్మితమయినది. అందుచేత అతిదూరమునుంచిమాత్రమే కానగలుగు ఈ మహాస్తూపరూపమును ప్రదక్షిణము చేయు ఉపాసకుడు చూడలేడు. ఈవిషయమును నయితేము ఆ శిల్పులు గుర్తించి, ఈభాగమందు మలిచిన సర్వస్తూపరూపములు అమరావతీస్తూపపు ప్రతిబింబములుగానే చిత్రించిరి. పండితఫెర్గూసనుగారు ఈ స్తూపరూపశిల్పములు దాదాపు మువ్వది ఉండవచ్చుననిరి. పైనచెప్పిన కారణములవలన ఈ స్తూపప్రతిబింబముల సంఖ్య ఆశ్చర్యమును కాని, వింతకాని కొలుపనవసరము లేదు.

ఈ స్తూపచిత్రములన్నియు ఇతరరూపశిల్పములకు మధ్య ఇమిడి, అతి రసవంతమయినవి. ఇవన్నియు అమరావతీస్తూపప్రతిబింబములే అయినను, పరీక్షించి చూచిన, కొలది భేదముతో కానవచ్చును. ఈస్తూపరూపశిల్పములన్నిటియందును ప్రాముఖ్యముగా ఆయక స్తంభములు, ఆయకవేదిక కానవచ్చును. ఈ అనేకస్తూపప్రతులందు ఆయక వేదికముఖములుమాత్రము వివిధరూపశిల్పములచే అలంకృతమయినవి. ఈ ఆయకవేదికశిల్పములు, సరిగా ప్రాకారద్వారముల నెదురయి, స్తూపప్రాంగణమురీతిన కానవచ్చును. స్తూపపీఠముపయిన చిత్రితమయిన ఈ అమరావతీస్తూపప్రతులందు కల భేదము ఈ ఆయకముఖవేదికముఖచిత్రములందు కానవచ్చును.

కొన్ని ఆయకవేదికముఖచిత్రములందు అనేక పడగలు గల నాగసర్పముపైన ఉపవిష్టుడయిన, గౌతమ బుద్ధుడు కానవచ్చును. కొన్నిటియందు నాగసర్పము లేక, వట్టి పద్మాసనుడయిన బుద్ధుడుమాత్రమే కానవచ్చును. మరికొన్నిటియందు, నిలిచి ప్రబోధమొనర్చు బుద్ధు డుండును. ఒక్కొక్కప్పుడు బుద్ధునితోపాటు ఒక అశ్వ ముండును. ఒకప్రతియందుమాత్రము వట్టి హయరూపమే కానవచ్చుచున్నది. కొన్నిటియందు ధర్మచక్రముమాత్రమే కానుపించును. కొన్నిటియందు నాగసర్ప మొకటి బుద్ధుని కాళ్లకు పెనవేసుకొనియున్నట్లుండును. ఒకదానియందు బోధివృక్షముమాత్రమే కలదు. మరొకదానియందు వట్టి అస్థుల పేటికరూపమే కలదు. మరొకదానియందు పరిచారకసమేతుడయిన నాగరాజు కనుపించును. ఆరింటియందు మాత్రము అయిదు పడగలు కలిగిన నాగసర్పము చిత్రితమయినది.

ఈ స్తూపరూపములను ఇన్ని ప్రత్యేక కల్పనలతో మలిచిన ఉద్దేశ్యము, గౌతమబుద్ధుని జీవితయాత్రయందలి అద్భుతఘట్టములను, తదనుసారితముగా వివిధతత్త్వభావములను వరుసగా స్ఫురింపజేయుటకు అని వేరుగా చెప్పనక్కరలేదు. సంస్కారముండి, నిర్వాణాపేక్షతో అచటికి వచ్చి, ప్రదక్షిణ మొనర్చు ఉపాసకునకు ఈ శిల్పశ్రేణి నిర్వేదభావమును ఉదయింపజేసి, శాంతరసానుభవము, తద్వారా చిత్తశుద్ధి తప్పక ఆనాడు కలిగించుచుండియుండవలయును. శిల్పకళ ముక్తికి ఒక ప్రబలసాధన మని ఆనాటి ఆంధ్రశిల్పులు కనుగొనిరి. నిజము!

అమరావతీస్తూపపీఠముఖమును స్తూపప్రతులు అనేకములు అలంకరించినప్పటికీ, రసానుభవప్రేరేపణకయి వివిధభావకుడ్యోద్దేశములతో ఇవి రచనలయినందువలన, ఈరూపములందు పునరుక్తిదోషము ఏమాత్రము గోచరింపదు. ప్రతిస్తూపరూపము ఒక నూతనకళావిశేషముగనే కనుపించును. ఇవన్నియు రాగమందు సంగతులవంటివి.

క్రీస్తుతర్వాత రెండుమూడుశతాబ్దములవరకు రసప్రకరణమునందు ఎనిమిది రసములుమాత్రమే ఉండెడివనియు, అటుతర్వాతనే పండితులు నిర్వేదభావమును గుర్తించి, శాంతరసమును కనుగొని, నవరసములు చేసిరనియు పండితాభిప్రాయము. శిల్పమందు శాంతరసమును ప్రవేశపెట్టుటకు అమరావతీశిల్పములందు ఆంధ్రశిల్పులు ప్రథమసోపానమును ఏర్పరచిరని తప్పక అనవచ్చును. ఎందుకనగా, తత్పూర్వము నిర్మాణమయిన శిల్పములందుకాని, చిత్రకళయందుకాని ఈ నిర్వేదభావమును ఉదయింపజేయగలుగు అంశము లంతగా గోచరింపవు. ఈ నిర్వేదభావాంశములు ప్రబలఉద్దేశపూరితములయి, అమరావతీశిలలందు స్పష్టముగ కానవచ్చును. ఇంతేకాక శాంతరసప్రధానమయిన అనేకబుద్ధరూపములు, బోధిసత్త్వరూపములు, ఇతరశిల్పములు, అమరావతీశిల్పానంతరమే, అనగా క్రీస్తుతర్వాత రెండుమూడు శతాబ్దముల అనంతరము రచించినవే కానుపించును. అందుచేత శిల్పమందు నిర్వేదభావబీజములు ఆంధ్రశిల్పమందే ఏర్పడిన వనదగును. ఆంధ్రకళ సర్వసౌందర్యకళలకును ఒక నవ్యదివ్యరచనమునే ప్రసాదించిన మహాకళ.

స్తూపపీఠముఖఊర్ధ్వశ్రేణిశిలల పైభాగమున చిన్నచిన్న గుంటలు మలిచియున్నవనియు, అందుచేత ఈ శిలల పైభాగమంతట లోహనిర్మితఅలంకారములు ఉండియుండవలయు ననియు ఫెర్గూసనుమహాశయుడు అనెను. ఈ అలంకారము లన్నియు త్రిరత్నచిహ్నరూపములే అయియుండునని ఆయనగారే అనిరి. నిజముగా అదేరీతిన, అనేకత్రిరత్నచిహ్నములు ఆనాడు ఈ దివ్యస్తూపమును అలంకరించియుండవచ్చును. కాని ఇంత దివ్యశిల్పమయమును, బౌద్ధుల నిజపుణ్యక్షేత్రమునయిన ఈ మహాస్తూపమునకు అలంకారములు వెండితోనో, లేక బంగారుతోనో వాటి అంగములు తప్పక నిర్మించియుండవలయును. కాక ఏ ఇనుముతోనో, లేక రాగితోనో ఈస్తూపమును ఆనాడు అలంకరించియున్న, ఈఅలంకారభాగములు కొన్ని అయినను, ఈనాడు మనకు దక్కియుండెడివి. నిజము! ఇదంతయు ఒక ఊహామాత్రమే. అయినను ఒక్కొక్కప్పుడు ఊహలే అతిదివ్యతమములు.

ఈ మహాస్తూపప్రాకారద్వారము సాంచీతోరణములవలె కాని, అనేక ఇతరశిల్పములందు కానవచ్చు ద్వారములవలె కాని లేదు. స్తూపమును చుట్టివచ్చుచున్న ప్రాకారము ఇచట రెండువయిపుల ఆగి, ముందుకు వచ్చి నిలిచినది. ముందుకు వచ్చిన ఈ రెండు పార్శ్వకుడ్యములు ప్రాకారమునకన్న ఒకింత పొట్టి. ఈ కుడ్యములకు ముందు రెండు పూర్ణస్తంభములను నిలిపిరి. ఈకుడ్యములపైన రెండు సింహములు, అచటికి వచ్చువారి నందరిని పరీక్షించుచున్న రీతి ఆశిల్పులు నిర్మించిరి. సరిగా ప్రాకారమునకు పైన, ద్వారమునకు ఇరువయిపుల, ద్వారరక్షణ చేయుచు కూర్చున్నరీతి మరిరెండు సింహములు ఉండును. ఇది సింహద్వారము.

సింహద్వారమునకు సరిగా ఎదురున, ఆయకవేదిక అతిగాఢముగా కన్పించును. ఈ వేదికముఖమందు స్తూపహృదయచిహ్న ముండును. పైన వర్ణించిన

రూపేములందు ఏరూపము ఆయక వేదిక ముఖమును అలంకరించుచుండెడిదో మనము ఊహింపలేము. కాని స్తూపమునకు ఉన్న నాలుగు ఆయకముఖములందును గౌతముని జన్మమందలి నాలుగు అద్భుతఘటనములు, అనగా జననము, సంబోధి, ధర్మచక్రప్రవర్తనము, మహాపరినిర్వాణము, గౌతముని చిత్రములో సహా చిత్రితమయియుండవచ్చునని మనము అనుకొనవచ్చును. లేదా నాగపూజలు అనాదినుంచి మన ఆంధ్రభూమి యందుఅలవాటయినందు వలనను, బౌద్ధఇతిహాసములందు గౌతమబుద్ధునికి, నాగులకు సంబంధము చాల ఏర్పడియున్నందువలనను, అనేకపడగల నాగసర్పములు కూడ ఈస్థానము అలంకరించియుండవచ్చును. అది ఏవి యైనను, నేడు మనకు కానరావు. కాలము దంత రించినరీతి, ఈ దివ్యశిల్పములు మాయమయిపోయినవి. ఈ దివ్యఆయక వేదికపయిన, ముందుకు వచ్చుచున్న ఒక చూరుపయితము కానవచ్చును. ఆయక వేదికపయిన అయిదు ఆయక స్తంభములు నిటారుగా కానవచ్చును. ఈ ఆయక వేదికలు, ఆయక స్తంభములు నాలుగువయి పులా ఉన్నట్లు స్తూపప్రతులందు తెలియగలదు. కాని సింహద్వారమునకు ఎదురుగా కానవచ్చు ఆయక స్తంభ ములకెక్క మిగిలిన మూడువయిపుల మూడుసింహములు ఈ ఆయక స్తంభములను రక్షించుచూ ఉన్నరీతిన నిర్మించినట్లు తెలియవచ్చును.

సరిగా ఆయక స్తంభములు మొదలిడు స్థానమందే స్తూపపీఠభాగ మంతరించును. ఇకటనుంచి స్తూప గోళముపయితము ప్రారంభమగును. ఈ గోళముఖ మంతయు ఆయక స్తంభముల ప్రమాణమంత ఎత్తువరకు, అనేక చతురస్రభాగములు చేసి దివ్యరూపశిల్పములచే అలంకరించిరి. అపయిన కొలదిభాగము మాత్రము ఖాళీగా వదలి గోళగ్రీవమందు ఆభరణాయుతముగా, పెద్దహారమురీతిన, ఒక అఖండశిల్పమును మలిచిరి. ఈ మహాభరణమందు సయితము ఒక శ్రేణియందు అక్కడక్కడ కొన్ని వలయములను, చతురస్రము లను పతకములుగా మలిచిరి. ఈపతకములందు సయి తము రూపకల్పనలు శిల్పితమయియున్నవి.

అటుతర్వాత శిరోభాగమువరకు ఖాళీగానే కన్పడును. స్తూపశిరస్సుపయిన ఒక అస్థులపేటిక కలదు. ఈ పేటికనిర్మాణమందుసయితము కలుష నిర్మాణక్రమము ఏమియు కానరాదు. పూర్ణ శిలా నిర్మాణక్రమమే గోచరించును. ఈ పేటిక పై అంచు సయితము లతారూపశిల్పముచే అలంకృతమయినది. ఈ పేటికపయిన ఒక రాతిఛత్రమును దివ్యముగా మలిచి నిలిపిరి. ఈ ఛత్రమునకు ఇరువయిపులా రెండు పతా కములు సయితము కానవచ్చును. ఈ పతాకములను ఆనాడు వారు ఛత్రమునకు కట్టియుండవచ్చును.

అమరావతీమహాస్తూపము ఒక క్రమమున నిర్మా ణమయి, ప్రాకారము, ద్వారము, పీఠము, ఆయక స్తం భములు, శిల్పములు, ఖాళీస్థలములు ఒక నిశ్చితసంక లనపద్ధతిని అనుసరించి ఏర్పడినందువలన, మహావాస్తు ప్రదర్శనమయి దూరమునుంచి ఒక అద్భుతఏకచిత్తరు వువలె కనుపించి, అతి ఆశ్చర్యకరమయినదిగా ఉండి ఉండవలెను. ఈ దివ్యస్తూపరూపమును తిలకించి, హియూన్ త్సాంగు మొదలయిన యాత్రికులు విస్మయము లొటయుండుట విశేష మేమియు లేదు.

అమరావతీశిల్పములు రచించునాటికి ప్రాచీ నాంధ్రశిల్పులు రాతి శిల్పరహస్యములను సంపూర్ణముగ ఎరుగుటయేగాక, శిల్పశైలియందు ఉత్కృష్టత గణించి రని మండే అవసరమయినది. సాంచీతోరణములను మించి, అజంతావర్ణచిత్రములందువలె, అనేకరూప ములు, వివిధభంగిమలందు, ఈశిల్పములో కాన వచ్చుటయేకాక రూపరచన శైలియందు సయి తము పరిపూర్ణ పరిపక్వత కానవచ్చును. రాతిశిల్ప పద్ధతులు, చదరచిత్రరచనాపద్ధతులు ఈ శిల్పములందు సమముగా మిశ్రితమయినందువలన ఆంధ్రశిల్పమునకు ప్రత్యేకగుణమయిన రేఖాప్రాముఖ్యత అతి స్పష్టముగా కానవచ్చును. చదరచిత్రపద్ధతులను పూర్ణముగా అనుసరించిన ఈ దివ్యశిల్పములను వర్ణములచే ఆ శిల్పులు ఏల అలంకరించలేదని కొంత సందేహము కలుగవచ్చును. కాని ఆ శిల్పములను అన్నింటినీ, స్తూపము యావత్తుసయితము అతిదివ్య వర్ణములచే నాడు అలంకరించిరని పురాతత్వవర్ణనల ననుసరించి తెలియుచున్నది. ఇంతేకాక ఈ శిల్పముల

మయిన వాటి వర్ణముల ఛాయలు సయితము కొంత వరకు ఈనాటికిని తెలియనగుచున్నవని పండిత వాక్యము. అందుచేత ప్రాచీనఆంధ్రశిల్పులు ఏపొర పాటు ఒనరించక, ఈ మహోత్తానమును సంపూర్ణముగా వర్ణములచే అలంకరించియుండిరి.

ప్రథమమున సాంచీతోరణశిల్పములందు బయల్పడి, సర్వఆంధ్రశిల్పములందు వర్ధిల్లుచువచ్చిన ఆంధ్రశైలి ప్రత్యేకశిల్పలక్షణములన్నియు ఈ దివ్యశిల్పములందు ఉత్తీర్ణత గాంచి, మూర్తీభవించినవి. అమరావతీ శిల్పములందు కానవచ్చు స్త్రీరూపములందు సాంచీ శిల్పములనాట బీజమందిన విలాసమయరతిభావగతి పరిపూర్ణత వహించినట్లు స్పష్టముగా తోచును. ఈగతి ననుసరించి, స్త్రీశరీరభాగములందు అనుసరచవలసిన అతిశయోక్తి సమమయి, అతిఇంపుగా అమరావతీ శిల్పములందు విదితమయి, అమరావతీస్త్రీరూపముల సొంపును అద్వితీయ మొనరించినది. ఈగతి ననుసరించియే రూపరచనలందు ఆభరణయుత మొనర్చు రీతిసయితము అమరావతీశిల్పములందు ప్రబలమయినది. ఈ ఆభరణయుత మొనరించు గుణమును ఎరుగుటకు, ప్రాచీనత్రిరత్న చిహ్నములను, సాంచీతోరణ త్రిరత్నచిహ్నములను, అమరావతియందు రూపొందిన త్రిరత్నచిహ్నములను మాత్రము ఒకటిరి పోల్చిచూచిన చాలును. ఈ ఆభరణయుతశైలి అమరావతీశిల్పములందు పక్వమయి, శిల్ప భావమును ఏమాత్రము మించక, అతిసమమయి, మిక్కిలి రమణీయమయినది.

ఇంతేకాక రూపనిర్దేశమందును, రూపరేఖలరచనలందును, అపారమయిన స్వేచ్ఛ, తదనుసారితముగా శిల్పమందు ఏర్పడు విశాలత, బాహుళ్యము ఈ దివ్య శిల్పములందు సంపూర్ణత గాంచినది. ఈ శిల్పరచనలందు విదితమవు స్వేచ్ఛ, సాహసము ఏమాత్రము హెచ్చయినను, శిల్పరూపములు లావణ్యముతప్పి, తప్పక వికృత రూపముల నందికొనగలవు. శిల్పఅంతర్భావగతి ననుసరించి శిల్పమునందు ఏర్పడు స్వేచ్ఛలే ఈ శిల్పములందు ఉట్టిపడుచున్నవి. ఏ రూపరచనయందు సయితము, శిల్పి ఉద్దేశించని నిమ్నోన్నతములు కాని, రేఖలుకాని, ఇతర అలంకారములుకాని ఈ శిల్పములందు కానరావు. చివరకు సింహరూపములకు వాడిన పత్రములు సయితము అతిసమమయి, ఏ వికృతమును తోపనీయక, ప్రకృతిని అతిశయించిన భావమును మరిపించి, అతిలావణ్యపరమయి, నిజముగా తోచును. ఇదేరీతిన రెక్కలుఅమర్చిన అసీరియామృగశిల్పములను ఒకసారి గమనించిన కాని ఆంధ్రశిల్పుల నిపుణత తెలియుట కష్టము. రెక్కలు అమర్చిన అసీరియామృగరూపములందు, రెక్కలుఅతిభారములయి, శిల్పరూపము ప్రకృతినితప్పిన మాట స్ఫుటముగ గోచరించి, కొంతవెగటుగకూడ తోచును. నిజముగా, పక్వతకన్న ఆంధ్రశైలిని మూర్తీభవించిన ఈ శిల్పములనుకాని, శిల్పలక్షణములనుకాని పూర్తిగా వర్ణించుట అసాధ్యము. రసికునకు ఆ దివ్యశిల్పములను వీక్షించియే బ్రహ్మానందము అందవలసియున్నది.

ఈ దివ్యశిల్పములందు అతిప్రత్యేకముగా కానవచ్చు హయరూపములనుగూర్చిమాత్రము కొంత ప్రసంగించు అవసరత కలదు. సర్వహైందవశిల్పమందును, హయరూపనిర్దేశము కొంత నీరసించినరీతి కానవచ్చును. ఆంధ్రశిల్పములయిన సాంచీ, అజంతాలందు సయితము హయరూపములు అప్పుడప్పుడు కానవచ్చును. ఇవి కూడ అంత ఇంపుగా లేవు. అమరావతీ శిల్పములందు హయము అనేకదృశ్యములందు ప్రకృతిని ప్రతిబింబించు రీతిన అతిఇంపుగా కానవచ్చును. ఈహయములు సాధారణముగా మన దేశమందు కానవచ్చునవి కాక, ఉత్తమ జాతికి చెందిన అశ్వములు. పాశ్చాత్యవక్తలు కొందరు ఈ దివ్యహయరూపములను, ప్రకృతిప్రతిబింబములరీతిన కానవచ్చు ఇతరరూపములను గమనించి, విదేశీయులైన యవనులవద్ద మన శిల్పులు శిల్పరీతిని నేర్చికొని, అమరావతీశిల్పములను మలిచిరను అభిప్రాయమును సూచించిరి. ఈ భావము చాల పొరపాటు. ఏలనన ఆంధ్రశైలి భారతదేశమున అతిపురాతనమయినది. అందుచేత ఆంధ్ర శిల్పులు తమ అనాదిశైలినే ఇచట పరిపక్వమొనర్చిరే కాని, ఇతరసంపర్కములచే విదేశీయశైలిగతులను తమ శిల్పములందు ప్రవేశపెట్టలేదు. అలంకారముకొరకు మాత్రము వారు కొన్ని విదేశశిల్పరూపములను తమశిల్పములందు ప్రవేశపెట్టిన మాట వాస్తవము. అయినప్పటికీ

అవన్నియు ఈ శిల్పములందు ఆంధ్రశైలికి అనుగుణ ముగానే రచించి, నిజ ఆంధ్రరూపమును మలిచిరి.

అమరావతీశిల్పములందు రూపనిర్దేశమందు కాన వచ్చు ఈ తీక్ష్ణత నిజవిన్యాసపరమయిన రేఖను అనుస రించుటయందు కల ప్రావీణ్యముచేతనే ఏర్పడినది కాని పాశ్చాత్యశిల్పులరీతి, ప్రకృతిబాహ్యరూపములను పరీ క్షించి, ఎంచి, కొలిచి, ప్రతులు చిత్రించుటవలన ఏర్పడలేదు. అందుచేత రేఖాగతులను గుర్తించి, అన్వ యించి, అవగాహనముచేసుకొనుట నిజశిల్పికి అత్యవ సరమని ఈ దివ్యఅమరావతీశిల్పములు స్పష్టముగా తెలుపుచున్నవి.

అమరావతీశిల్పము లన్నిటిని తిలకించినంత, ఒక చిత్రస్తంభరూపమునుమాత్రము గమనింపక తప్పదు. పండిత మెకన్జీగారు అమరావతీశిల్పఖండములందు ఈ స్తంభరూపములను ఆరింటిని లెక్కపెట్టిరి. పీఠభాగమున సింహాసనము మలిచి దానిపయిన అడుగుల పేటిక నిర్మిం చిరి. దీనిపయిన చిత్రస్తంభమును నిర్మించి, స్తంభశిరో భాగమున ధర్మచక్రమును నిలిపిరి. ఈ స్తంభరూపము వలయమయి, అనేక[illegible]రూపములను వరుసగా చెక్కి, మధ్యమధ్య బుద్ధరూపములను మలిచిరి. సుందర మయి, అనేక అంతస్తులు కలిగి, శిల్పాలంకృతమయిన ఈ స్తంభరూపము అబూపర్వతముపైన జైనస్తంభవాస్తు వును స్మృతికి తెచ్చునదయి ఉన్నది. నిజముగా అబూప ర్వతము మీద వెలసిన జైనవాస్తురూపబీజములు ఏ పురా తనహైందవశిల్పమందును, స్పష్టముగా కానరానిచో ఈ దివ్య [illegible] అంకురము, ఎచటనో తెలియక పాశ్చాత్యపండితులందరూ తికమకపడినమాట వాస్తవము. బహుశా ఈ దివ్యఅమరావతీస్తూపము నేటికి పూర్ణ ముగా నిలిచియున్నయెడల, ఆ దివ్యజైనవాస్తురూపముల అంకురములు కొంతవరకయినను కానవచ్చునేమో అను సంశయము కలుగకతప్పదు.

నిజమీ తీక్ష్ణత గాంచి, అనేకశైలిశిల్పములకు, వాస్తువులకు దారితీసిన ఈ అమరావతీస్తూపఖండముల యినను నేడు ఆంధ్రభూమియందు లేక, లండనునగర మున మ్యూజియమును అలంకరించుచుండుట కడు శోచనీయము. నిశ్చయముగా, ఆ దివ్యశిల్పఖండములను తెప్పించి ఆంధ్రకన్యయయిన అమరావతియందు, పూర్వస్థా నమున నిలబెట్టుట నేటి ఆంధ్రుల విధి యని వేరుగా చెప్పనక్కరలేదు. (సశేషము)



కనుక హోమియోపతీ వైద్యులు వైద్యము నారంభించిరి. మహర్షికి జ్వరములో నెత్తురుపట్టి దేహము బాగగుచుండెను. కాని మరల పెలపుట్టినది. 'దీనిని కుదుర్తునని హామీయియ్యగలవా' యని ఆ వైద్యుని నడుగగా వారాయన భయపడి వదలిపోయెను.

తర్వాత వారాయుర్వేదమునకై మలబారునుండి మూసా అను నంబూద్రిని పిలిపించిరి. ఆయన కఠిన పథ్యము పెట్టి పెలుపు తెలగల గలిపించి పెద్ద నెత్తురు తీసి ఔషధము నిచ్చెను. ఇప్పటికి భగవంతుడు మాత్రి భూతేశ్వరాలయమునకు మార్చున్న గదిని జేరిరి. గ్రంథి పెద్దదయినది. ఈయన కుడు రెప్ప నన్ను యాళే వచ్చినది. పెలనుండి నెత్తురూరక స్రవించును. ఏమిచేయుటకును గాలేదు.



ఆశ్రమస్వీకారము చేసిన క్రొత్తలోని రమణమహర్షి

భక్తుడు బోస్ కలకత్తానుండి కవిరాజశ్రీ ద్రమోక్ భట్టాచార్యుని కొనివచ్చెను. కాని ఆస్థాన వైద్యులు ఆయనవైద్యమును సాగించనీయలేదు. స్వామికిని వెక్కసము కల్గినది. 'నన్ను నాకు వదలుడు' అని ఆయన యన్నారు. అన్నరుచి తప్పినది. శరీర మశక్తమైనది. గ్రంథి పెద్ద కొబ్బరికాయ యంత యయినది.

ఈ వ్యాధి ఏపాప మెఱుగని బాల్యమునుండి యస్ఖలిత బ్రహ్మచారి మహర్షికి రానేల! రామకృష్ణ పరమహంసకు కంఠమున వ్రణము కల్గనేల! అట్టి సిద్ధపురుషులు లోకు లందఱి పాపముల నుతమపై వైచి కొందురు. శరీరాభిమానము లేనివారు గాన నుపాధిని బాగుచేసి కొనశక్తియున్నను చేసి కొనరు. అందును తమ యవతారకాల పరిసమాప్తి సమయము వారికి ముందే తెలిసియుండును. ప్రకృతిధర్మముల నుల్లంఘింప వారికి కోర్కెయుండదు.

శరీరము కృశించుచున్నది. అడుగిడుటకూడ నరుదైనది. నరమునరము లాగుచున్నది. విపరీతమైన బాధపడుచున్నారు. కాని వదనమున సహజదివ్యకళ తప్పలేదు. ఆస్థితిలో గాచియున్న జనములు ప్రతిదినమునను రెండుమారులు మహర్షిదర్శనభాగ్యమును పొందుచునే యుండిరి.

౧౯౫౦ వచ్చినది. తెలుగుసంవత్సరాదికి పూర్వదినమున భూకంపము, చిన్నది, అరుణాచలమున దటస్థించెను. మరునాడు తెలుగుసంవత్సరాది. అదినమే భగవానులు నడచుచు పడిరి. తర్వాత పడక పట్టిరి. మరి అరవసంవత్సరాదిని లీలను సమాప్తిచేసిరి.

ఈలోపల ఎందరో శిష్యులు విలపించి విలపించి తమకొఱకైనను సహజకరుణచే నైనను అవతారలీలను సాగించి సంకల్పమాత్రమున శరీరమును నీరోగ మొనర్చు కొమ్మని ప్రాధేయపడిరి. మహర్షి ఇదివర కెన్ని మారులో అట్లు చేసినవారే. ఈపర్యాయము వినుకొనలేదు. శిష్యుల యపరాధశేషపరిపాకము, వారి యభాగ్యము కారణమై వారికిహలీలయందు విరక్తిని గల్గించెను గాబోలు.

౫౦ ఏప్రిల్ ౧౩,౧౪ తేదులందు రోగము తీవ్రమైనది. వైద్యుల కోరికపై లోకవాడు, వారి శరీర మలయక చేసెనో యని, భక్తులకు దర్శనము తీయలేదు. కాని మహర్షి అనుచరులను గినిసి ఆ సాయంకాలమునుండి యథాపూర్వము, నిర్వాణదినము నాడును, నిర్వాణమునకు రెండు-గంటలు ముందుకూడ భక్తులకు దర్శనభాగ్యము గల్గించిరి.

౧౩ తేదీ రాత్రి భగవానుని కంఠమున కఫము పొడచూపినది. ఒకవైద్యుడు ౧౪ తేదీ ఉదయమున 'దగ్గుకు ప్రవాళభస్మము నిత్తు' ననెను. మహర్షి 'రెండు రోజులలో పోవుదాని కింత యేల' అనిరి. మాబోటి విశ్వాసమూఢులు 'పోవునది జాడ్యము గదా' యని సంతసించిరి. కడకు పోయినది శరీరము.

౧౯౫౦ ఏప్రిలు పదునాల్గవ తేదీ సాయంకాలముదర్శనముకూడ నయినతరువాత రోగిగదినుండి బాధాశబ్దములు, మూల్గులు, 'అబ్బా అమ్మా' యనుమాటలు శిష్యహృదయవిదారకములుగ వినవచ్చుచుండినవి. ఈ మహాత్ముఁ డెన్నడును అట్లన్నవాడు గాడు. ప్రథమ శస్త్రచికిత్సాకాలమునను క్లోరోఫారము తీసికొనలేదు. ఇప్పు డీబాధపడ గారణము?

అది శిష్యుల మనుకొను మాకు మహర్షి నేర్పిన గుణపాఠము. 'ఓరి మూఢులారా! రమణుఁడన్న శరీరము అనుకొని రమణనామకశరీరమును గొల్చుచున్నారే కాని రమణస్వరూపమును గుర్తించలేరు. రమణబ్రహ్మమునకు రమణశరీరమునకు భేదము చూపెదను. రమణబ్రహ్మము విభుపదార్థము; నిరోగము; సర్వవైభవము. రమణశరీరము పార్థివము; శీర్ణము; రుజావిష్టము. పరిణామమున నీ శరీర మెంతబాధల పడునో, ఎంతవికారమునో చూడుడు.' అను పాఠమును నేర్ప దలంచిరి కాబోలు. రమణునికే యన్ని బాధ లున్న మన శరీరముల కుండవా! సహించుకొనవలసినదే. లేక అనుభవించవలసినదే. వైద్యులు ఆసెల ౧౩, ౧౪ గడవులు పెట్టిరి. కొన్ని గంటలు కొన్ని నిమిషములమాత్రమే. రక్తప్రసారము నిలుచుచున్నది. నాడి తగ్గినది. అన్నిమాటలును తప్పినవి.

ఆనా డున్నట్టులుండి ఏడుగంటలకు 'స్వామికి కఫము కమ్మినది. ఆక్సిజన్ ఈయవలయు' నని, వైద్యులు ఇచ్చినారు. నాలుగునిమిషములకు స్వామి తమ కది యక్కర లే దనిరి.

శిష్యులను పిలిచి తమ్ము పద్మాసనమున గూర్చుండబెట్టు మన్నారు. శిష్యు లట్లే చేసిరి. గది ముందు వేలకువేలజనము లాతురతతో గాచియుండిరి. డి. యం. ఓ. గారు వచ్చి ప్రస్తుతము భయము లే దనిరి. ఆమాటపై కతిపయులు భోజనముచేసివచ్చిరి. ౮-౩౦ గంటలకు శిష్యులు రమణస్తుతిగీతపఠనము ప్రారంభించినారు. వేదపారాయణమును ప్రారంభించిరి.

'ఏమిరా యీ యపశకునము' మనకొనుచుండగా ఈలోపల గదిలోనుండి 'కర్పూరము కర్పూర' మనిరి. మా హృదయములలో రాయిపడినది.

ప్రభు విక లేఁడు; మానాథుఁ డింక రాఁడు; మాతండ్రి యిహలోకమును వీడినాఁడు; మా దైవము కైలాసమును జేరుకొన్నది; మా సర్వస్వమును శూన్య మయినది.

మహర్షి ౫౪ ఏండ్లుగా అరుణాచలమునుండి పదచలనము గావింపలేదు. తన దివ్యత చాటుకొనలేదు. మహోపన్యాసముల నొసగలేదు. విజృంభించి గ్రంథపరంపరలచేత లోకమును ముంచెత్తలేదు.

"నేను చెప్పుచున్నా" నని ధర్మనిర్ణయమును గావింపలేదు. "పెద్ద లట్లు చెప్పిరి" అనుచునే ముముక్షువర్తనలకు శిష్యులకు, ఆర్తులకు జిజ్ఞాసువులకు సంశయముల నడిపి ఆధ్యాత్మికదీక్ష నొసగి, కొందరికి మాతృరూపమున శిక్షాగురువై, తమ శ్రేష్ఠశీలాచరణములచే లక్ష్యభూతుఁడై, జగద్గురువై వెలసినాఁడు. సనాతనధర్మ నిదర్శకముగ విరాజిల్లినాఁడు. ఆత్మనిష్ఠాగరిష్ఠతచే ఋషిపరంపరలో ఒక గణ్యస్థానము నాక్రమించినాఁడు.

ఆ మహామహుని దర్శనము, వారి యుపదేశము మాబోంట్లకు కలలందేని యిక లభించునా ? లభించును గాక !

# గోమతి

[కథానిక]

శ్రీ ఇనుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

వాకిట్లో బండి ఆగిన ట్లనిపించింది. తలుపు కొట్టినట్లు చప్పుడుకూడా అయింది. ఎవరో అని వాకిట్లోకి వెళ్లాడు తలుపుతీసి. శాంతా, గోపీ వంటింటిలోనివున్నారు. "కామయ్యగారి యిల్లు యిదేనా" అంటూ, సమాధానంకోసంకూడా ఆగకుండానే లోపలికి వెళ్లారు, తలుపు తీసిన మనిషి యెవరో తెలుసుకోకుండానే. శాంత యింట్లో అడుగుపెట్టిందో లేదో ఒక్కసారిగా రతి వచ్చి ఆమెను కౌగలించుకొని కన్నీరుపెట్టింది. వాళ్లిద్దరూ ఒకళ్లనొకళ్లు చూసుకొని ఎన్నాళ్లయిందో. గోపీకి అప్పుడు తెలిసింది రతి అంటే శాంతకు యెంత ప్రేమో. ఇంతలోనే దొడ్లోంచిగామాలు వచ్చింది మంగమ్మ తన సహజ కఠినత్వాన్ని వెళ్లగక్కుతూ—

'స్నేహితురాలితో తర్వాత మాట్లాడుకోవచ్చులే. ముందర నే చెప్పిన పని చేసి అఘోరించమూ' అంటూ.

ఈమాటలకు రతి యివాళ యెంతక్కువగా నొచ్చుకుంది స్నేహితురాలిముందరకూడా అన్నదే అని. శాంతకు జాలి వేసింది. గోపీకి కష్టం వేసింది. కాముడు మాత్రం పెళ్లాన్ని అట్లా అడుగుజాడలలో పెట్టా లన్నట్టుగా చూశాడు. ప్రక్కయింటి అమ్మలక్కలు మంగమ్మగారింటికి యెవరో వచ్చారట అంటూ చూడటానికి రాగా వాళ్లను కాస్తా మంగమ్మ కసురుకొంది. పరాయివాళ్లదగ్గర ఆ చాదస్తురాలిని వెలితి పెట్టటం యెందుకని కొందరు తలవంచుకుపోయ్యారు. కొందరు ఆపుకోలేక అక్కడే నాలుగు అని పోయారు. దీంతో గోపీకి మంగమ్మగారివిషయం అంతా అర్థమైపోయింది. వచ్చినవాళ్లను కూర్చో మనన్నా అనలేక తన భర్త అని లోలోన బాధపడుతోంది రతి. భర్తఅత్తగార్లయెదుట పరాయివాళ్లని కూర్చోమని చెప్పటానికి ఆవిడకు సాహసం లేకపోయింది. పోనీ, శాంతచేతనన్నా చెప్పిద్దా మన్నా అది అంత బాగా అనిపించలేదు. భర్తకళ్ళ, తనవంక అట్టే చూడటం రతిముఖాన్ని చూసి గ్రహించిన గోపీ తనంతట తానే ప్రక్కనున్న బల్లమీద కూర్చున్నాడు. అటూయిటూ తిరుగుతున్న మంగమ్మ మొహం కొంచెం చిటచిటలాడింది. శాంత చొరవగల మనిషి. తనను పలకరించకపోగా యీసడింపుగా వున్నదని గ్రహించికూడ మంగమ్మతో తనే మాట్లాడింది.

'మామ్మగారూ, నేనూ రతీ చిన్నప్పటినుంచి ఒకచోటే కలిసి మెలిసి వున్నాము. పెళ్లి అయినప్పటినుంచి ఒకళ్లొకళ్లు చూసుకోవటం పడలేదు. ఇప్పటికి ఆరేళ్లయింది. మీరంతా యిక్కడున్నట్లు అచూకీగా తెలిసి వచ్చాము. యీ ఒక్కరోజూ రతితో కలిసి వుండేటట్లు ఒప్పుకోరూ' అని జాలిగా అడిగింది.

వెంటనే మంగమ్మ కోపంతో 'ఒక్కరోజా కాకపోతే పదిరోజులుండు. నాసొమ్మేంపోయింది! తెచ్చిపెట్టటానికి వాడున్నాడు. చేసేందుకు యిది వుంది. మళ్లీ నేను ఒప్పుకోవాలా యేమిటి' అని కసురుకొంది.

ఇంతలో గోపీ లేచి యిప్పుడే వస్తానని చెప్పి బయలుదేరాడు. ఇంట్లో యెవరూ మాట్లాడలేదు. ఆయన వెళ్తుంటే సంగతి తెలిసిన గోపీ యేమీ అనలేదు. కాముడు యేదో పనివున్నట్లు దొడ్లోకి వెళ్లాడు. తల్లిని చాటుగా పిలిచాడు. ఏవో గుసగుసలు ప్రారంభించారు.

ఆదరణకోసం కరువు వాచినట్లుగా వున్న కాంత ఒక్కసారిగా—

'ఏమమ్మా, మీ అత్తగారు అట్లా కసురు కొంటుందే! నిన్ను సరిగా చూడదా యేమిటి! నీభర్త కూడ అన్యోన్యంగా వున్నట్లు కనిపించడే. నేను యిట్లా అంటున్నానని యేమీ అనుకోకు. చొరవచేత మాట్లాడుతున్నా' అంటూ రతిని తన దగ్గరకు చేర్చింది.

ఇంకోళ్ల దగ్గరవుతే రతి భర్తనూ, అత్తగారినీ వెనకేసుకొచ్చేదే. కాంతదగ్గరమాత్రం అట్లా చెయ్యలేదు. లోలోన ఏడుస్తూ చెప్పుకుంది.

'నే కాపరానికి వచ్చింది మొదలు యింత వరకూ ఒక్కనాడైనా నాతో సరిగా మాట్లాడటం గాని, నన్ను చూసి సంతోషించటంగాని లేదమ్మా. ప్రతిరోజూ యేదో సాధింపే. ఏదో దెప్పిపొడవటమే. నా పెళ్లి నాడు మానాన్న అల్లుడికి వుంగరం చేయించి యిస్తానన్నాడు. అప్పుడు వీలుకాలేదు. తర్వాత మానాన్నస్థితి అంతా నీకు తెలిసిందేకదా! నన్ను యింతవరకూ ఒకసారికూడ మాఅమ్మనీ నాన్ననూ చూద్దామన్నా పంపలేదు. వారు చూడబోతే యేదో కటువుగా వుంటూవుంటారు. అటూఅనరు ఇటూ అనరు. ఇట్లా చేస్తున్నాకూడ దుఃఖాన్ని అంతా మింగి అత్తగారిదగ్గర సంతోషంగానే వుంటూ వుంటా. ఆవిడకు యేమి కావాలో చెప్పటం వీలు వుంటదో అని అదుర్దాగానే వుంటున్నా. కాని ఏం లాభం!... యింతకీ నా నొసటన' ఇట్లా రాసివుంది గామోలు' అని బావురుమంది. ఆపుకోలేని దుఃఖముతో కాంతగుండె బరువెక్కింది. అత్తగారు వస్తున్నట్లున్నారు అంటూ రతి కాంతతో ఏదో మాట్లాడుతున్నట్లు నటించింది.

'నీయిష్టము వచ్చినవాళ్ళను తెచ్చిపెట్టుకో. యింట్లో నా పెత్తనమూ నాయిదా! నే జరుగుతున్నానో' అని సణుక్కుంటూ మంగమ్మ వూళ్లోవున్న అప్పగారింటికి వెళ్ళింది.

రతికి యేమీ తోచలేదు. భర్తను యేదో అడుగ బోతుంటే, 'మీ దిక్కుండదమ్మా. నాకు పనివుంది. నే వెళ్తున్నా' అంటూ వెళ్ళిపోయాడు కాముడు. యీమాటలు విరోధంగా అన్నారో, వినోదంగా అన్నారో వాళ్ళకే అర్థం కాలా. నిజానికి కాముడికే తెలియదు యెట్లాఅన్నదీ. కాంతకు గాబరాగా వుంది. ఏం తోచలా. యెట్లాగోట్లా చిన్నతనపు కబుర్లు చెప్పుకుంటూ అపూటకు భోజనం చేశారు. సాయంత్ర మయ్యేసరికి గోపి వచ్చాడు. ఇంకా రతీ కాంతా యేదో మాట్లాడుకుంటూనేవున్నారు. ఏం మాట్లాడుకుంటున్నారో అని ప్రక్కనుండి వింటూ కూర్చున్నాడు గోపి. కాంత తనకు పిల్లలులేనట్లూ, తనభర్త వ్రతాలూ, పూజలూ అంటే ఆక్షేపిస్తాడనీ, డబ్బు వృధాగా ఖర్చు పెడతాడనీ, అదేమిటంటే విసుక్కుంటాడనీ తనగురించి చెప్పుకున్న గ్రంథంఅంతా వింటున్నాడు. తనను మామగారు చాలా ప్రేమగా చూస్తారనీ, మరిదికికూడ తనంటే భక్తి, గౌరవమూ, ప్రేమా వుందనీ, మరిది మామగారి మాట వినడనీ, ఆయనకు ఎన్ని సంబంధాలు వచ్చినా యిష్టపడడనీ, తనమరిదికి వెధవపిల్లను చేసుకోవటమే యిష్టమనీ, దీంతో మామగారికీ, మరిదికీ మాటామాటా వచ్చిందనీ, మరిదివిషయం చిన గలాభేగాని, యింట్లో మరే యితరకలతలూ లేవనీ, యింకా వాళ్ళింటిగొడవలన్నీ చెప్పుకుంటే గోపి సావధానంగా వింటున్నాడు. రతి, తనకు యిద్దరు పిల్లలు కల్గినా యేడాది తిరగకముందే పోయారని చెప్పింది. ఇట్లా వాళ్లు యిష్టాగోష్టి జరుపుకూవుండగానే, అప్రయత్నంగా మంగమ్మ కొడుకును వెంటపెట్టుకొని యింట్లోకి వచ్చింది. చాటుగా వున్న గోపిని చూడకుండానే వంటనే కాంత తన భర్తకోసం యెదురు చూస్తున్నట్లు వాకిట్లోకి వచ్చేసరికి అతను కనిపించాడు. ఇద్దరూకలసి వెళ్ళిపోయారు. ఇక్కడ మంగమ్మ రతిని దుమ్మెత్తిపోసింది. కాంతను చూచేటప్పటికి, రతికి తన తల్లితండ్రులను చూసినట్లు అనిపించింది. ఆవిడమనస్సంతా అదే వుంది. అందుకని అత్తగారి శాపనార్థాలు ఆవిడచెవికి యెక్కలా. ఆరాత్రి అట్లా గడిచిపోయింది.

తెల్లవారింది. వాళ్లల్లోనుంచి ఓముసలాయనా, ఓ పడుచుపిల్లా యింట్లోకి వస్తున్నారు.

'గోమతిని ఎందుకు తీసుకొచ్చావు? దుడుకు పిల్ల! మనమాట వింటుందా చెప్పుతుందా? ప్రొద్దున్నే దీని మొహం చూడాలసివచ్చింది. అసలు మొహాన్నే వస్తా వన్నావుగా నువ్వు' అంది మంగమ్మ, వాళ్ళు రావటం తోనే.

గోమతి తల వంచుకుంది. ముసలాయన ఆవిడ వంక చూశాడు వచ్చావంకదా అన్నట్లు. తండ్రితోపాటు లోపలికి వెళ్లింది గోమతికూడా. రతి అంటే అతిప్రేమ. ఇద్దరూ సొంత అక్కచెల్లెళ్లలాగ వుంటారు ఎప్పుడొచ్చినా సరే. అందువల్ల ఆ అమ్మాయి రతిదగ్గరకు వెళ్ళి కూర్చుంది. ఇక్కడ అన్నా, చెల్లెలూ యేదో లోకాభిరామాయణం మాట్లాడుతూ కూర్చున్నారు. పూర్వం వున్న యింటో చెల్లెలికీ, యీ ముసలాయనకూ విరోధాలు వచ్చి చాలాకాలమైంది. ఇంతవరకూ ఆ యింటిగడప త్రొక్కి యెన్నాళ్లయిందో యీ ముసలాయన. ఎప్పుడొచ్చినా యీ మంగమ్మగారింటికే వస్తావుంటాడు. వాళ్లిద్దరూ యేదో మాట్లాడుకుంటూ కూర్చున్నారు. ఆసాతుంత్రము ప్రక్కయింట్లో వాళ్ళ అమ్మాయికి ముద్దుటకుములట. పేరంటానికి రతిక్కంగారించుకొని బయలుదేరింది. ఆవిడవెంట గోమతీ వెళ్ళే ప్రయత్నంలో వుంది. ఇది చూసి మంగమ్మ నాలిక కరుచుకొని, పెద్దగా అరుస్తూ 'నువ్వెళ్ళొద్దు, నువ్వెళ్ళొద్దు, నువ్వెళ్లకూడదు' అంది.

ఈ అరుపులు వింటూకూడా సహజంగా మాట్లాడే రీతినే మాట్లాడుతోం దనుకొని గోమతి బయలుదేరింది పేరంటానికి. తండ్రిమాత్రం తన చెల్లెలిమాటలు వినే టప్పటికి దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు. 'అమ్మా, గోమతీ యిటు రా' అన్నాడు వణుకుతూ. తండ్రికూడ రమ్మనేటప్పటికి ఆవిడకు కోపం వచ్చింది. 'వెళ్లనే వెళ్లనే' అంటూ అక్కడున్న మంచంమీద నడుం వాల్చింది. మంగమ్మకూడ యీసారి కన్నీరు పెట్టుకుంది. గోమతివయస్సు యిప్పటికి పదహారేండ్లు. పాపం ఎనిమిదేండ్లనాడు పెళ్ళి అయినట్లూ, భర్త పోయినట్లూ ఆవిడ కేం తెలుసు! ఎవరింట్లోనైనా పెళ్ళిఅవుతే, తనకుకూడ పెళ్లి చెయ్యరేమనీ, తనయీడు వాళ్లకూ తనకంటే చిన్న వాళ్లకూకూడ పెళ్లి అవుతుంటే తన తల్లి తండ్రులు వూరుకుంటారేమనీ, తనలోతనకు ఆలోచనలు తట్టేవి. సిగ్గొకటి వుంటంమూలాన యీ విషయాల్లో పెదవి కదిలించి యెరుగదు యెన్నడూ. ఓసారిమాత్రం తన స్నేహితురాలితో "పదహారవయేట ఆడదానికి పెళ్ళిచేస్తారు గామాలు. సావిత్రికి యిప్పుడు పదహారే. నాకూ పదహారవ యేటే" అని వూరుకోవటం, వాళ్లిద్దరూ నవ్వుకోటం చూసి తల్లి సంఘబలిమిచే క్రుంగిక్రుంగి ఏడ్చింది. నిజానికి సహజీవంలో ఆదివరకు నమ్మకం లేకపోలేదు. ఇట్లా గడిచిపోతున్నాయి రోజులు.

'పసికందు, దాని కేం తెలుసు పెళ్లిఅయిన సంగతీ, మొగుడు పోయినసంగతీ' అన్నారు ముసలాయన వేడినిట్టూర్పు విడుస్తూ.

'అవును, దాని కేం తెలుస్తుంది! ఏదో మంచి సంబంధంకదా, యింత వున్నవాళ్లు, చిన్నప్పుడే పెళ్లి చేసినవాళ్లం అవుతాం అని అనుకుంటే వాడుకాస్తా పోతాడని ఎవ రనుకొంటారు. ఎవరి కెంతవరకో, ఎవరి జీవితం ఎలా వెళ్లాలో ఎవరికి తెలుస్తుం దన్నయ్యా' అని మంగమ్మ ఓదార్చింది.

ఈమాటలు మంచంమీద పడుకొని వింటూన్న గోమతి క్రిందపడి ఒక్కసారి కెవ్వున కేక పెట్టింది. ఇద్దరూ వులిక్కిపడి దగ్గరకు వచ్చారు 'ఏమమ్మా అట్లా కేక పెట్టావు' అన్నారు. యిద్దరూ. గోమతి కొంచెం సేపు మాటలాడలా. తర్వాత 'యేంలేదు. యేంలేదు' అంటూ మళ్లీ మంచంమీద పడుకుంది. వీళ్లిద్దరికీ అర్థం కాలా అసలువిషయ మేమిటో. యేదో కలవరించిన ట్టుందని వెళ్లిపోయారు. ఇంతవరకూ భర్తపోయాడనే భావన గోమతికి కలగకుండ తల్లి తండ్రులు జాగ్రత్తగా తీసుకొస్తున్నారు. ఈసారి దురదృష్టాన ఆమాట కాస్తా గోమతి చెవిన పడింది. మంచంమీద పడుకుందే గాని ఆవిడ కేమీ తోచట్లేదు. పిచ్చెత్తినట్లయింది. నిజమా, కలా అనిపించింది. కలేమో అని కాసేపు

అనుమానం. కల కాకపోతే తనకు పెళ్లి అవటమేమిటి, మొగుడు పోవటమేమిటి. ఇది అంతా తమాషాగా వుందే. ఇది నిజంమాత్రం కాదు. తప్పకుండా కలే అవాలి అని అనుకుంటుంది కాసేపు. కాసేపు నిజమే అయివుంటుంది. నేనేమన్నా నిద్రపోయానా యేమిటి కలకి. నాన్నా, అత్తయ్యమాట్లాడుకుంటుంటే విన్న మాటలేకదా. నిజమని తేలిపోయింది. వెంటనే రెండు కళ్లూ రెండు చేతుల్తో గట్టిగా మూసుకుంది. వెంటనే లేచి, గబగబ అప్పుడే వస్తున్న రతిని గట్టిగా కౌగ లించుకొంది. రతి కేమీ అర్థంకాలా. ఇది చూసి మంగమ్మకు, ముసలాయనకుకూడ గోమతికి ఆవిషయం తెలిసిందని గట్టిగా నమ్మకం కల్గింది. గోమతిమనస్సు ఆరోజునుంచీ మారిపోయింది. రతితో సరిగ్గా మాట లాడటం లేదు. ఒక్కొక్కప్పుడు పిచ్చియెత్తినదానివలె ప్రవర్తిస్తుంది. ఒక్కొక్కప్పుడు ఏడుస్తూ ఓమూల కూర్చుంటుంది. రతి ఓదారుస్తూ గోమతిని ఓకంట కని పెడుతూనేవుంది. తన కూతురి అవస్థ చూసేటప్పటికి ముసలాయన గుండె తరుక్కుపోతోంది. మంగమ్మకు భయంగానే వుంది. గోమతికి తెలిసింది, యేంచేస్తుందో దుడుకుపిల్ల అని.

ఆ భగ్నహృదయానికి యింకా కొన్నాళ్లు గడిచినాయి. అప్పుడే వాళ్ల యింటికి సమీపం లోనే ఏవో వుత్సవాలు ప్రారంభించారు. హరికథలు, పాటకచేరీలు, నృత్యాలు, వుపన్యాసాలు, ప్రతిరోజూ యేదో వుంటూనేవుంటాయి. ఆనాడు సావిత్రిహరికథ. హరికథ అంటే మంగమ్మకు మహాప్రీతి. ఇంటిల్లిపాదీ జనం హాజరయ్యారు హరికథకు. సావిత్రిపాతివ్రత్యము, అడవిలోకి భర్తతోపాటు కట్టెలు కొట్టటానికి వస్తా ననటము, సత్యవంతుడి అలసట, అలసట యెక్కువై మరణించటం, భర్త పోయాడని యముడు తీసుకు వెళ్తుంటే అతనను సావిత్రి వివాదంచెయ్యటం, చివ రకు సత్యవంతుడు బ్రతకటం—యివన్నీ హరికథా రూపంగా చెప్పటం అయేటప్పటికి, రతికి పతిభక్తే యిహ లోకముక్తి అనుకుంటున్న అభిప్రాయం గాఢంగా నాటుకుంది. ముసలాయన తెరిచిన కన్ను ఆర్పకుండా చూస్తూ కూర్చున్నాడు. మంగమ్మ ముక్కుమీద వేలు వేసుకొని అష్టే దిగాలబడి కూర్చుంది. ఆఘట్టాలు వింటున్నంతసేపూ గోమతిమనస్సులో మనస్సు లేదు. అనేకవిధంగా వూహాలు బయలుదేరాయి. "పతిభక్తి అంటున్నాడు. పతి యెక్కడ నాకు? అసలు నాకు పెళ్లి అయినట్లే తెలీదే. ఇక జీవితమంతా యింతేనన్న మాట" అనుకుంది. కళ్లల్లో నీళ్లు గిర్రున తిరిగాయి. ఆవిడ పని అయోమయంగా వుంది. ఏమీ తోచట్లేదు. పెర్రి యెత్తినట్లయింది. నిద్ర వస్తోందని వంకతో అక్కడ వుండలేక యింట్లో కెళ్లి పడుకుంది. కన్నీరుమున్నీ రుగా ఏడవటం మొదలుపెట్టింది. ఏడ్చి ఏడ్చి నిద్ర పోయింది. ఇంకో హరికథ కూడ విని వాళ్లు ప్రొద్దుపోయి యింటికి వచ్చారు.

మర్నాడు సూర్యకిరణాలు కిటికీలోంచి ఆవిడ కళ్లల్లో పొడిచేవరకూ లేవలేదు. లేచి అష్టే దిగాలబడి నుంచుంది. ఆవిడ యేపని చేస్తున్నా యిూ ఆలోచనే. యేం మాట్లాడుకున్నా యిూ ఆలోచనే. ఇంకే ఆశ్రయమూ, నాకర్మ యింతేగాబోలు అనుకుంటుంది అప్పు డప్పుడు. కోపము, అహంకారము ప్రబలంగా వున్న ప్పుడు నాన్న, అమ్మలను మింగేద్దామన్నంత కసి వచ్చేది. విచారంగా కూర్చుని ఆలోచించేటప్పుడు, తల్లితండ్రులు, తన పెళ్లి చెడుతలంపుతో చేస్తారా. వాళ్లనంటే లాభం యేమిటి. నాకర్మకు నే యేడ్వాలే కాని అనుకుంటుంది. మనస్సు తరిపరివిధాలా పోతోంది. ఎంతమంది లేరు యిూభూమిమీద భర్తను పోగొట్టుకున్న అభాగ్యజీవులు, వారిలో నే నొకతె నవుతా ననుకొనేది. వెంటనే ధైర్యము వేసేది. ఆవేదన, ఆవేశం చల్లారేవి. మనస్సు యెంత చలించినా గోమతిహృదయంలోమాత్రం వకటి గాఢంగా నాటుకుపోయింది. ఈజన్మకు యింతేనని. ఎన్నివిధాల తన ఆవేదన చంపుకుందామని ప్రయత్నించేసినా హృదయంలోని యేమూలబెజ్జంలోంచో అది పైకి వుబక కుండ వుండేదికాదు. జీవన్మరణసమస్య కూడ ఒక్కొక్కసారి కలిగేది. చచ్చి సాధించేది వుంది కనకనా, బ్రతికివుంటేనే యేదైనా అనుకొని సర్దు కుంటూ వుండేది. ఎక్కడైనా పెళ్లిజరిగితే, ఆరోజు తన ఒళ్లు తనకు తెలిసేదికాదు.

మర్నాడు వుపన్యాసం అన్నారు. దానికి వెళ్దామని బయలుదేరింది. ఉపన్యాసాలకు వెళ్లటం మంగమ్మకు, తన తండ్రికి యేమాత్రం యిష్టంలేదు. వాళ్లు వద్దన్నారు. ఇక వెళ్లటానికి వీలుపడలేదు. ఆనాటి కార్యక్రమం సమాప్తి. మర్నాడు మళ్లీ హరికథ అన్నారు. మంగమ్మ హరికథ అంటే చెవికోసు కుంటుంది. అందరూ బయలుదేరారు. పార్వతీకళ్యాణముకథ. చాలామంది వింటానికి వచ్చారు—ప్రక్కవూళ్ల నుంచీకూడ. జనం కిటకిటలాడిపోయారు. ఎప్పుడా ఎప్పుడా అన్న ఆతుర్దాగా వుంది ప్రజల్లో. టైముప్రకారం హరిదాసుగారు రాకపోవటంవలన ఇంతలో సంఘకర్త వచ్చి "హరిదాసుగారు ఓఅరగంట సేపటిలో వస్తారు. ఈలోగా సంఘసంస్కరణగురించి వుపన్యాసం జరుగుతుంది" అని ప్రకటించాడు. సభలో ఒక్కసారిగా గోల ప్రారంభమయింది. ఈ వుపన్యాసము వినేదేమిట్లే అని కొందరు చప్పరించారు. వుపన్యాసము వినాలని లేకపోయినా, యీచోటు కాస్తా పోతుందేమో లేస్తే అని ఆ అరగంటసేపూ ముక్కుమూసుకుందామని కొందరు. హరికథ యేమిటి, వుపన్యాసము యేమిటి యేదో కాసేపు కూర్చుంటే సరిపోతుందని విరక్తిభావంగా కొందరు. ఎట్లాగవుతే నేం, ఎక్కడివాళ్ళు అక్కడ కూర్చునే వున్నారు. కాని, యీలోగా పిల్లలకు పాలిచ్చిరావచ్చుని కొందరు తల్లులు మాత్రం యింటికి వెళ్లారు. మంగమ్మకు వుపన్యాసం గిట్టకపోయినా అరగంటలో హరికథ వుంది గదా అని అక్కడే కూలబడి కూర్చుంది. ఆయన వుపన్యాసం సగంలోకి వచ్చేటప్పటికి మంగమ్మ అవస్థ సుషుప్తిలోంచి స్వప్నావస్థలోకి వచ్చింది. ఆవిడ నిద్దర పోతున్నట్టు, వుపన్యాసకుడు తప్ప, మరెవరూ గ్రహించినట్టు లేదు. అందుకనే, "కొందరు వుపన్యాసాలకూ, హరికథలకూ వచ్చి యిక్కడే పక్కవేసు కుంటారు" అని ఆయన అనేటప్పటికి సభ పకపకన నవ్వటం, మంగమ్మ వులిక్కిపడి లేవటం ఒక్కసారిగా జరిగినాయి. గలభా సద్దుమణిగింతర్వాత ఆయన మళ్ళీ వుపన్యాసంలోకి వచ్చాడు.

"ఇంతవరకూ, సంఘం యెట్లా సంస్కరించాలో, సంఘంలోని ప్రతివ్యక్తియొక్క బాధ్యతలు యేమిటో, క్లుప్తంగా తమతో మనవి చేసుకున్నాను. ఇక బాల్యవివాహాలు, ద్వితీయవివాహము గురించి క్లుప్తంగా రెండుముక్కలు చెప్పి, శలవు తీసుకుంటాను. పెళ్ళి అనే శుభకార్యంయొక్క విశిష్టతను గ్రహించండి. జలవంతంగా అర్థం పర్థం తెలియని ఒక అమ్మాయిని ఒక అబ్బాయికి కట్టటం శుద్ధఅన్యాయం. ప్రతి ఆడదీ, ప్రతిమగవాడూ, స్వశక్తి వచ్చినతర్వాతే పెళ్లి చేసుకోవాలి. అట్లా కాకుండా వాళ్లకు తెలియకుండానే వివాహం చెయ్యటం, యేదైనా హెచ్చు, తగ్గ వస్తే వాళ్లను అనుభవించమనటం చాలా ఘోరపాపం. మగవానికి రెండోపెళ్లికి అనుమతిస్తారు. ఆడదాని ఆపని చెయ్యకూడదు అని వాళ్లే కరుమకుంటారు. వితంతువులు యేంపాపం చేశారని వాళ్లను సంఘం వెలివెయ్యాలి! అసలు, మగవాళ్లకున్న యీ విషయంలో యింత భేదం యెందుకు వుండాలి! పూర్వకాలంలో అట్లా జరిగింది కనక యిప్పుడుకూడ అట్లాగే జరగాలనేవాదన కాలానుగుణపరివర్తన అనే సిద్ధాంతానికి గొడ్డలిపెట్టు. ఈవిషయంలో ప్రభుత్వదృష్ట్యా, ప్రజలలో మానాభూతి వున్నాకూడ, అక్కడక్కడ యింకా యిలాంటి దురాచారాలు ప్రబలంగానే వున్నాయి. అవి మనము అరికట్టాలి. రెండోపెళ్లి చేసుకోటానికి యేయే పరిస్థితుల్లో మగవానికి అధికారాలు వున్నాయో, అవే పరిస్థితుల్లోనే ఆడదానికికూడ రెండోపెళ్లి చేసుకోటానికి హక్కు వుండాలి......" అని యింకా యేదో చెప్పబోతుంటే సభలో హర్షధ్వానాలు చెలరేగాయి. ఇది వింటున్నంతసేపూ, గోమతికి తన విషయము చెప్తున్నట్లనిపించింది. మళ్లీ తల్లితండ్రులమీద క్రోధం జనించింది. వాళ్లు చేసిన అన్యాయానికి మళ్లీ వాళ్లతో మాట్లాడకూడదనుకుంటోంది. ముఖలాయునకు యీ వుపన్యాసంవినేటప్పటికి తలతిరిగింది. గోమతివంకకు మనస్సు పోయింది. ఎట్లా వుందా అని. కాని చీకట్లో గోమతిని గుర్తుపట్టలేకపోయాడు. రతికి వీపుమీద రోకలితో కొట్టినట్లనిపించింది. ఆవిడ

శరీరం అంతా తేళ్లు ప్రాకినట్లయింది. గోమతివంక చూసింది. ముచ్చెమట్లు పోసినాయి. గోమతికి శరీరం వణుకుతోంది. ముఖం ఎఱ్ఱబడింది. కళ్లంబడి నీళ్లు. అశ్రుధారలో, ఆనందబాష్పాలో మరి !

గోమతికి ఒకవిధమైన ధైర్యం వచ్చినటయింది. ప్రజలు తనవైపు యింత అండగా వున్నారని అనుకో లేదు అదివరకు. ఒక్కసారిగా తనలో అనుకోని మార్పు వచ్చినట్లయింది. అదివరకల్లా జీవితం యిట్లా గడిచి పోవాలిసిందే అని వ్యథపడ్డ గోమతికి, గృహస్థాశ్రమ ధర్మం స్వీకరించవచ్చునని ధైర్యంవచ్చినట్లనిపించింది. ఓ ఆశాకిరణం ఆమెముఖంలో ద్యోతకమవుతోంది. ఆమెముఖంలోకి రతి చూచింది. రతిముఖంలోకి గోమతి చూడలేదు. ఇద్దరూ అట్లా వున్నారు. మంగమ్మ కునుకుపాట్లుపడుతూ నేవుందిగాని, యీ వుప న్యాసం వింటున్నట్టు కనిపించలేదు. కొందరు యింకా హరికథ లేదు, యీవుపన్యాసంతోనే సరి అని, హరి దాసు వచ్చాడట అని మరికొందరు అను కుంటూ కూర్చున్నారు. వెళ్లిపోయేవాళ్లు తొందరగా ఇంతలో సంఘకర్త వచ్చి, హరికథ రేపు పెట్టిం చాము, యివాళ యీ కార్యక్రమంతో సమాప్తి అనే టప్పటికి పందిరిఅంతా టపాటపా అని మ్రోగింది. ఆపందిటిలో తాటాకులుగాని వాసాలుగాని యెన్ని పోయాయో మర్నాడుగాని తెలియలా సంఘకర్తకు.

ఎవరిళ్లకు వాళ్లు వెళ్లారు. ముసలాయనకు గాబరాగా వుంది. గోమతి మొహం చూశాడు. యేదో మార్పుగా వున్నట్లు గ్రహించాడు. రతిని పెళ్లి ఆడమని దాకా అనుకున్నాడు. ఆరాత్రి నిద్రపట్టలా. తెల్లవారింది ముసలాయనకు. ఎంతసేపటికీ తెల్లవారదే అనిపించింది గోమతికి. రోజూకంటె యేదో వుత్సా హంగా వున్నట్లు ఆవిడముఖమే చెప్తోంది. ముస లాయనగుండెల్లో రైళ్లు పరిగెత్తినట్లవుతోంది. రతికి నిమ్మకు నీరెత్తినట్లయింది. కాముడికి యేసౌఖ్యం లేదు గాబట్టి ఆయనకు యీమార్పు గోచరించలా. 'ఏం రోజూ లేని వుత్సాహంతో వున్నావు. ఏమి టివ్వాళ విశేషం' అంది మంగమ్మ, ఆవిడకూడ యేదో మార్పు కనిపెట్టినట్లు. ఈమాట వినగానే ముసలాయనకు పుక్కిలిబిక్కిలి అయినట్లయింది. మంగమ్మకూ ఆశ్చ ర్యంగానే వుంది. రతిని రెండుమూడుసార్లు అడిగింది యేమిటి గోమతి యిట్లా వుంటోందని. రతికి యేమీ తోచలా. అత్తగారికొంత తెలిసిందని చెప్తే యేమి తప్పో, తెలీకలేదని చెప్తే యేమితప్పో అన్న ట్లయింది. చివరకు ముసలాయనే వూరుకోక, మంగ మ్మను పిలిచి, చాటుగా, రాత్రి కథఅంతా చెప్పాడు. మంగమ్మ గబగబ గోమతిదగ్గరకు వెళ్లి 'అదా నీ సంతోషం. ఏమిటో అనుకున్నా. వుపన్యాసం వింటం వలన వచ్చిన మార్పు యిది. విస్తుంచక్కర్లా ! మన కర్మ యిట్లా అయిందికదా అని విచారంపోయి సంతోషంకూడానా ? వాడెవడో చెప్పాడట, ఫరవా లేదు మొగుడు పోతే రెండోపెళ్లి చేసుకోవచ్చని సంబరపడుతోంది అమ్మాయి! మన వంశం యేమిటో, మన కులం యేమిటో, మన గౌరవం యేమిటో చూసుకోక్కర్లా ! వాడెవడో చెప్పాడని వింటమే నేంటి ! ఏదైనా పిచ్చిపిచ్చివ్యవహారాలు చేద్దామను కుంటున్నావేమో, బుద్ధి దగ్గిర పెట్టుకుండు జాగ్రత్త' అని గదమాయించింది గోమతిమీద అదివరకు అధికారం వున్నట్టు. గోమతి తొణకవన్నా తొణకలా. నిబ్బ రంగా "అవ్వ చెప్తున్నదేమిటో నాకేం అర్థం కావటంలేదు. నాకు మొగుడు పోయాడని ఎవ రన్నారు. నాకు పెళ్లి అయిందేమిటి అసలు. నాకే పెళ్లి అవుతే నాకే తెలీకుండా అవుతుందేమిటి. ఇదంతా చిత్రంగా వుందే !" అంది అమాయకంగా అన్నట్టుగా. ముసలాయన ఒక్క మొహం వేశాడు యేం తోచక. మంగమ్మ ఉగ్ర తిరిగింది యీమాటలతో. సర్వాధికారం చేతిలోంచి జారిపోయేటట్టుగా వుందే అన్నట్టుగా రతి చూపింది గోమతివంక. మంగమ్మ ఒక్కసారిగా "అన్నయ్యా, నీయింటికి తీసుకెళ్ళు. ఇక్కడ గోమతి ఒక్క క్షణం ఉండటానికి వీల్లేదు. నాకొంప కొస్తుంది. యింతాకా వచ్చింది దీనిపని" అంది. అప్పుడు వెంటనే గోమతి అందుకొని —

"నాకు తగిన గౌరవమర్యాదలు నాకు లేకపో లేదు. నీయింట్లో నే వుంటటం నీకు యిష్టం లేకపోతే యీ క్షణంలో వెళ్ళిపోతాను. నేం గడపలో అడుగు

పెట్టగానే ఆ వ్యాధు గోమతినిగూడ తీసుకువచ్చావా అని. అప్పుడు నేను తెలుసుకోలేకపోయాను. వెళ్ళ డాంరా నాన్నా" అంది అక్కడికి మంగమ్మమీద దూకుడుతో నాన్నమీద కోపం తగ్గినట్టు.

గోమతి యింటికి వెళ్ళగానే తల్లి యెదురు వచ్చింది. తనభర్త, కూతురుమొహాల్లో మార్పును నిమిషంలో గ్రహించింది శారదమ్మ. ఎప్పుడైనా గోమతి విచారంగా కూర్చుంటే ఆసంగతి తెలిసిందేమోనని భయపడుతూ వుండేది. అలాంటిభయమే యిప్పుడు కల్గింది సహజంగానే, లోపలకురా అమ్మా గోమతీ ఏం అట్లా వున్నావే, అన్నది తల్లి జుట్టు నిమురుతూ.

తోక త్రొక్కిన త్రాచువలె ఒక్కసారిగా 'ఇంతకాలంనుంచి కప్పిపుచ్చావు. ఇంకా కొంతకాలం కప్పిపుచ్చలేక పోయినావనా అనుకుంటున్నావు. నాతల్లే నన్ను యిట్లా చేస్తే......అని' వురుమింది.

'అ......అమ్మ......నాచిట్టితల్లికి యెవరు చెప్పారో. లేకలేక కలిగావని యెంత గారాబంగా పెంచానమ్మ నిన్ను. ఒక్కదానివి ఒక్కకూతురుకదా అని. పెద్దదాన్నం అయిపోయినానుగదా, మేము నీపెళ్లి ముచ్చట్లుచూడ్డామని, నవ్వే యింటిదానివవుతే చూడ్డామని యెంత కుతూహలపడ్డామమ్మ. మాదురదృష్టం కొద్దీ పెళ్లి కాస్తా అట్లా జరిగింది. నిన్ను జాలి పడ్డపెళ్లా నాగుండె తరుక్కుపోతూవుండేది. నీకెక్కడ తెలిసిపోతుందో, నీమనస్సు యెక్కడ చెదిరిపోతుందో అని యిన్నాళ్ళనుట్టి కనిపెట్టుకొచ్చాను. నిజం ఎన్నాళ్లు దాగుతుంది. కప్పిపుచ్చక చేసేదేముంది తల్లీ...ఏడవక...ఏడవకమ్మా' అంటూ తనవళ్ళోకి తీసుకుంది. గోమతికి కోపంపోయి దుఃఖము యెక్కువైంది. వెక్కివెక్కి ఏడవటం మొదలుపెట్టింది. ముసలాయన చూడలేక గొడ్లోకి వెళ్ళాడు. ఆనాటల్లా గడిచిపోయింది. తల్లి గోమతిని అనేకవిధాల బ్రతిమాలుకొంది. "జీవితం అంతా వుండేదానికి సందెనిబ్బరము చేసుకోవాలమ్మ, ఇప్పుడు దిగులుపడితే ఏమిటి వుపయోగం. మనస్సు చెడిపోవటమే నా యింకేమున్నా వుందా? చెయ్యిజారి పోయింతర్వాత అనుకుంటే యేం లాభం. మాచిట్టితల్లికి యీఅవస్థ వస్తుందని కల్లోకూడ అనుకోలేదు." అంటూ అనేకవిధాల ఓదార్చటానికి శారదమ్మ విఫలప్రయత్నాలు అనేకం తలపెట్టింది.

ఈసారి మళ్ళీ గోమతికి,తల్లిదండ్రులమీద కోపం వచ్చింది. "నువ్వు చెయ్యాల్సిందేమిటో చేశావు. నువ్వు చెప్పాల్సిందేమిటో చెప్పావు. నాకు తెలియకుండానే నాకు పెళ్లి చేశావు. నన్ను గోతిలో దింపావు. యింకేం యేం చెయ్యాలి! ఇప్పుడేమో 'నీపతి పోయాడు, నీజీవితమంతా యింతే' అంటున్నావు. ఇప్పుడుకూడ గోతిలో దింపుదామనా నీవుద్దేశం! నువ్వు చేసింది యింతవరకు చాలు. ఇక నాదారి నే చూసుకుంటా"అని వాకిట్లోకి వెళ్లింది. శారదమ్మ గబగబ వాకిట్లోకి వెళ్లి 'ఎక్కడికే వెళ్లటం'అంటూ వెంబడించేవరకే నలుగురూ పోగవటం తలోమాటా అనుకోటం జరిగినాయి. గోమతిమాత్రం యెవరేమి అనుకుంటున్నా, వెనక్కి చూడకుండా ముందుకే సాగింది. ఎదురుగుండా మేనమామ రామయ్య రావటం చూసింది గోమతి. చటుక్కున ఆగింది. మేనమామ అంటే అతివినయం, ప్రేమ, భయం, గౌరవం. ఆయనకు యీవిషయం ఇప్పుడే తను తెలియచెయ్యటం యెందుకని నామాలు, చేటంతా పెంపు చేసుకొని,"ఎక్కడినుంచి మామయ్యా రావటం, ఇంటిదగ్గిర నుంచేనా" అంది మామూలుగా మాట్లాడుతున్నట్టుగానే. బజారులో అలజడి, యీగలభా చూస్తున్న రామయ్యకు కొంచెం అనుమానం వేసింది. గోమతి విషయం మొదటినుంచి తెలిసినవాడు కాబట్టి, యేం కోపం వచ్చిందో అనుకున్నాడేకాని,కొంపదీసి వెళ్లిపోతుందని ఆయనకేం తెలుసు!

ఇద్దరూ యింటికి వెళ్లారు. వారిద్దరినీ చూసి, శారదమ్మ, "సమయానికి వచ్చావురా అన్నయ్యా. నువ్వు రాకపోతే గోమతిసంగతి యేం కాను!" అంది కన్నీళ్లు తుడుచుకుంటూ. రామయ్యకుమాత్రం సంగతి యేమిటో తెలుసుకుందామని ఆతురతఅవుతే వుందిగాని యెవర్ని అడిగేటట్టూ అనే ప్రశ్న కలవ మౌనంగా కూర్చున్నాడూ గోమతికే అడుగుదామన్నట్టుగా ఆవిడవంక చూశాడు. ఆవిడకళ్లల్లో నీళ్లు గిర్రున తిరిగాయి. రామయ్యకు అర్థ

మైంది. ఒక్కసారిగా తల వంచుకున్నాడు. "మామయ్యా" అని పెద్దకేక వేసి గోమతి ఆయనవళ్ళోకి వరిగింది, సుశ్వేనా చెప్పకపోతివిగదా అన్నట్టు. "ఇది చూసి, మునీలాంటివ మళ్ళీ కళ్ళనీళ్ళు పెట్టుకోవటం, మగవాడు, ఆయన కూడ యెంత బాధపడుతున్నాడో అని అక్కడకొచ్చినవాళ్ళు అనుకోవటం, గోమతికంటె యెక్కువగా ఏడుస్తున్న శారదమ్మను ఓదార్చటం—ఇవన్నీ జరిగినాయి.

రామయ్యగారి రాకవలన గోమతిప్రయాణం ఆగిపోయింది. లేకపోతే యెక్కడికి వెళ్ళేకో అని అందరు అనుకున్నారు. రోజులు మారినాయి. మనస్సులుమాత్రం మారలా. ఆయనరాక గోమతిమనస్సు మార్చలేదు. అదిన సమయంకోసం నిరీక్షిస్తున్నట్టు కనిపించింది. ఇట్లా వుండగా, అన్నయ్యదగ్గరనుంచి యింతవరకూ వుత్తరం లేదు, యే విషయం తెలియలేదు అనుకొని, మంగమ్మ బయలుదేరివచ్చింది యిక్కడికి కొడుకు, కోడలితో సహా. రతిని చూడగానే గోమతి గబగబ వెళ్ళి యింట్లోకి తీసుకు వెళ్ళింది, మంగమ్మకేసి కోరచూపు చూస్తూ. మంగమ్మ, శారదమ్మ యిష్టాగోష్ఠిగా మాట్లాడుకున్నారు. మంగమ్మ యేమో, వాళ్ళ యింటిదగ్గర జరిగిన తతంగంఅంతా శారదమ్మతో చెప్పింది. శారదమ్మేమో, అమ్మాయి ప్రయాణం అవటం, రామయ్యగారు రావటం యీ గ్రంథం అంతా మంగమ్మతో చెప్పింది. రామయ్య, మేనకోడలును దగ్గరకు తీసుకొని ఏవో నీతులు బోధిస్తూనే వున్నాడు.

ఆనాడు రాత్రిభోజనాలు అయినాయి. నిద్రపోయే సమయం. గోడగడియారం పదకొండు కొట్టింది. ఆచప్పుడు తప్ప అంతా నిశ్శబ్దం. గోమతితప్ప అంతా గాఢనిద్రలో వున్నారు. గడియారపు ముల్లె ఒకటి, రెండుమీదకు రావటంగూడ, గోమతి చూస్తూనేవుంది. రెండు దాటుతూవుండగా ఒక దిక్కుటి వూహ తట్టింది. అవూరికి సుమారు 30 మైళ్ళదూరంలో ఓ ఆశ్రమము వున్నది. ఓసారి వాళ్ళ మామయ్య ఆఆశ్రమాన్నిగురించి చెప్పుతుండగా విన్నది. అక్కడకు అందరూ వెళ్ళవచ్చుని, ఉచితంగా భోజనాలు యేర్పాటుచేస్తారని, అనాథస్త్రీలకు, అనాథబాలురకు ప్రత్యేకయేర్పాట్లు వున్నాయని, అక్కడే వుంటే స్త్రీపురుషులను వివాహముచేసుకోవాలని యిచ్ఛకలిగితే, అప్పటి మేనేజరుకు తెలియపరుస్తే ఆయనే స్వయంగా వివాహమునకు పూనుకుంటారని, అనేకవిధాల స్త్రీ, పురుషుల ఉద్ధరణకు ఆ ఆశ్రమము యేర్పడినదని చెప్పుతుండగా గోమతి విన్నది. ఆఆశ్రమానికి వెళ్ళితే తన కోరిక ఫలిస్తుందని అదివరకు గట్టి నమ్మకం కల్గింది. వెంటనే తలుపు తీసుకొని, ఆవెన్నెల రాత్రిలో గబగబ స్టేషనుకు దారిపట్టింది. మర్నాడు తొమ్మిదిగంటలకు ఆశ్రమానికి చేరుకుంది.

మామూలుగానే తెల్లవారింది. ఎవరి పనులలోకి వాళ్ళు వెళ్లారు. దిళులతో పడుకుంటేమోలే, యిప్పటినుంచి లేపటం యెందుకు అదిన చేసే పనంతా చేసి పోతుందికదా అంటూ శారదమ్మ గోమతిగదివైపు వెళ్ళలేదు. అందరూ అదే వుద్దేశపడ్డారుగామోలు, యెవరూ ఆగదివైపు వెళ్ళలేదు. తొమ్మిదిగంటలయినా లేవకపోతే, యింతసేపటిదాకా పడుకుంటే అని గదిలోకి వెళ్లారు. గోమతి కనిపించలా. రామయ్యకాంతమ్మల గుండెలు ఝల్లుమన్నాయి. తలోమూల వెదికారు. ఇంతలో మంగమ్మ వచ్చి 'నేను తెల్లవారుఝామున లేచేటప్పటికి వాకిటితలుపు గొళ్ళెము తీసివున్నది. మీరెవరైనా తీసి వాకిట్లోకి వెళ్ళి, తెల్లవారొస్తోంది గదా అని మళ్ళీ వెయ్యలేదేమో అనుకున్నా. అయ్యో! అప్పుడే చెప్పితే, కనిపెట్టేవాళ్ళమేమో' అని గోల పెట్టింది.

రామయ్యగారు పెద్ద కర్మిష్టి కాకపోయినా, అధునికఆలవాట్లలో ముందంజ వెయ్యటానికి జంకుతాడు. ఎవరైనా ముందంజవేస్తే, ఆయనకంటె పంతో పిడిచేవాడు యింకోడుండడు. మన జీవితం మప్పాతిక వెళ్లిపోయింది. తప్పో వప్పో ఆపాతికకూడ వెళ్ళిపోతేసరిపోతుంది. ఈకొత్తలో మార్పు యెందుకులే అని అనుకుంటాడు. గోమతి వెళ్ళిపోవటం ఆయనకే ఆశ్చర్యం వేసింది. తనను మోసగించింది అనుకున్నాడు. మళ్ళీ అదివస్థితి జ్ఞాపకంతెచ్చుకొని జాలిపడ్డాడు. ఎక్కడికి వెళ్ళిందో, యేం కష్టాలు పడుతుందో. యింటికి తీసుకువస్తే బాగుంటుందని తన యెరికగల వాళ్ళను చోట్లకి కబురుపంపాడు. మర్నాడు ఆయన ఓవైపు

బయలుదేరాడు. ఆ స్టేట్ ఆలోచిస్తూ ఓ గ్రామం చేరుకున్నాడు. అక్కడ సత్రంలో బసచేశాడు. ఆశ్రమంలోకే అమరనాథ్‌ను వెతుక్కుంటూ ఓ బాటసారి వచ్చాడు. ఆయనకు మహా విసుగు, కోపిష్టి. తప్పనిసరిగా రావలసివచ్చింది. ఆయన కనిపించిన ప్రతి మనిషితోను, తనువచ్చిన పని చెప్పతూ వుంటాడు అమాకీ యేదైనా తెలుస్తుందేమోనని. ఇప్పటికి కాశీ నుంచి బయలుదేరి నెల దాటింది. ఆయన మాటలు ధోరణిలోనే రామయ్యగారితో చెప్పటం మొదలు పెట్టాడు.

'కాశీలో వెంకటేశ్వరశాస్త్రిగారు అనే ఆయన వున్నారు. పెద్ద ధనవంతుడు. దానధర్మాలలో పేరు పొందినవాడు. పూర్వాచారాల్లో నమ్మకంగల మనిషి. ఆయనకు యిద్దరే కొడుకులు. పెద్దకొడుకు డాక్టరుగా అక్కడే వుంటున్నాడు. రెండో కుమారునకు పెళ్లిసంబంధాలు అనేకం వచ్చినాయి. వాటిలో యేదో ఒకటి చేసుకోమని తండ్రి బలవంతపెట్టుతూవచ్చాడు. ససేమిరా అని నప్పుకోలేదు. ఆ అబ్బాయి బ్రహ్మసమాజమతం ఆర్యసమాజమతం యిలాంటివాటిల్లో తిరుగుతూవుండేవాడు. అందువలన విధవదాననే పెళ్లి చేసుకుంటానని చాలా రోజులనుంచి చెప్తూవచ్చాడు కూడ. తండ్రి ఆ మాటలు లెక్కపెట్టక ఓ సంబంధం నిశ్చయంచేశాడు. దాంతో ఒకనాడు చెప్పకుండా లేచి వచ్చాడు. ఎక్కడికి వచ్చాడో యింతవరకు జాడ తెలియలేదు. నెలరోజులబట్టి వెతుకుతున్నాను. అన్నిసమాజాలకూ, అన్ని ఆశ్రమాలకూ వెళ్లివచ్చాను. ఇక్కడ కూడ ఓ ఆశ్రమం వుందంటే అక్కడకు కూడ వెళ్లివద్దామని బయలుదేరాను. మీ యెరికలో యేమైనా తగిలాడేమో చెప్పండి బాబూ. పద్దెనిమిది, ఇరవై సంవత్సరాలు వుంటాయి. మనిషి ఆజానుబాహుడే. సుంద్రటి మొహం. పేరు అమరనాథ్' అన్నాడు ఆదుర్దాగా ఆ బాటసారి.

తన గతే పాపం యీ ఆయనకుకూడ పట్టిందని లోలోపల జాలిపడుతూ, 'అయ్యా, నేను వస్తానులెండి మీతోపాటు. నేను అలాంటిపనిమీదనే బయలుదేరాను. అదంతా ఓ గాథ. చెపితే తీరేదా? ఇంతకీ యెవరి అదృష్టం యెలా వుందో!' అని ఒక వేదాంతిలాగా నిట్టూర్పు విడిచాడు రామయ్య. ఇద్దరూ అవిషయాలే మాట్లాడుకుంటూ ఆశ్రమానికి చేరుకున్నారు. ఆశ్రమంలోకి వచ్చినవాళ్ళను గౌరవించే అలవాటుచొప్పున వాళ్ళిద్దర్నీ లోపలికి తీసుకువెళ్ళారు ఆశ్రమవాసులు. బాటసారి రావటం, రావటంతోనే మేనేజరుకు మాటలుగానే తనగ్రంథం అంతా వినిపించాడు. రామయ్య గోమతివిషయంలో అంత ఆదుర్దా చూపించలేదు.

'అమరనాథ్ అనే అబ్బాయి యిక్కడ లేడు. కాశీనుంచి నెలరోజులలోపల అసలు యెవరూ రాలేదు. ఇతరచోట్లనుంచి మాత్రం వచ్చారు ఇద్దరుముగ్గురు' అని మేనేజరు జవాబిచ్చేటప్పటికి ఆ బాటసారి కాళ్ళు చేతులు చల్లబడ్డాయి. మళ్ళీ మేనేజరు మాట్లాడుతూ, 'మీరు చెప్పిన గుర్తులను పట్టి చూస్తే, అలాంటి మనిషే వున్నాడని తోస్తోంది. అయినా ఆ అబ్బాయి యిప్పుడు యిక్కడ లేడు. సామాన్లు తీసుకు రావటానికి ప్రక్కవూరు పంపించాను' అన్నాడు. ఏపాటు తప్పినా సాపాటు తప్పదనే సామెతగా రామయ్యగారితో ఆయనకూడ భోజనానికి లేచాడు. ఆ ఆశ్రమం, ఆశ్రమంలో వుండే గౌరవమర్యాదలు, వాళ్ల వినయాలు అవన్నీ చూసేటప్పటికి రామయ్యగారికి బయలుదేరిన పనే మరిచేపోయినట్టు అనిపించింది. ఆలోచిస్తూ నిదానంగా భోజనం చేస్తున్నాడు. ఇంతలో 'తమకు కొంచెం కూరవడ్డించమంటారా' అనే శబ్దం వినిపించేటప్పటికి, కొంచెం తలయెత్తి వట్టి యెత్తి 'అక్కరలేదు......' అని విస్తుపోయి దిగాలుపడిపోయాడు. నోట్లో పెట్టుకోబోతున్న ముద్ద చేతులోంచి జారి క్రిందపడింది. వడ్డిస్తున్న మనిషి గోమతి. ఆమెచేతిలోంచి పళ్లెం క్రిందపడింది. ఆవిడకు ఒళ్లంతా ముచ్చెమటలు పోసినాయి. శరీరం వణుకుతోంది. నోట మాటలేదు. చూసేవాళ్లకు యేమీ అర్థంకావటంలేదు. కొంతమంది మేనేజరు కోసం వెళ్లారు. కొంతమంది భోజనాలనుంచి లేచివచ్చారు. రామయ్య ఒక క్షణం ఆగి 'నువ్వు యిక్కడకు వచ్చావా' అన్నాడు. ఆమాటకు మరింత భయము వేసింది గోమతికి. ఇంతలోకి మేనేజరు వచ్చాడు. గోమతిని అవతలకు తీసుకువెళ్లాడు. గబగబ నాలుగు మెతుకులు నోట్లో వేసుకొని అందరూ లేచారు. మేనేజరు చాటుగా పిలిచాడు రామయ్యను. బాటసారి, ఆయన వెతుకుతున్న మనిషి కనిపిస్తే నాకేం లాభంఅన్నట్టుగా నిస్పృహా కనపరచాడు మొహంలో. గోమతినిగురించి ఆదుర్దాగా ప్రశ్నలు వేశాడు రామయ్య. నిదానంగా మేనేజరు వివరాలు తెలియపరుస్తూ 'ఆఅమ్మాయి మీ కేం కావాలో నాకు తెలియదు. పెళ్లి నిశ్చయం చేశాను ఇక్కడవుంటున్న ఆశ్రమవాసి రామారావుతో. పైసోమవారమే. ఇద్దరూ అంగీకరించారు' అన్నాడు యీయనన్ను కూడ ఆహ్వానించినట్టుగా.

'అట్లాగా......వస్తాను' అన్నాడు అతినిబ్బరంగా గడపదాటుతూ, మళ్ళీ మేనేజరు పిలుస్తుంటే పలకకుండానే.

మేనేజరు అట్లా కన్ను ఆర్పకుండా చూస్తూ చూస్తూ గోమతిని అనుకుదామని ఆయన యోచనతో గబగబ అటు కేపుకు వెళ్తూండగా, ప్రక్క వూరునుంచి సామాన్లు తెస్తున్నవాళ్లు యెదురయ్యారు. బాటసారి గబగబపరుగెత్తుతూ, గుండె బాదుకుంటూ 'అమరనాథ్' అని ఒక్కసారిగా అరిచాడు. చప్పున ఆఅబ్బాయి అటు చూసి కామయ్యగారు, మీరా! యెప్పుడు వచ్చారు?' అన్నాడు.

'నాయనా, నీకోసం తిరిగితిరిగి కాళ్లు కండెలు కట్టినాయి. చిట్టచివరకు యిక్కడకు చేరాను. నువ్వు కనిపించావు. మీ నాన్నగారు నువ్వు వెళ్లినప్పటినుంచి దిగులు పెట్టుకున్నారు. గుక్కెడు నీళ్లుకూడ త్రాగటం లేదు. మీ వదిన, అన్నయ్యకూడ దిగులుపడిపోయారు. వుత్తరంఅన్నా వ్రాయకపోతివే అమరనాథ్' అన్నాడు కౌగలించుకొని కామయ్య.

'నిన్ననే యింటిదగ్గరనుంచి వుత్తరం వచ్చింది. మాఅన్నయ్య, వదిన రేపు వస్తారట యిక్కడికి. మానాన్నకు నామీద కోపం తగ్గినట్లు లేదు. ఆయన రాడట. ఇంతకీ నీకు తెలిసిందా, రేపు సోమవారమే నా పెళ్లి. ఈఆశ్రమంలోనే' అన్నాడు అమరనాథ్.

ఇంతలో మేనేజరు కల్పించుకొని 'నీపేరు రామారావుఅని చెప్పావేమిటి? అసలు పేరు అమరనాథ్ అన్నమాట. నన్నే మోసగించావు. ఆశ్రమధర్మాలకే విరుద్ధంగా ప్రవర్తించావు, తప్పుడుపేరుతో వ్యవహరిస్తూ. ఈఆశ్రమంలో శిక్ష, యిలాంటి తప్పులకైనా, యిక్కడ నుంచి వెళ్లగొట్టటమే. ఇంతకీ రేపు పెళ్లి అవంగానే వెళ్లిపోతారుగదా. ఇంకా శిక్ష యేమి వుంటుందిలే! అదివరకు, ఓసారి, ఓపెద్దమనిషి యీ ఆశ్రమంలో వున్నట్లు వుండి యిక్కడ వుంటున్న ఓఅమ్మాయిని అన్యాయం చేశాడు. ఆవిడ గర్భిణి అయ్యేంతవరకూ ఆగడం మాకు తెలియనే తెలియలా. చివరకు వాళ్లిద్దర్నీ ఆశ్రమంలోంచి వెళ్లగొట్టేశాను. నేను యెంత మాత్రం అవినీతిని సహించను. ఇంతకూ మీఅంతట మీరే వెళ్లిపోతున్నారుగదా' అన్నాడు తన కోపాన్ని, ఆవేశాన్ని నిగ్రహించుకొంటూ.

మన్నాడు వుదయమే శాంతా, గోపీలు దిగారు. తమ్ముడంటే గోపీకి అతిప్రేమ. ఏలాంటి పెళ్లి చేసుకున్నా తమ్ముడు, ఆయనకు యిష్టమే. గోపి యెప్పుడూకూడ—'నీయిష్టం వచ్చిన పిల్లను పెళ్లి చేసుకో' అని అంటూవుండేవాడు. ఒక్కసారిగా ముగ్గురూ కన్నీరు పెట్టుకున్నారు చూసి చాలాకాలమయినట్లు. పెళ్లి నిరాడంబరంగానే అయింది. మేనేజరునుంచి శెలవ తీసుకున్నారు.

'సరే. వెళదామా యింటికి, యిక్కడ యింకా ఆలస్యమెందుకు' అన్నాడు గోపి. శాంత అందుకొని, 'ఇక్కడికి వచ్చాముగదా. దగ్గరున్న రతిని చూడకుండా యెందుకు వెళ్లటం. మళ్ళీ యెన్నాళ్లకు చూస్తామో యేమిటో. ఇదో కారణంగా యింతదూరము రానే వచ్చాముగదా. ఏమండీ...ఏమంటారు?' అంది.

గోపి తల వూపాడు, వాళ్లిద్దరి స్నేహాన్ని వక సారి చూశాడుకాబట్టి. గోమతి దిక్కుమొహం వేసింది. బెదురుచూపులు చూస్తూ కదలకుండా నుంచుంది.

'క్రొత్త పెళ్లికూతురుకు సిగ్గెక్కువ. యెక్కమ్మా బండి' అంది శాంత. నవ్వుకుంటూ అందరూ ప్రయాణం అయ్యారు. సాయంత్రానికే ఆ వూరు చేరుకున్నారు. సరాసరి బండి రతివాళ్లయింటిదగ్గర ఆగింది. గోమతికి యేమీ అంటానికి వీలులేని పరిస్థితి యేర్పడింది. అటు బావగారు, తోడికోడలు, ఇటు భర్త, కామయ్యగార్లు. అట్లాగే భయంతో బండి దిగింది.

ఆ యింట్లో శారదమ్మ, మంగమ్మ మాట్లాడుకుంటున్నారు. 'మాఅన్నయ్య పెళ్లి చాలాకాలమయింది. యింతవరకు రాలేదు. దాని జాడ తెలిసిందో లేదో' అంది శారదమ్మ.

'వస్తారులే దిగులుపడక...' అని యింకా యేమిటో ఓదార్చబోతుంటే వాకిట్లో తలుపు చప్పుడయింది. వెంటనే తలుపు తీసింది. యెట్టయెదుట శాంత కనిపించింది. మంగమ్మ నిమిషంలోకి గుర్తుపట్టింది శాంతను, రతి స్నేహితురాలని. రతి పెరట్లోనుంచి వస్తూ 'శాంతి' అంటూ వక్కసారిగా కౌగలించుకొంది.

శాంత నవ్వుతూ 'మా మరిది పెళ్లి అయింది. ఇక్కడి ఆశ్రమంలోనే. నిన్ను చూసి పోదామని వచ్చాను. పెళ్లికూతురికి సిగ్గువదల్లా. గోమతీ, తల ఎత్తూ' అంది.

"ఆ......" అంది మంగమ్మ గడ్డం పెద్దదిచేస్తూ.

# కేరళరాణి*

## శ్రీ నాళము కృష్ణరావు

చల్ల నగు నొక్క హేమంత సంజవేళ,
విరుల పొదరింట కమ్మ తెమ్మెరలు వీవ,
చలువరాతిన్నెపై నొక్క తలిరుబోడి
యింపు మీఱగ వీణ వాయించుచుండె.

'జయము జయము కేరళరాణి! సరళరాణి!
ప్రేమమై నీదు ప్రియుడు పంపించినట్టి
పెండ్లికానుక లివె— వీని స్వీకరింపు'
మనుచు నొకదూతి యందిచ్చి, అవల జనియె.

'నాదు రాజ్యము పదవియు నా ధనంబు
నాదు వంశము నాశించి కాదు— నాదు
వరగుణంబుల మది మెచ్చి వలచె నతడు'
అనుచు దనలోన దా ననుకొనియె రాణి.

అంతిపురినుండి యరుదెంచి యా పెదాసి,
విలువ నగలను సన్నని వలిపములను
గాంచి 'ఈ కానుక లెవ్వ రంపించినారు?'
అనుడు, చిఱునవ్వు నవ్వుచు ననియె రాణి:

'ఇంతమాత్రమె దాసిరో! ఎఱుగవె?
నాదు చిన్నారి పొన్నారి నల్లుకాడు,
అనుగు మేనత్తకొడుకు సుధాకరుండు...
అతడు తక్క మఱెంకెవ్వ రంపువాడు?'

హర్షమున పొంగి పొరలుచు ననియె దాసి:
'శీఘ్రమే మీకు కల్యాణసిద్ధి రస్తు!
ఈశ్వరుడు మీకు శుభములు నిచ్చు గాక!
చల్లగా వేయియేండ్లు వర్ధిల్లుడమ్మ!
చెలువు కలవాడు, చిఱునవ్వు గలుగువాడు,
హొయలు గలవాడు, నవ్యంపు వయసువాడు,
ఇట్టి యున్నతు డటు లందనిచ్చి— నీకు
చిఱుతప్రాయమునాటి నెచ్చెలియె కాడు.

అఖిలలక్షణశుభ శోభ నొంగి నీవు,
చారుసుకుమారసుందరాకారు డతడు—
అన్నివిధముల సమరూపులైన మీకు
పెళ్ళి యొనగూర్చి నలువ తా జగుడు దలయె.

ఇంతకాలమునుండి నా హృదయమందు
దాచియున్న రహస్యంబు తల్లి! నీకు
తెలుపవలసిన తరుణంబు కలిగె నేడు,
కాన తెలిపెద— రాణివి కావు నీవు.'

అనుడు, పకపక నవ్వుచు ననియె సరళ:
'ఇట్టు లాడగ నీకు నో రెట్టు వచ్చె!
నేను రాణిని గా నంచు నీవు పలుక,
ఎవ్వ రైనను విన్నచో, నవ్వరొక్కొ?'

'అట్టు లైన వచించెద నమ్మ! వినుము—
వృద్ధభూపతి యవసానవేళ, తనదు
అనుగు తనయను నాపాలి కప్పగించి,
ఇట్లు వచియించె సకంప ముట్టిపడగ:

—లేమరో! నాకు తనయులు లేరు గాన,
రాజ్ఞి యిద్దియె నాదు సర్వస్వమునకు;
దాని కీవయె తల్లివి తండ్రి వగుచు
ప్రీతిపై నాదు కుల ముద్ధరింపు మమ్మ.—

కన్నకూతురువోలె నా దన్ను గడిపి
సాకితిని దాని, అది యొక్క సంజవేళ
ప్రాణములు వాయె, దానికి బదులు నాదు
కన్నబిడ్డను నిలిపితి నిన్ను సరళ!'

అనుడు బెఱగంది యారీతి ననియె సరళ:
'జనని! ఎంత యకృత్యంబు సలిపి తమ్మ!
నృపతియల్లుని రాజ్యంబు నపహరించి,
కట్టితివి దాని నాకు నీ కన్నసుతకు.

---

* *'Lady Clare'* నుండి అనువాదము.

ఒరుల రాజ్య మపేక్షింప రొల్ల, నింక
నీవు చేసినయట్టి యీ నేరమునకు
ప్రతికృతిగ వాని రాజ్యము వాని కొసగి
కానలకు నేగి కడపెద జీవవృత్తి.'

'పరళ! వల దమ్మ యింతటి సాహసంబు;
ప్రేమతో నీవు వానిని పెండ్లియాడ,
వానిరాజ్యము వానిదే యౌను గాదె!
ఇట్టి తెనుకకు బూనంగ నేటి కమ్మ?'

జనని కంటట కడసారి ప్రణతు లొసగి,
ఒక్క టొకటిగ తొడవుల నూడబెరికి,
నారచీరల ధరియించి, యూరు విడిచి,
విపినసీమల కరుగంగ వడలె పరళ.

నేరిపై పెక్కు మెల్ల వాదారి జనుదు,
తరుణి నల్లన గాంచి సుధాకరుండు
వెలుగుపోటును నిల్వర మెదకొనంగ
దిగ్గ రని నేరిపైనుండి డిగ్గి, అనియె:

'బాల! ఇది యేమి! నిలుపేదరాలివో లె,
ఒంటిమై కాననంబుల వంట రేయి
ఏల తిరిగెద పిలీల వేల నగుచు
సరస మృదువాణి! అలివేణి! పరళరాణి!

అలరుకోటల విహరింప నలయు నీవు
ఘోరవనముల నేరీతి నుమ్మరిలెదు?
కొదమచిలుకల పలుకుల కైదవు నీవు
పులుల బొబ్బల కెగతి నిలువ గలవు?

రమణిమిన్నరో! నాదు ప్రాణములకన్న
నిన్ను మిన్నగ ప్రేమించుచున్నవాడ,
ఇట్టి నను బీడి నీ విప్పు డక్కటకట!
నట్టడవి కేగ నీమన సెట్లు లొప్పె?'

హృదయమున నించుకేనియు బెదరు లేక
శివమై నిల్చి బదులిడె పూవుబోడి:

'ధరణీపతి యల్లుడవు నీవు, దాసి నేను—
ఎట్లు లొనగూడు నమరాగ మిట్టి మనకు?'

'ఎక్కటటా! చిట్టి దాసిరో! ఇట్టు రావె!
ఇన్ని నగ లెందు నేర్చితే వన్నెలాడి!
ఈవు దాసివ? అట్లు గేని, నేను
మునుడ! దాసానుదాసుడ నగుదు గాదె!

దాసివా నీవు? కేరళదేశరాజ్య
రమ్య సామ్రాజ్యసౌభాగ్యరాశి నీవు;
విమల ధవళదీధితికాంతిచే విశ్వ మెల్ల
భాసిలగ జేయు తేజోవికాసి నీవు.

చిఱుతపాయమునుండి కాంక్షించుచున్న
వాంఛ నీ వేరు తరుణంబు వచ్చె ననుచు
ఉల్లమున నెంతొ యువ్విళు లూరుచుండ,
అకట! నీ విట్లు చేయంగ న్యాయ మగునె?'

'తగునె నీ విట్టు లాడంగ ధరణివిభుడ!
నిక్కముగ నీవు రాజవు, నేను దాసి
ననుచు నే నెంత చెప్పిన విన వదేమి?'
అంచు జరగిన దెల్ల విన్పించె నంత.

'నీవు చెప్పిన మాటలే నిక్కమేని,
స్వామి రాజైన, రాణివి నీవు గాక,
ఏల యగుదువు దాసివి? చాలు చాలు—
ఇట్టి మాటల నీ వింక కట్టిపెట్టు.

రాణివో నీవు దాసివో యైన నేమి—
నిన్ను మనసార ప్రేమించియున్నవాడ'
ననుచు నామెను బిగికౌగిటను గదించి,
మోవి మోవిని గీలించి ముద్దు గొనియె.

జరిగె వారికి నలువారె పరిణయంబు;
ఎవరి రాజ్యము నేటికి నెలుగ దెవరొ—
వాని 'రా' జని, ఆమెను 'రాణి' యనుచు
పౌరు లెల్లరు పిలుతురు వారి నెపుడు.

---

# గ్రీష్మనిశ్వాసము

●

శ్రీ పి. గణపతి శాస్త్రి

ఊష్మలమరుభూమరీచివోలెన్
గ్రీష్మసీరవదివప్రభ మెరసెన్
మంద్రితవాతాయనగృహమ్ములన్
నిద్రితజననిశ్వాసము లెగసెన్.

ఈప్రచండమధ్యాహ్నకాంతిలో
ఈ ప్రచండతేజోహారతిలో
ఓయి! తెలివెలుంగుల చెలికాడా!
నాయెద కలరవమై పిలిచెసుమా!

నాకిట నిదురంగొనిన నీడలన్
శాకశిశుగళస్వనముల్ జారెన్
నాకు తాళపర్ణమ్ముల రొదలన్
నాకనుంగవం గలలుం దొరలున్.

తూలువేడిగాలుపుల బుసలలో
రాలు పండుటాకుల రవళులలో
ఓయి! చిరచిరంతనదూరసఖా!
నాయెద కలవరించెగద! నీకై!

తెరలతెరల సత్వరపవనములన్
మరిమరి నా మందిరమో మ్రోయున్
తరళతరళదుర్భర తేజములన్
మరల మరలి నిన్నరయు నయనముల్

కాని, జీవనవికస్వరసుమమే,
ఈ నితాంతగ్రీష్మమున వాడెనే!
ఓయి! హృదయసర్వస్వ! సుహృద్వర!
నీ యడుగుల సవ్వడి మ్రోయదుగద!

---

# కలగూరగంప

## దక్షిణకాశి - కాంచీనగరము

భారతదేశములోని సప్తపుణ్యక్షేత్రములలో కంచి వర మనబడు కాంచీనగర మొకటి. ఒకానొక కాలమున నిచట నూటయెనిమిది శివాలయములు, పదునెనిమిది విష్ణ్వాలయములు గలవట. దక్షిణభారతదేవాలయ శిల్పమున పల్లవనిర్మాణములు మొట్టమొదటివి. పల్లవులు, చోళులుకూడ ఈనగరమును రాజధానిగా పాలించిరి. తిరుప్పరుత్తికున్రం అను సమీపగ్రామమున జైన-కట్టడములు కన్పించుటచే నీనగరము కొంతకాలము జైనుల అధీనములో నున్నదని తెలియవచ్చుచున్నది.

కాంచీనగరపు పశ్చిమభాగమున వేరుగా పల్లవకాలపు కైలాసనాథాలయము గలదు. అత్యద్భుతభావనతో, మహత్తరమైన నిర్మాణదక్షతతో విరాజిల్లుచున్న దీ ఆలయము. ఇచట అర్ధనారీశ్వరుని విగ్రహ మొకటి గలదు. నారీఆకృతి చేతిలో వీణ ఉన్నది. పురుషాకృతి వృషభాధిరూఢమై యున్నది. ఈఆలయము పల్లవరాజగు రాజసింహునిచే నిర్మింపబడినది.

ఏకాంబరేశ్వరుని ఆలయ మింకొకటి గలదు. ఈఆలయపు గోడలపై కామదహనము చిత్రింపబడినది. ఇందలి మామిడిచెట్టును పవిత్రముగా పూజింతురు. వేగవతీనదీతీరమున పార్వతి శివునిగూర్చి ప్రార్థించగా, ఈ మామిడిచెట్టుక్రింద నామెకు శివుడు ప్రత్యక్షమైనాడని చెప్పుదురు. కుంభకోణమువద్దనున్న శక్తిముత్తము దేవాలయమున ఈకథ ననుసరించియే శివపార్వతుల ఆశ్లేషము చిత్రింపబడినది. తిరుక్కురిప్పుతొండనాయనారు కథకూడ ఈఆలయమునకు చెందినదే. ఈనాయనారు చాకలి వృత్తి గలవాడు. శివభక్తుల గుడ్డలు ఉతికి తెచ్చుటలో నితనికి ఆనందము, గర్వముకూడ ఉండెడివి. ఇతని భక్తిని పరీక్ష చేయుటకై ఏకాంబరేశ్వరు డితని కొకనాడు కనబడి తన చినిగినగుడ్డ పేలిక నిచ్చి సాయంత్రములోగా ఉతుకమనినాడు! అంతటితో నాదేవు డూరకొనక, ఈనాయనారు ప్రొద్దు తెలియకుండ చేయగలందులకని ఆకాశమును మేఘాక్రాంతము చేసినాడట! సాయంకాలము కావచ్చినను తన పని పూర్తికాకపోవుటచే, ఈనాయనారు దగ్గర నున్న రాతిపై తన తలను బాదుకొనబోయెను. అప్పు డేకాంబరేశ్వరు డతనికి తన నిజస్వరూపమున కనబడి, అతని భక్తికి మెచ్చి, ముక్తి నిచ్చినాడట.



కంచికైలాసనాథ దేవాలయ గాలిగోపురం

ఇందలి భగవన్మూర్తి మృణ్మూర్తి యగుటచే, దీనిని కడుగరు. ఈ ఆలయమున వేయిస్తంభాల మంటపమున్నది. ఈ స్తంభములపై అనేకచిత్రములు గలవు. ఇందున్న తటాకముకడ్డ పార్వతి శివునిగూర్చి తపస్సు చేసినదని చెప్పుదురు.

ఈనగరమున కామాక్షీ ఆలయ మొకటి గలదు. ఈ కామాక్షీ శాక్తేయుల యంత్రాకారమున, అనగా శ్రీచక్రస్వరూపమున, కలదు. భారతదేశమున కాశీలోని విశాలాక్షీ ఆలయమున, మధురలోని మీనాక్షీ ఆలయమున, ఈ కామాక్షీ ఆలయమున మాత్రమే చక్రాకారమున శక్తి ప్రతిష్ఠించబడియున్నది. మిగిలిన ఆలయముల చక్రముపై దేవత ప్రతిష్ఠించబడియుండును. కాని ఈ కామాక్షీ ఆలయమున, చక్రమునకు వెనుకగా దేవత గలదు.

హస్తిగిరి సత్యవ్రతక్షేత్ర మను కొండపై వరదరాజపెరుమాళ్ళ యొక్క ఆలయ మున్నది. ఇచట బ్రహ్మ ఒక యజ్ఞము చేసినా డందురు. విజయనగరాధీశుడగు అచ్యుతరాయ లీగుడికి పదునేను గ్రామముల నిచ్చినాడు. క్రీ. శ. ౧౬౮౮లో ఔరంగజేబుదండయాత్రకు భయపడి, ఈవరదరాజునకు శవాకారము చేసి బయటకు తీసుకొనివెళ్లి తిరుచునాపల్లి జిల్లాలోని ఉడయార్పాళెముదగ్గర దాచిరట. ఈ అపాయము గడచిన పిమ్మట ఉడయార్పాళెపురాజు కాంచీనగరమునకు విగ్రహమును తీసికొనిపోనీయలేదు. అందుచే అత్తంజీయార్ యొక్క కృషివలన, యుద్ధమైనతర్వాతనే ఈ విగ్రహము కాంచీనగరమును ప్రవేశించినది. కావుననే నేటికి గూడ ఇచట ఉడయార్పాళెపు తిరణాల జరుగుచున్నది.

ఈ ఆలయమున నాలుగుస్తంభముల మంటప మొకటి గలదు. ఈ స్తంభములపైకప్పు శిల్పమున అద్వితీయమైనది. ఈశిల్పమును నాటికీ ఈనాటికికూడా మించునది లేదనుట అతిశయోక్తి కాదు.

పల్లవరాజగు నందివర్మమల్లుడు వైకుంఠపెరుమాళ్ ఆలయమును కట్టించినాడు. తిరుమంగయాళ్వార్ అను వైష్ణవభక్తు డీదేవునిగూర్చి అనేకస్తోత్రములు వ్రాసినాడు. ఈ ఆలయపు ప్రాకారగోడలపై నరసింహవర్మ అను పల్లవరాజునకు గల పల్లవరాజచరిత్ర చిత్రములద్వారా వెల్లడింపబడియున్నది.

పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

---

మచిలీపట్నం పౌరులు ఏప్రిల్ నెల 13-వ తారీఖున జాషువా కవిగారిని రూ. 4116/లు ఇచ్చి సత్కరించినప్పటి ఫోటో. పుష్పమాలాలంకృతులు జాషువాగారు.

---



విజ్ఞానపురోగమనం - క్షణంలో విమానంగా మారి గాలిలోకి ఎగిరిపోగల మోటారుకారు.



# విమర్శనము



## గ్రహదృష్టి

గ్రంథకర్త : పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు, యం. ఏ., యం. లిట్. ప్రకాశకులు : జ్యోతిష్సాహిత్యప్రచురణాలయము, తెనాలి. వెల రూ. ౨-౮-౦.

హోరా శాస్త్రమందలి చిక్కు సమస్యలలో గ్రహదృష్టి యొకటి. గ్రహములు సూచించు ఫలములు ఆయా గ్రహముల నైజగుణము, రాశి, భావము—వీని సమష్టిసర్వస్వము నాశ్రయించి యుండు ననుట శాస్త్రసంప్రదాయము. గ్రహము యొక్క స్వభావగుణము ఆ గ్రహము సంచరించుచున్న రాశివలన ఏవిధముగ మార్పును చెందునో, అట్లు మార్పు చెందిన గుణము భావము ననుసరించి జీవితములో ఏ ఏమార్గమున వ్యక్తమగునో, ప్రాచీనగ్రంథకర్తలు కొంత విపులముగా చర్చించియున్నారు. కాని, పై రీతిగా సాధించిన ఫలము ఏజాతకమందైనా, సామాన్యముగా, శుద్ధముగా కాని, సమగ్రముగా కాని చూపట్టుట అరుదు. ప్రపంచములో నున్న గ్రహము ఇతర గ్రహములతో జన్మకాలమున సంపాదించుకొన్న సంబంధముల ననుసరించి ఆ గ్రహము సూచించు ఫలము కొన్ని మార్పులకు లోను కావలసివచ్చును. అట్టి సంబంధములలో దృష్టి ముఖ్యమైనది.

కాని, ఫలాదేశవిషయమున దృష్టి ఎంత ముఖ్యమో, దాని నిర్ణయ మంత గహనము. ఈవిషయమున భిన్నసంప్రదాయము లున్నవి. సర్వసాధారణముగా ఇప్పటి కాలమున మన జ్యోతిష్కులలో వాడుకలో నున్నది, "అన్ని గ్రహములకు సప్తమదృష్టి కలదు, తృతీయదశమములపైన శనికి, పంచమనవమములపైన గురువునకు, చతుర్థాష్టమములపైన కుజునికి విశేషదృష్టి యుండును." అను స్థూలసూత్రమే! పైస్థానములలో తప్ప వేరురాసులలో నున్న గ్రహములకు పరస్పరదృష్టిసంబంధము వాడుకలో కార్యాంతికముగా ఉపయోగించుట లేదు. కాని, పరాశరుడు, వరాహమిహిరుడు మున్నగు మహనీయుల మతములో ౩, ౪, ౫, ౭, ౮, ౯, ౧౦ స్థానములలో గ్రహమునకు బలతారతమ్యముతో దృష్టి అంగీకరించబడియే యున్నది. ఈ సంప్రదాయమునే అనుసరించి, చూచు గ్రహమునుండి చూడబడు గ్రహము ౩౦ భాగలు మొదలు ౩౦౦ భాగలదాక (౧౫౦ వ భాగతప్ప) ఏభాగలో నుండినా, దృష్టి కలదని చెప్పి, ఆ దృష్టిపరిమాణమును స్పష్టముగా గుణించు పద్ధతిని శ్రీపత్యాచార్యుడు విపులముగా వ్రాసియున్నాడు. ఇక, జైమినిసంప్రదాయము— అన్ని విషయములలోవలె దృష్టివిషయములో సయితము ప్రత్యేకపంథ నాశ్రయించినదే. ఈ సంప్రదాయము ఉత్కలదేశములో సామాన్యప్రచారములో నున్నదట. మన దేశములోని జ్యోతిష్కులు, ఏదో సమయము వచ్చినపుడు, జైమినిసూత్రములు కొందఱు ఫలాదేశవిషయములలో ఉపయోగించుచున్నారే కాని, జైమిని దృష్టిపద్ధతిని వాడుకలోనికి తెచ్చుకోలేదు. ఒకవిధముగా, జైమినిపట్ల ఇది అన్యాయమే.

ఇక, దృష్టిఫలవిషయమును విపులముగా చర్చించినవారు ప్రాచీనులలో కల్యాణవర్మ. భిన్న భిన్న రాసులలో గ్రహ మున్నప్పుడు, ఇతరగ్రహములలో ప్రతిగ్రహమునుండియు దానిపై వచ్చు దృష్టికి ప్రత్యేకముగా ఫలములను విశదీకరించిన గ్రంథ మతని సారావళి. ఇతడు వరాహమిహిరమతానుయాయి.

కాని, దృష్టికి ప్రత్యేకముగా శుభాశుభత్వములు మన ప్రాచీనులు నిర్ణయించినట్లు కానరాదు. శుభగ్రహములదృష్టి మంచి దనియు, క్రూరగ్రహముల దృష్టి చెడ్డదనియు సామాన్యవ్యవహారము. కాని ప్రాచీనులు చెప్పిన యోగములను గమనించితిమేని, అనేక సందర్భములలో, గ్రహముల కేంద్రదృష్టికి దుష్టఫలమునే వారు విశ్వసించిరని తోచకమానదు. రవి చంద్రుల కేంద్రవర్తిత్వమునకు అధమఫలమును వరాహమిహిరుడే కంఠోక్తిగా వచించినాడు. ఇది ఉపలక్షణమాత్రముగా భావించితిమేని—వరాహమిహిరుని సూత్రము లనేకము లట్టివి—ఇతరగ్రహముల విషయమున సయితము కేంద్రదృష్టికి అశుభఫలమే వరాహమిహిరుని అభిమత మనవలసివచ్చును. నాభసయోగములలో పెక్కింటియందు దీనిధర్మమే సూచింపబడియున్నది. శుభగ్రహములగు గురుశుక్రులు అన్యోన్యసప్తక దృష్టిలో నున్న కాలములో వివాహములు జరుపుట మహాదోష మని ముహూర్తశాస్త్ర ముద్ఘోషించుచున్నది. లగ్నములో గురువు, సప్తమస్థానములో శని కల జాతకుడు పాతకి అగునని ప్రాచీనసూత్రము కలదు. కేంద్రదృష్టి అశుభమనుటకు ఇవి అన్నియు తార్కాణ. ఇట్టి వెన్నో చూపవచ్చును.

కావున నే, తరువాతి కాలపు హోరాశాస్త్రవేత్తలు యవనసంప్రదాయమునుండి కేంద్రదృష్టి అశుభమనియు, కోణార్ధకోణదృష్టి శుభమనియు మాత్రములను స్వీకరించి, ఆ దృష్టియొక్క యుక్తివిచారణధర్మములనుగూర్చియు, పరిమాణనిర్ణయమునుగూర్చియు విపులమైన చర్చ గల పెక్కు గ్రంథములనే వ్రాసి పెట్టిరి. ఈపద్ధతికే తాజకసంప్రదాయమని వ్యవహారము. పాశ్చాత్యదేశములలోని జ్యోతిష్కు లిప్పుడు సర్వసాధారణముగా వాడుచున్న పద్ధతి, ఇంచుమించుగా, ఇదే.

దృష్టిని (౧) శుభదృష్టి (౨) అశుభదృష్టి అని విభజించి, ప్రత్యేకముగా అన్ని గ్రహముల దృష్టికిని ఫలవిశేషములను ఆంగ్లేయ జ్యోతిశ్శాస్త్రవేత్తయగు కార్టరు తన "జ్యోతిషదృష్టులు" (**Astrological Aspects**) అను గ్రంథమందు విశదీకరించినాడు. ఫ్రాంకు హేల్బర్టు అనువారు అశుభదృష్టులను గూర్చి ఒక ప్రత్యేకగ్రంథమును వ్రాసెను.

కాని, ఆంధ్రభాషలో గ్రహదృష్టిని గూర్చిన ప్రత్యేకగ్రంథము ఈవరకు వెలువడియుండలేదు. శ్రీ శాస్త్రిగారి ఈగ్రంథముతో ఆకొరత తీరినది. ఆంధ్రులు వారి కెంతో అప్పుపడినవా రనకతీరదు. నిరర్గళమైన పాండిత్యమునకు తోడు, నిరుపమానమయిన ప్రాచ్యపాశ్చాత్యహోరాశాస్త్రవిజ్ఞాన ముండియుండుకతమున నే, నేటిదాక ఇతరులు చేయి వేయని ఈ గహనవిషయముపై శ్రీ శాస్త్రిగా రింతటి ఉద్గ్రంథము వ్రాయగల్గుట. గ్రహదృష్టివిషయమునభిన్నమతములను సూచించి శ్రీపతిమతానుసారముగా దృష్టిపరిమాణమును సాధించు పద్ధతిని స్పష్టపరచుటయేగాక, తాజకసంప్రదాయము సయితము గ్రంథకర్తగారు వివరించినారు. పాశ్చాత్య పద్ధతిలో కార్టరుమతము ననుసరించి గ్రహదృష్టులకు, శుభాశుభవిభాగముతో, ప్రత్యేకఫలములు సమగ్రముగా ఈగ్రంథములో నిర్వచింపబడినవి. ఇంతేకాక, పాశ్చాత్యసంప్రదాయములోని దినమానదశ (*Secondary progression*), ఏకాంశవర్షదశ (*Primary progression*) అను దశాపద్ధతులయందు చలితగ్రహముల దృష్టులకు ప్రత్యేకఫలములు బాగుగా విశదీకరించి, ఆంగ్లభాషాజ్ఞానము లేని ఆంధ్రవిద్యార్థులకు పాశ్చాత్యపద్ధతులు సులభముగా బోధపడునట్లు వ్రాసి శ్రీ శాస్త్రిగారు మహోపకారము కావించినారు. ఈ గ్రంథములో, ప్రసంగవశమున, లగ్నసాధనపద్ధతి, భావసాధనసంప్రదాయము, గ్రహభావకారకత్వములు మున్నగు ఉపయుక్తవిషయములు అందందు చేర్చబడినవి. సారావళిననుసరించి ద్విగ్రహాదిసంయోగఫలములు, ప్రత్యేకరాసులలో గ్రహదృష్టిఫలములు మున్నగు విషయములు విపులముగా ఈగ్రంథములో చేర్పఁబడినవి కూడ. గ్రంథమంతయు హృదయంగమమగు సులభశైలిలోనే శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి. శాస్త్రీయ విషయముల నింత సుబోధమగు శైలిలో వ్రాయగల్గుట అనేకులకు సాధ్యముకాని విద్య. అందుకు వారికి ధన్యవాదములు.

కాని, ఉపక్రమోపసంహారములతో గ్రంథ మందలి విషయవిభాగమునకు సామరస్యయుతమయిన అకుకు అచ్చుటచ్చుట కానరాకున్నది. గ్రంథరచన బహుశః ఆత్రముతో జరిగియుండవలయు ననుకొను టకు అవకాశమిచ్చుచున్నది. రెండవభాగములో పది యవ అధ్యాయమునందు కొంతభాగము వ్యాసరూప ముగ, మరికొంత భాగము పటకరూపముగ వ్రాయబడి యుండుటయు, ద్వాదశరాసులలోని దృష్టులనుగూర్చి చెప్పు భాగములో 'ప్యారా'ల విభజన సక్రమముగా లేకుండుటయు గమనించినచో, గ్రంథరచన నెమ్మ దిగా ఒక నియమితపద్ధతిమీద జరుగలేదేమో యని తోచును. అచ్చుతప్పులుకూడ అందందు కొంత హెచ్చుగనే దొరలియున్నవి. ముద్రణముసయితము ఆత్రముగనే జరుగుటవలని ఫలము కాబోలు! ద్వితీయ ముద్రణమున ఇవి అన్నియు సవరింపబడగలవని నమ్మిక.

కీ. శే. శ్రీ కేతకరుగారు తమ 'జ్యోతిర్గణిత ము'లో యురేనస్సుకు వరుణు డనియు, నెప్ట్యూనుకు ఇంద్రు డనియు నామకరణము చేసియుండిరని పండితు లెరుగుదురు. వరుణశబ్దపు వికృతియే యురే నస్సు అను పాశ్చాత్యశబ్ద మగుటయు, భోగలాలసత, మోసగారితనము, శీలచ్యుతి మున్నగు ఇంద్రుని గుణ ములే నెప్ట్యూనుగ్రహపు కార్యములందు కానవచ్చు చుండుటయు ఈ నామకరణమునకు ప్రధానకారణ ములు. ఆంగ్లభాషాపదములకు మారుగా, కేతకరుగారు పెట్టిన పేర్లతోనే ఈ నూతనగ్రహములను వాడి యున్నచో, భాషకు అలంకారము, సంప్రదాయము నకు గౌరవము ఇతోధికముగా సమకూరియుండును.

వరుణుని కారకత్వమునకు లోబడిన విషయము లలో 'విమానములు, విమానయానము' చేర్చుట యుక్తమేకాని, వానిని మరల ఇంద్రుని కారకత్వము క్రింద సయితము చేర్చుట కేమి హేతువో తెలియదు. 'నాకలు, నాకాయానము' అనుట కిది ప్రమాదపతి తమా అనిపించుచున్నది.

ఫలములను సూచించు సందర్భములలో విద్యార్థు లకు సందేహాస్పదములగు విషయములు కొన్ని కాన వచ్చుచున్నవి. చలితశుక్రుని దృష్టి లగ్నముపై వచ్చి నప్రుడు 'కామక్రోధములకు గురియగుట' ఫలమట! శుక్రుడు కామకారకు డగుట సమంజసమే. కాని, క్రోధముసయితము ఇతని ఫలమా యను శంకకు అవ కాశ మున్నది. గురుశుక్రుల అశుభదృష్టివలన "వ్యాపార రీత్యా ధననష్టము, పాత్రాపాత్రవివేకము లేకపోవుట, ధర్మకార్యములకు తన తాహతుకు మించి వెచ్చించుట చెప్పవలెను. కళత్రసౌఖ్యమునకు భంగము వాటిల్ల గలదు. ఈ అశుభదృష్టి ఉన్నతోద్యోగుల కుండుట మంచిది." ఇది శాపమో, ఆశీర్వాదమో? పాత్రా పాత్రవివేకము లేక ధనమును వెచ్చించి కళత్రసుఖ మును కోలుపోవుట, ఉన్నతోద్యోగుల కయినా ఏవిధ ముగా మంచిదో, విద్యార్థులకు సుబోధమగురీతి కార్య కారణసమన్వయమయినా చేయవలసియుండును.

గ్రహములలో పరస్పరముగా, అధిమిత్ర, మిత్ర, సమ, శత్రు, అధిశత్రు రూపమయిన పంచవిధసంబం ధము ప్రాచీనగ్రంథములలో వివరింపబడియున్నది. కాని, గ్రంథకర్తగారు అధిసమత్వ మొకటి క్రొత్తగా ఉపయోగించిరి. ఇది ఏసంప్రదాయమో, దీనిని సాధించు మార్గ మేకో తెలుపుట అవసరము.

"వీక్షించెడి గ్రహభాగలను వీక్షింపబడువాని భాగలనుండి తీసివేయవలెను. శేష మున్నచో, అది షడ్రాసుల కధికమైన, దశరాసులనుండి తీసివేసి, మిగి లిన రాశిభాగలను పైభాగలలో కలుపవలెను." అను సూత్రములో 'పైభాగ' లనగా ఏ భాగలో, స్పష్టము కాదు. మరి, దీని కిచ్చిన ఉదాహరణ మిది :—

"వీక్షించు గ్రహము కర్కాటకమున ౫ భాగలు, ౨ లిప్తలలో ఉన్నాడని తీసుకొందము. వీక్షింపబడు రవి మకరమున ౮ భాగలు, ౫ లిప్తలలో కలడు. తీసి వేయగా, శేషము ౬ రాసులు, ౨ భాగలు, ౩ లిప్తలు. దీనికి దృగ్విశోధన (ఇదియేమో అర్థమగుట కష్టము.) చేయగా ౩ రాసులు, ౨౮ భాగలు, ౫౮ లిప్తలు. అనగా, ౧౧౮ భాగలు, ౫౮ లిప్తలు. దీనిని రెంటితో భాగించగా, ౫౯ భాగలు, ౨౯ లిప్తలు వచ్చును. ఇది గ్రహదృష్టి." సూత్రముతో ఉదాహరణమునకు

సామరస్యము చాలదని వేరుగా విన్నవించవలసి యుండదు. సూత్రమునకు విపులీకరణమాత్రమే కాక, ఉదాహరణమునకు వ్యాఖ్యానముసయితము కావలసి యున్నది.

మరియు, పాశ్చాత్యపద్ధతిలో వ్రాయబడిన దృష్టిఫలములతో సారావళి ననుసరించి చెప్పిన దృష్టి ఫలములను సమన్వయముచేయు టెట్లో, విద్యార్థులు సులభముగా తెలుసుకొను మార్గము కానరాకున్నది. 'ఎవరి గోల వారిది.' అను పద్ధతి అయినచో, ఈ రెండు భిన్నసంప్రదాయములు ఒకే గ్రంథములో వ్రాయుటవలన విద్యార్థులకు గొప్ప గందరగోళము. ఉదాహరణ మొకటి చూపుట అప్రస్తుతము కాదు. చంద్రబుధుల కేంద్రదృష్టికి పాశ్చాత్యపద్ధతి ననుసరించి, "అదుర్దా, మనోవ్యథ, క్రోధాదికము, అసత్యవాక్కు, మోసము, దొంగతనము, అపవాదులు వేయుట, నిష్కారణముగ ఇతరులతో తగాదాలు" ఫలమట. శ్రీ నెహ్రూపండితుని జాతకములో చంద్రబుధులకు కేంద్రదృష్టి ఇంచుమించుగా పూర్ణముగా నున్నది. అతని జాతకమునకు పైఫలములు చెప్పుట సాహసకార్యము మగునుకదా? ఆ బుధునిపైన గురుశుక్రుల అర్ధకోణదృష్టి యుండుటచే, బుధుని దోషము పోయిన దనవచ్చునేమో? ఒక గ్రహమునుండి వచ్చు ఫలము మరియొక గ్రహమునుండి నశించదని ఘంటాఘోషముగా చెప్పిన వరాహమిహిరుని వాక్యమున కేమి గతి? సారావళిసంప్రదాయముతో చూచినప్పుడు బుధ చంద్రదృష్టికి కొంత మంచిఫలమే కానవచ్చినా, ఆ బుధునిపై శనికి గల పూర్ణదృష్టికి, సాయనమార్గముతో నయినాసరే, నిరయనమార్గముతో నయినాసరే, గొప్ప దుష్ఫలమే కానరాగలదు. "సుఖము లేకపోవుట, బంధుశోకము, వ్యాధిపీడ, మిక్కిలిగా అనర్థముల ననుభవించగలవాడు, మలినుడు, సంక్లిష్టజీవనము గలవాడు అగును" అనుట నిరయనతులాబుధునికి శనిదృష్టి ఫలము. సాయనముగా, వృశ్చికబుధునిపై శనిదృష్టికి "దుఃఖవంతుడు, ఉగ్రస్వభావము కలవాడు, హింసా కృత్యములయందు ప్రేమ గలవాడు, కులజనహీనుడు (అనగా, తన వంశజనులలో హీనుడనుట) అగును." అనుట ఫలము. జిజ్ఞాసువులగు విద్యార్థులపాలికి ఇది గొప్ప అవ్యవస్థ.

విద్యాధికులు, హోరాశాస్త్రపారంగతులును అగు శ్రీ శాస్త్రిగారు ఈ గ్రంథపు ద్వితీయముద్రణమున పైసందేహములను తీర్చి, ప్రాచ్యపాశ్చాత్యదృష్టి ఫలములకు సమన్వయము చేయు మార్గమును, సోదాహరణముగా చూపి ఆంధ్రలోకపు కృతజ్ఞత పొంద గలరని ఆశ.

రా. గో. కృ.

---

## వేదభూగోళము - విరాట్స్వరూప విమర్శనము

ప్రథమసంపుటం : గ్రంథకర్త.. భిషఙ్మణి, విశ్వవిద్యావినోద శ్రీకుర్రవేటి తిప్పాశాస్త్ర్యులుగారు, యాడికి, అనంతపురంజిల్లా. వెల రు ౫/—

"సామాన్యభూగోళము కొండలు, నదులు, పట్టణములు, పల్లెలు, భూసారములు, పైర్లు, పంటలు మొదలగు వివరములను తెలుపును. ఇది యాధునిక భూగోళము. ఇక వేదభూగోళమన్ననో అద్వితీయాత్మ నుండి అఖిలప్రపంచము ఉత్పత్తియైన విధము, తత్క్రమము, తదంతర్గత చైతన్యవికాసము, తదనంతర సూక్ష్మస్థూలసృష్టిప్రకారము, జీవాత్మభేదము, జడ ప్రపంచస్వరూపము, జీవాత్మైక్యప్రయోజనము మున్నగా సమస్తవిజ్ఞానమును ప్రసాదించునది వేదభూగోళము" అని శ్రీ గరిమెళ్ల సత్యనారాయణ గారు మున్నుడిలో గ్రంథముపేరునకు అర్థము వివరించిరి. ఈ శీర్షికతో విరాట్స్వరూపవిమర్శనము అను నీగ్రంథము ప్రథమసంపుటముగా వెలువడినది. ఇందు భూగోళమునుగురించిన విషయములు కడుగొలదిగానే ఉన్నను పురుషసూక్తము, మంత్రపుష్పము, బ్రహ్మయజ్ఞము మున్నగు ప్రమాణములతో సృష్టివివరణము కలదు. "ద్వితీయ తృతీయ సంపుటములు పురాణభూగోళాదులలో గల సర్వవిషయములను శారీరకసంబంధములతో, నితరవిశేషవిమర్శనలతో త్వరలోనే వెలువడు"

వని గ్రంథకర్త తెలుపుచున్నారు. ఈ ప్రథమసంపుటము అధ్యాత్మప్రధానముగ విరచితమై శ్రీ జగద్గురు శ్రీ శంకరాచార్యులవారికి అంకితము. ఇందు ౧౨ స్తబకము లున్నవి. పాఠకులకు గ్రంథపరిచయము చేసిన శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు చెప్పినట్లు ఈ గ్రంథమంతయు నొక యెత్తు; ఇందలి స్తబకము లింకొక యెత్తు.

సృష్టిక్రమమునుగూర్చి మన పూర్వులు చేసిన సిద్ధాంతము ముందు పాశ్చాత్యుల సృష్టివివరణము సంప్రదాయములోనుంచి వచ్చినది చాల నీరసముగ తోచును. బహుళ పురాణములలో కడపటిదగు కాళికా పురాణములో భారతీయసంప్రదాయానుగతమగు సృష్టివివరణము అత్యద్భుతముగ క్రోడీకరింపబడి, పునారచింపబడినది. సృష్టిజాలమంతయు ఈశావాస్యమని, ఇదంతయు విరాట్స్వరూపమని, విరాట్పురుషుడు ప్రపంచించుకొనగా వచ్చినదే ఈ ప్రపంచమని మన భావము. దీని సిద్ధాంతము వైదికవాఙ్మయములో వ్యక్తమై సర్వజనసులభము కాకున్నది. భాషాక్లేశమే కాక భావక్లేశమును కలదు. అంతేకాక యాజ్ఞిక, తాత్త్విక, ద్వంద్వార్థబోధకమై ఒప్పుచున్న వేదమంత్రముల అర్థము, స్ఫూర్తి సువిశదముగ, సాకల్యముగ బోధపడుటకు అనుభవమును ఆవశ్యకము. అనుభవమూలకముగ అంతరార్థములను వివరించునపుడు మనోగతముగ వాటిని తర్కించుట పొసగదు. ఇట్లు అతర్క్యమగు అనుభవజన్యమగు ఉపాసనాచోదితమగు అంశము లిందు కలవు.

---

గ్రంథాంశమగు విరాట్స్వరూపసిద్ధాంతమును, పురుషసూక్తాదిమంత్రములకు శ్రీ జోశ్యులవారు చేసిన అన్వయమును సవిస్తరముగ ప్రస్తావించుట కిందు తావుచాలదు. సరళముకాని భాషయొక్క అవరోధము, గహనమేఱగు భావముయొక్క క్లేశము, కొల్లలు కొల్లలుగానున్న అచ్చుతప్పుల బాధ విషయగ్రహణ కడ్డుతగులుచున్నను ఈ గ్రంథము ముడిబంగారుగని యని, ఉద్గ్రంథమని తలదాల్పవలసిన దనుట నిస్సంశయము. వైదికవాఙ్మయ, విచార, సంప్రదాయములు నానాటికి దూరగిలిపోవుచు స్మృతిమాత్రావశిష్టము లగుచున్న ఈతరుణములో, అందును తెలుగుభాషలో తపస్స్వాధ్యాయసంపన్నులగు శ్రీ జోశ్యుల వారు పూనుకొని ఇట్టి ప్రవచనముచేయుటయు, ఈపాటి ఆదరాభిమానములతో గ్రంథము వెలువడుటయు ఎంతేని ముదావహము.

ఆ. దా.

---

## పరమాణుగాథ

కర్త: కొమరవోలు వెంకటసుబ్బారావుగారు, బి. ఏ., ప్రచురణకర్తలు: వేంకట్రామ అండ్ కో., సికింద్రాబాదు. వెల ౧౦ రూ.

హిరోషిమా, నాగసాకినగరాలను 'పరమాణు బాంబులు' విధ్వంసంచేసింది మొదలు వాటిని గురించి బాగా తెలుసుకోవాలనే కోరిక ప్రబలింది. పరమాణు తత్వాన్ని గురించీ, దాని శక్తిని గురించీ తెలిపే గ్రంథాలు తెలుగులో లేని లోటును తీర్చటానికి చేసిన మొదటి ప్రయత్నం ఇది. శాస్త్రజ్ఞానం లేని సామాన్యమానవుడికి పరమాణుతత్వంలాటి క్లిష్టమైన విషయాన్ని అర్థమయే ధోరణిలో అందరికీ అందుబాటుగా వుండే పద్ధతిలో ఈపుస్తకంలో అందించటానికి రచయిత ప్రయత్నించాడు.

తొలిపలుకులో శ్రీ తి. రామమూర్తిగారు చెప్పినట్లు శాస్త్రీయమైన విషయాల్ని తెలుగుభాషలో అందించటమే గొప్పసంగతి. కాని రచయిత అంతటితో తృప్తిపడి వూరుకోలేదు. "ఆయన ప్రాచ్యపాశ్చాత్య విజ్ఞాన ప్రవాహములకు లంకెపెట్టుటకై ఉద్యమించెను. ప్రాచీనభారతమున యోగులు తపశ్శక్తివలన దర్శించిన ఫలితములకును, నేడు పాశ్చాత్యులు భౌతికప్రయోగ విజ్ఞానముతో సాధించుచున్న సత్యములకును సాదృశ్యము కన్పట్టునని సూచించి ఆయన మంచిపనిచేసెను" అన్నారు రామమూర్తిగారు.

పరమాణువునుగురించి ప్రాచీనఋషుల అభిప్రాయాలనూ వాదాలనూ మొదటి అధ్యాయంలో సమగ్రంగా చర్చించారు. రెండవ అధ్యాయంలో పాశ్చాత్యవిజ్ఞా

నానికి పునాదులు వేసిన గ్రీకుశాస్త్రజ్ఞుల మతాన్ని క్షుణ్ణంగా చర్చించారు.

పరమాణుస్వభావం, పరమాణునిర్మాణం, పరమాణు గర్భవిచ్ఛేదనం మొదలైన ప్రముఖవిషయాలన్నిటినీ రచయిత మిగిలిన అధ్యాయాలలో చర్చించారు. తొమ్మిదో అధ్యాయంలో ఈనాటి నాగరికతకూ, ఆటంబాంబులకూ కల సంబంధాన్ని రచయిత విపులంగా నిరూపించారు. జాతులు పరస్పరవినాశనానికి ఆటంబాంబులతో చెలగాటం ఆడటం ఎంత ఘోరమో ఈ ప్రకరణంలో వర్ణించారు. హిరోషిమా నాగసాకీ నగరాలమీద ఆటంబాంబు ప్రయోగం జరిగినప్పటి సంఘటనలుకూడా వివరంగా పేర్కొన్నారు. ఇంతటి ఘోరవినాశనానికి కారణమైన ఆటంబాంబునే రష్యనులు నదులదారులను త్రిప్పివేసి ఎడారులను సస్యశ్యామలం చేయటానికి వినియోగించారట. సక్రమంగా వినియోగిస్తే పరమాణువుకూడా మానవుడి అభ్యుదయానికి తోడ్పడుతుంది. పరమాణువునుగురించిన ప్రాథమిక సూత్రాలనగ్గరినించి అధునాతనమైన పరిశోధనలవరకూ ఈ గ్రంథంలో రచయిత చర్చించటానికి పూనుకున్నారు. విషయం గహనమైనప్పటికీ వివరణం సాఫీగా ఆకర్షణీయంగా వుంది. క్లిష్టమైన విషయాలను చాలాచోట్ల సులువైన మామూలు ఉదాహరణలద్వారా స్పష్టం చేశారు. పరమాణుచరిత్రనుగురించి ఇది తెలుగులో ప్రమాణగ్రంథం అనటంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

రచయిత వాడిన పారిభాషికపదాలుమాత్రం సామాన్యపాఠకుణ్ణి బెదరకొట్టేసేట్లుగా వున్నయ్. పాశ్చాత్యవిజ్ఞానం దేశభాషల్లో ప్రచారం కావలసిన ఈ తరుణంలో సాధ్యమైనంతవరకూ అన్ని భాషలవారికీ పనికివచ్చేట్లుగా సంస్కృతంలో పారిభాషిక పదాలు ఏర్పడవలసిన అవసరం వుంది. ఇటువంటి ప్రయత్నాలద్వారా కొన్నాళ్ళకి దేశానికంతకీ పనికివచ్చే పదాలు సృష్టికావచ్చును.

శాస్త్రవిషయాలను విశ్వవిద్యాలయాల్లోకూడా మాతృభాషలోనే బోధించాలనుకుంటున్న ఈ రోజులలో ఇటువంటి గ్రంథాలు ఇంకా విరివిగా వెలువడి బాగా ప్రచారంలోకి రావాలి.

వసంతరావు వెంకటరావుగారన్నట్లు, జనసామాన్యాని కుద్దేశింపబడి నేటివరకు ప్రకటింపబడ్డ పుస్తకాల్లో శ్రీ కాశీపట్నపు కొండయ్యగారి "విశ్వరూపం" తరవాత ఈ "పరమాణుగాథ" నే పేర్కొనాలి.

"శాస్త్రి"

---

## బొనినపిల్ల (బొమ్మలకథ)

బాలబాలికలకు వినోదవిజ్ఞానాలు సమకూర్చందుకై ఆమూలాగ్రమూ నట్టిబొమ్మలరూపంలోనే భావయుక్తంగా రచింపబడిన ఒకానొక బాగ్దాదుకథ. కథాగమనికను స్థూలంగా సూచించుటకు కావలసిన చిన్న టీకకూడా ఆయాచిత్రానికి జతచేయబడింది. ఈ బొమ్మలకథను పసిపిల్లలు చాలా ఆప్యాయంగా ఆదరిస్తారనడానికి సందేహం లేదు. దీని కల్పన, రచన రెండూ చిరంజీవి బుజ్జాయివి. దీని ప్రాప్తిస్థానము: రీసైజాన్స్ ప్రింటర్స్ లిమిటెడ్, టి. నగర్, మద్రాసు. వెల ౬ అణాలు.

---

# గ్రంథస్వీకారము

## నరసింహవిలాసము (చెంచులక్ష్మి)

పద్యకావ్యము. రచయిత: గార్లపాటి సుబ్బారావుగారు, గుత్తి. వెల రూ. ౧.

---

## టైఫాయిడ్ — హోమియోపతి చికిత్స

కర్త: వేమవరపు వెంకటరమణశర్మగారు, కొత్తపేట, తూర్పుగోదావరిజిల్లా. వెల రూ. ౨-౮-౦.

---

## నా దే శ్వ రి

పద్యకావ్యము. రచయిత: రాయసం శేషగిరిరావుగారు, అడ్వొకేటు, నంద్యాల. వెల రూ. ౧.

Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad